ప్రచారిణీ గ్రంథమాల. 61.

# ధర్మపాలుడు

(ద్వితీయభాగము.)

చరిత్రాత్మకమైననవల.

రాఖాలదాస బంధోపాధ్యాయవిరచితము.

సాహితీసమితిసభ్యులును, శతావధానులు నగు

**వేదుల సత్యనారాయణ శాస్త్రిగారిచే**

వంగభాషనుండి తెనిఁగింపఁబడినది.







[illegible]

[illegible]

శ్రీవేంకట[illegible]

ఆంధ్ర[illegible] గ్రంథ[illegible]

[illegible]

1925.



పిఠాపురము.

విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల,

౧౯౩౯.



# తృతీయ ఖండము.

## ౧

### బ్రహ్మరాక్షసి.

బాగుగా తెల్లవారకమునుపే రాజపురోహితుఁడైన పురుషోత్తమశర్మ రాజవీథి దాటి కోటవైపు గబగబ వెళ్లుచున్నాఁడు. అప్పటి కింకను నగరములోనిజను లెవ్వరును నిద్ర లేవలేదు. ఒకరో యిద్దరో బాటసారులుమాత్రము వీథిలో కాన్పించినారు.

ఆసమయముననే దాసి యొకతె పూజాసామాగ్రి నెత్తిని పెట్టుకొని కోటలోనుండి ఆదారినే వచ్చుచున్నది. పురోహితుని దూరమునుండి చూచి ఆనవాలుపట్టి పదిబారలదూరమున ఆగిన దామె. దగ్గరికి రాఁగానే "ఎవరు? పురుషోత్తమశర్మగారా యేమిటి?" అని అతనిని అడిగినది.

అతఁడామాట వినిపించుకొనకుండనే తొందరతొందరగా వెళ్లిపోసాగినాఁడు. అది చూచి ఆమె మరల "పలుకే బంగారమైపోయినదా యేమి. స్వామీ? ఇంతప్రొద్దుటనే ఎక్కడికి షికారు?" అని అడిగినది. పురోహితుఁడామాటమీద చిరాకుపడుచు ఆగిపోయినాఁడు. కాని నోరు మెదపలేదు.

"స్వామీ! నన్నానవాలే పట్టలేదా యేమిటి?" అని కోరచూపు చూచుచు ఆమె మరల అడిగినది.

"ఎవరు నీవు?" అని బొమలు చిట్లించుచు పురోహితుఁడు చిరాకుతో అడిగినాఁడు.

" నేనే. ఇంత బహుపరా కెంతుకయ్యా? అప్పుడే ఏమంత ఒరిగిపోయినదని మనుష్యులనే మరచిపోయినావు?"

" నేనెప్పుడును నిన్ను చూచినట్లు లేదే! ఎవరు నీవు? ఆసు బైట నడివీథిలో నిలువఁబడి నాతో వేళాకోళమా నీకు? నేనెవరో ఎరుఁగుదువా?"

" అబ్బో! ఎంతతలబిరుసు ముదిరిపోయినది? నీపుట్టుపూర్వోత్తర మంతయు నే నెరుఁగుదును. నీతాతముత్తాతలనుంచి ఎరుఁగుదును. మహాదేవునిగుడిలో నీవు పూజారివై ఉన్నప్పుడు నిన్ను చూచి చూచి నాకన్నులు తడకలు పడినవి. నీవు పురుషోత్తమశర్మవు కావూ? ఇప్పుడు సదుమూతరపురాజపౌరోహిత్యము వచ్చినదని కన్నుమిన్ను కనఁబడుట లేదు. నీవు వెనుకటివారి నందరిని మరచిపోయినావు. స్నానవాలు పట్టుట అటుంచు. వీథిలో నాతో మాట్లాడుటే నీకు మానహాని అయిపోయినది. అబ్బా! ఎంతవాఁడవైనావు. ఎంత అభిమానము ముంచుకొనివచ్చినదయ్యా! కాలు క్రిందఁబెట్టవలసిన అవసరము లేనప్పుడు కన్నులు నెత్తిమీఁదికి వచ్చునులే. అది నీతప్పుగాదు. ఇప్పుడు నీవు అర్థరాత్రి గొడుగు తెమ్మనేస్థితిలోకి వచ్చినావు. చెడిబ్రతికినవానివాలక మీలాటిదేలే. సరే లే. ఉండు. నీతలబిరుసుతనము సంగతి నేను కనుఁగొనెదను. నీలోటుపాట్లన్నియు నేనెరుఁగుదును. నీవేషము, నీసంగతి, నీనడత, నీఆనుపానులు కనఁబడినవారితో నెల్ల చెప్పి నీబండారము బైటఁబెట్టెదను. రేపీపాటికి చూడు నీ పాట్లు?"

" అసలు మొదట నీవెవరో చెప్పు. నీపేరు జ్ఞాపకము లేదు. చెప్పు. నీవు—మాఘూ—కాదు—మాఘీ—అబ్బా! చెక్కమతిమరపు వచ్చిపడినది. [illegible] వేగుచీఁకటిపేరు. అదిగాక నేనిప్పుడే స్నా

లేచినాను. ఇంకను కన్నులలో నిద్ర కన్నులలోనే ఉండిపోయినది. మసకలు విడిపోలేదు. చూడు! నీపేరు మాధవికాదూ? వేళాకోళముగా ఆనవాలుపట్టినంతమాత్రాన ఇంతకోప మెందుకు నీకు?"

"వెళ్లు. వెళ్లు. నీతో వేళాకోళము లేదు; వెక్కిరింత లేదు. ఇంక నాతో నీవు అట్టె మాట్లాడకు. నీసంగతి తెలిసిపోయినది."

"చూడు. మాధవీ? ఒక్కమాటలో నీకింతకోపము వచ్చినే నేను బ్రతుకఁగలనా? నీచేతులు రెండును—కాదు కాళ్లురెండు పట్టుకొని బ్రతిమాలుకొందును. నాతప్పు క్షమించు. అయిన దేదో అయినది. ఇంక ఇటువంటివేళాకోళ మెప్పుడును చేయను. నామాట విను. నన్ను కటాక్షించు. క్షమించినా నని అనుమరి?"

అతని అవస్థ చూచి మాధవికి పట్టరానినవ్వు వచ్చినది. కాని లోలోపలనే నవ్వుకొని గంభీరముగా "సరే క్షమించుట కేమిలే? ఇంత తెల్లవారకముందే పరుగెత్తిపోవుచున్నా వెచ్చటికి?" అని అడిగినది.

పురోహితుని ప్రాణములు కుదుటఁబడినవి. పండ్లిగిలించుచు వెకిలినవ్వు నవ్వి ఆతఁడు "నీకింకను తెలియనే లేదా యేమిటి?" అని అడిగినాఁడు.

"తెలియలేదు. ఏమిటిసంగతి?"

"మనమహారాజుగారికి వివాహము."

"వివాహమా? ఎప్పుడు?"

"అదే. ముహూర్తనిశ్చయమునకే ఈప్రయాణము. కొబ్బరి బొండము తీసుకొని ఈవేళనే నేను గోకర్ణమునకు పోవలెను. ఇప్పుడె గంగకు వెళ్లి ఒకమునుక వేసి వచ్చినాను. ఇంక ఇప్పుడు మహారాజ్ఞి దగ్గరికి వెళ్లవలెను. శుభలేఖ తీసుకొనవలెను. జాముప్రొద్దెక్క

ముందే బయలుదేరవలెను. ఇంతపనికూడ నిముసాలమీద జరుగవలెను. ఈగల్లంతుచేతనే నాకు మతి సరిగాలేదు.

“ అయితే గోకర్ణమునుండి మరల ఎప్పుడు వచ్చెదవు ? ”

“ ఎప్పుడోనా ? పదిరోజులలో వచ్చివ్రాలను ? ”

ఓరకంట వాడిచూపొకటి బ్రాహ్మణునివైపు విసరి నవ్వుచు మాధవి “ ఇప్పుడు నీవు కోటలోనికేనా ? ” అని అడిగినది.

“ అవును. తత్క్షణము మహాదేవిదగ్గరికి వెళ్లి వ్రాలవలెను. ”

“ ఒక్కడవు వెళ్లగలవా మరి ? ”

“ సరే ! వెళ్లలేకేమి ? ”

“ అది కాదులే. దారిలో భయము వేయదా ’ అని అడుగుచున్నాను.

“ భయ మెందుకు ? ”

“ ఎందుకును లేదులే. కాని ఆసంగతి— ”

“ ఏసంగతి మాధవీ ? ”

“ తెలియనప్పుడు నీకు చెప్పకుండుటే మంచిది. అనవసరముగా నీకు లేనిపోని అనుమానము కలిగించుట నాకిష్టము లేదు. అయినను— ”

“ చెప్పు మాధవీ ! నాకు తెలియదు. ఎక్కడ భయము ? ”

“ నీకు తెలియనప్పు డెందుకు ? ”

“ కాదు—కాదు. మాధవీ ! చెప్పు. నీకు పుణ్యముండును. నిష్కారణముగ బ్రాహ్మణుడను చచ్చిపోయెదను ! భయమన్నమాట వినబడగానే పైప్రాణములు పైకి పోయినవి నాకు. తల తిరిగిపోవుచున్నది. మాధవీ ? మాధవీ ? కొంచెము చెప్పి నా ప్రాణములు నిలుపు ! ”

“ నాకుమాత్రము సరిగా తెలియునా ? ఏమ్చునా ? చండీ మందిర మున్నది ఎఱుఁగుదువా? అక్కడ మంటపమున్నదే—ఏది?— మఱ్ఱిచెట్టుప్రక్కన—ఆచెట్టుమీదనే చాలాకాలమునుండి ఒకబ్రహ్మ రాక్షసి ఉన్నదని పుకారు. నిజము కాకపోవచ్చు ననుకో ! కాని ఈ రోజువరకు ఎవ్వరును ఒంటరిగా ఆవైపు వెళ్లుటలేదు. ”

బ్రహ్మరాక్షసిమాట చెవిఁ బడఁగానే బ్రాహ్మణునికి కంగారు పుట్టినది. చెప్పునది చెప్పుచుండఁగానే గబగబ మాధవిదగ్గరికి పోయి, ఆమె రెండుచేతులు గట్టిగా పట్టుకొని గడగడ వణకిపోవుచు “మాధవీ! మాధవీ ! ” అని పిలిచినాఁడు. ఇఁక పైమాట చెప్పుటకు అతనికి నోరు రాలేదు. అతనిగాభరా చూచి లోలోపల నవ్వుకొనుచు మాధవి “ ఎందుకు ? ” అని అడిగినది.

“ నేనొక్కఁడను వెళ్లలేను మాధవీ ! ” అని బ్రాహ్మణుఁడు చావుదెంపులమీద అన్నాఁడు.

“ అయితే నేనేమి చేయను ? ”

“ అంతవరకు వచ్చి నన్ను దిగఁబెట్టవలెను. ”

“ నేను తొందరగా గుడికి వెళ్లవలసి ఉన్నది. ”

“ ఫరవా లేదు. కొంచెం మాలస్యముగా వెళ్లవచ్చునులే నీవు. ”

“ అదెట్లు స్వామీ ? నీకు బదులుగా వచ్చినపూజారి వట్టికం కోపిష్ఠుఁడు, ఏమాత్ర మాలస్యమైనను ధామధూము చేయును. ఆ రాలుగాయికు భయపడే నేనింత పొద్దుటకడ వెళ్లుచున్నాను.

అంతలో దూరమున గుఱ్ఱపుగెక్కలచప్పుడు వినవచ్చినది. అది విని పురోహితుఁడు “ అమ్మయ్యో ! ” అని కేకవేసి పరుగెత్త మొదలుపెట్టినాఁడు. ఒకనిముసమైనతరువాత వీధివీధియావత్తు దుమ్ము రేగి పోవునట్లు గుఱ్ఱమును దౌడుతీయించుకొనుచు ఒకరౌతు కోటవైపు

వచ్చినాఁడు. మాధవి పురోహితుని యార్తనాదము విని నాలుగడుగులు ముందుకు పోయి పరకాయించి చూచినది. కొంచెము దూరములో దారిప్రక్కన ధూళిలో బోర్లపడి మూల్గుచున్న పురోహితుఁడామెకు కనఁబడినాఁడు. వెంటనే ఆమె గబగబ ఆతనిదగ్గరికి వెళ్లినది. ఆమె కాలిచప్పుడు విని పురోహితుఁడు మూల్గుడెక్కువ చేసినాఁడు. మాధవి కాసంగతి తెలియకపోలేదు! ఆమె నెమ్మదిగా అతనిదగ్గరికి వచ్చి "ఏమైనది స్వామీ?" అని అడిగినది.

"బ్రహ్మరాక్షసి! బ్రహ్మరాక్షసి!"

"ఒక్కబ్రహ్మరాక్షసి మాత్రమే నీకు కానవచ్చినది. మరి పదిబ్రహ్మరాక్ష—"

ఆమాట పూర్తిగా వినకుండనే పురోహితుఁడు గుభాలున లేచి ఎగరోజుకొనుచు అచ్చటినుండి పరుగెత్త మొదలుపెట్టినాఁడు.



## ౨

### పెండ్లికి ప్రతిబంధకము.

గోకర్ణదుర్గమున కెదుట నున్న పెద్దరావిచెట్టుక్రింద వృద్ధామాత్యుఁడైన ఉద్ధవఘోషుఁడు కూర్చుండి యున్నాఁడు. ఒకరిద్దరుసైనికులు, ఇద్దరుముగ్గురుగుమాస్తాలు, నలుగురైదుగురు పూర్వపుసేవకులు, ఊరిలోని పెద్దమనుష్యులు,అచటనే అతనిచుట్టును క్రింద బాగు చేసినజాగాలో కూర్చున్నారు. వారందరు కల్యాణీదేవిపెండ్లినిగూర్చి మాట్లాడుచున్నారు.

“రాజకుమారికి యౌవనోదయ మైనది. ఇఁక పెండ్లిచేయకుండ అట్టిపెట్టు టంతమంచిపనిగా నాకు తోఁచుటలేదు.” అని ఊరిపెద్ద అన్నాఁడు.

“ఆమె కిదివరకే ప్రధాన మైనది. మహారాజాధిరాజున కవకాశము చిక్కఁగానే కల్యాణము జరుగును. మాకుగూడ వయసు తిరుగుమొగము పెట్టినది. ఏక్షణ మేమి జరుగునో ఎవరు చెప్పఁగలరు. మానవదేహము శాశ్వతము కాదు. ముందువచ్చుసంగతి ఎవరును చెప్పలేరు. నాముక్కున ఊపిరి ఉండఁగానే రాజకుమారిపెండ్లి జరిగిపోయినయెడల బాగుండును.” అని ఉద్ధవుఁ డన్నాఁడు.

“ఇంకెక్కడనైన మరొకసంబంధము చూచుకొనుట మంచిదని నాకు తోఁచుచున్నది.” అని వృద్ధసేనానాయకుఁ డన్నాఁడు.

“ఎందుకు ?” అని ఉద్ధవుఁ డడిగినాఁడు.”

“ఇదివరకు రెండుమూఁడుసారులు ఏవో ప్రతిబంధకములు వచ్చి

పెండ్లి ఆగిపోయినది. ఇప్పు డొకవేళ జరిగినను ఈవివాహ మంతీగో అచ్చిరా దని పండుముత్తైదువలంద రనుచున్నారు."

"లేదు. లేదు. ప్రతిబంధకములు రాలేదు. గోపాలదేవమహా రాజు గోకర్ణమునుండి రాజధానికి తిరిగిపోఁగానే శుభకార్యము జరు గుటకు వీలులేనిపనితొందరలు వచ్చినవి. గోపాలదేవుఁడు దేశములో అడుగుపెట్టినవెంటనే గౌడసామంతు లందరొక్కటై ఆతనిని స్వామా ట్టుగా ఎన్నుకొన్నారు. దానికి మూలము మనగోవర్ధనమఠపు విశ్వా నందస్వామియే. తరువాత క్రొత్తసామ్రాజ్యమునకు కట్టుదిట్టము లేర్పరచి శాంతి స్థాపించుటకు కొన్నిసంవత్సరములు పట్టినది. ఇన్నా ళ్ళవర కందరుకూడ యుద్ధములతొందరలోనే మునిఁగిపోయియున్నారు. యుద్ధముగాక మఱొకదారి లేనప్పుడు చేయవలసిన దేమిటి? ఏమం దువు కేశవదాసా? దొంగాతోడుబోతులను అణఁగఁద్రొక్కకుండ, బందిపోటుదొంగలవంటి రాజుల నొకరిద్దరిని తగినట్లు శిక్షించకుండ, ఉపేక్షించినయెడల దేశములోనిప్రజలకు నిలుచుటకే ఆస్కారము లేకపోవును."

గోకర్ణదుర్గములోనివారిలో చాలవయసుచెల్లినవాఁడు కేశవ దాసు. ఉద్ధవుఁడన్నమాటలు విని ఆతఁ డొకపెద్దనిట్టూర్పు విడిచి "అంతయు జ్ఞాపక మున్నది. అది నే నెప్పటికైన మరచిపోఁగలనా స్వామీ? అప్పుడే నేను నాయిద్దరుకొడుకులను, అయిదుగురుమనుమ లను పోఁగొట్టుకొన్నాను." అన్నాఁడు.

ఆమాట కుద్ధవుఁడు కొంచెము సిగ్గుపడి "అవును. నిజమే కేశవదాసూ? ఆయరాజకపుదినములమాట అందరికంటె ఎక్కువ నీకు జ్ఞాపకముండక తప్పదు. సరే. ఆగడబిడ లన్నియు తీఱిపోయి దేశము నకు శాంతి గల్గినవెంటనే నిరాటంకముగ ఇక కల్యాణివివాహము జరు

గునని అందర మనుకొన్నాము. కాని మన మనుకొన్న ట్లన్నిపనులు జరుగవు. దురదృష్టవశమున ఆసమయమునసే మహారాజు చనిపోయి నాడు. సరే. ఈకార్యకరాదు లన్నియు గడచిపోయినతరువాత మహారాజేపెండ్లిమాట తలపెట్టు ననుకొనుచున్నాను. ఏదెట్లున్ననుశీఘ్ర ముగానే లగ్ననిశ్చయము కాక తప్పదు. చూడు. బలదేవ ! వరో జున కాంభోజ గౌడనగరమునుండి దూతగాని పురోహితుఁడుగాని వచ్చునని నే ననుకొనుచున్నాను." అని ఉద్ధవుఁ డన్నాఁడు.

"మహారాజుదగ్గరనుండి కబు రేమైన వచ్చినదా ?" అని వృద్ధ సేనానాయకుఁ డడిగినాఁడు.

"లేదు. కబురు రాలేదు. కాని రాజధానినుండి కొబ్బరి బొండము తీసుకొని పురోహితుఁడు తప్పక వచ్చునని నాకెందుకో దృఢనిశ్చయ మున్నది."

"అయితే స్వామీ ! క్షాత్రమహారాజుగారికడ కబు రేమైన ఎప్పుడైన తెలిసికొనుచున్నారా మరి ?"

"క్షాత్రమహారాజు ఏదోయిబ్బందిలో పడి కొట్టుకొనుచు న్నాఁడు. అతని కిక్కడికబురు తెలిసికొనుటకు వీలేది? పాపము? గౌడన గరమునుండి కబురు తీసుకొనిపోవుటకు దూత వచ్చినాఁడు. మహాదే వికూడ నడుమనడుమ మనమహారాజ్ఞిదగ్గరికి దాసిని పంపుచునే యున్నది."

"అయితే వీరు పెండ్లికబురుకోసమేనా ?"

"కాదు బలదేవ ! నేను వారిని అడిగి చూచినాను. వారికి మహారాజుపెండ్లినిగూర్చి తెలియనే తెలియదు."

"అయితే వీరెందుకు వచ్చినట్లుమరి ?"

"సరే! నీ కేమియు తెలియ దన్నమాట ! వీరు పూర్వము

యువరాజు దగ్గరనుండి వచ్చేవారు. ఇప్పుడు కొత్తమహారాజుదగ్గర నుండి వచ్చుచున్నారు. ఏదో కొంచెము కట్నమో కానుకో తీసుకొని ఒకమాటు, మహాదేవి దగ్గరనుండి జాబు తెచ్చుట కొకమాటు, తీర్థయాత్ర అనిచెప్పి గోకర్ణము చూచుటకు వచ్చినారు. ”

‘ ఎవరికి జాబు తీసుకొని వచ్చేవారు ? ’

‘ మహాదేవి దగ్గరనుండి మన మహారాజ్ఞిగారికి. ’

‘ ఓహో ! ’

‘ తీర్థయాత్రలకోసము వచ్చిన వారొకటిరెండుసారులు యువరాజుదగ్గరనుండి జాబు తీసుకొనివచ్చినా రని నే నప్పుడు విన్నాను. ’

‘ యువరాజు మన మహారాజ్ఞికి జాబు వ్రాసినాఁడా ? ’

‘ కేశవా ? వయసు హెచ్చినకొలది నీకు బుద్ధి లోపించిపోవుచున్నది. యువరాజుగారి జాబు చందన కుంకుమ చిహ్నములతో చీనాంబరపు పొత్తిలో పెట్టి వచ్చియున్నది. ’

‘ నిజముగానే ? ’

‘ స్వామీ ! నేను సూచించలే కున్నాను. చాలాకాలము నుండి యువరాజుగారి జాబు విలువగల పట్టుగుడ్డపొత్తిలో పెట్టి వచ్చుచునే యున్నది. కాని రాజధానినుండి తొటియాకు మడతతో ఇక మరి జాబు వచ్చు నెప్పుడు ? ’

‘ ఆ సంగతి నీ కవసరము లేదు. ’

ఆసమయముననే పొట్టిసైనికుఁ డొకఁడు వచ్చి ‘ గౌడనగరము నుండి పడవయొకటి మనరేవులోనికి వచ్చినది. దానిలో లావుపాటి బ్రాహ్మణుఁ డొకఁ డున్నాఁడు. అతఁడు పడవ దిగివచ్చుట కేనిధముగాను సెలు లేకున్నది. ’ అని చెప్పినాఁడు.

‘ ఏమిచేతి ? ’ అని ఉద్ధవుఁ డాశ్చర్యముతో అడిగినాఁడు.

'వాననీటివలన ఒక్కంతయు బండు పోసినది. క్రింద అడుగు పెట్టిన ఊబి దిగఁబడిపోవు నని ఆతఁడు దిగులుపడిపోవుచున్నాఁడు. మామూలులాటి మనుష్యుఁడు కాఁడతఁడు. ఏనుఁగంత మనిషి. ఊబిలో దిగఁబడిపోయినచో పైకి వచ్చుటబద్ధము.'

'ఆయన ఎవరో అడిగినావా?'

'లేదు. అడుగలేదు. వాలకమును బట్టి గొప్పవాఁడై యుండు ననుకొన్నాను.'

'మనిషి ఏలాటివాఁడు?'

'ఒక రెండెడ్ల బండివలె నాకు తోచినాఁడు.'

'సరే. కేశవా! మనము వెళ్లి ఆ వచ్చిన దెవరో చూచి వత్తము. ఒకవేళ పెండ్లిముహూర్తము రహితము చేసి మహారాజేమైన పురోహితుని పంపినాఁడేమో?'

అక్కడివా రందరును లేచి గబగబ రేవుకోనికి వచ్చినారు. బండుపోసిన రేవుకేసి పరికించి చూచుచు పురోహితుఁడు పడవమీఁదనే నిలుచుండి యున్నాఁడు. గట్టుమీఁదనుండియే ఉద్ధవఘోషుఁ డతనిని చూచి 'తమ రెవరు?' అని అడిగినాఁడు.

'నా పేరు పురుషోత్తమ శర్మ.'

'మహాశయుల నివాసము?'

'గౌడనగరము.'

'ఈ రాఢదేశమున కేపనిమీఁద వచ్చినారు?'

'దానికి చాలా గాథ యున్నది. ఒక్కమాటతో చెప్పుట కష్టము. గట్టునకు వచ్చినతరువాత మనవి చేసుకొనెదను. ప్రస్తుతము పడవ దిగుటకు దారి ఏదైన చూపఁగలరా?'

అతనిఅవస్థ చూచి బలదేవుఁడు నవ్వాపుకొనలేకపోయినాఁడు.

పెద్దపెట్టున నవ్వుచు ఉద్ధవునిదగ్గరికి వచ్చి ' స్వామీ ! ఆయన ఏమఁ గంతమనిషి. బుజముమీఁది కెక్కించుకొని వచ్చుట బ్రహ్మాతరము గాదు. ఊబిలో దిగఁబడినాఁడో పైకి లాగుట కిఁక మదపుటేనుఁగులు రావలసినదే. కాఁబట్టి పడవమీఁదనే బోరగిల పడుకొను మని అత నితో మీరు చెప్పండి. ' నడుమునకు త్రాడుకట్టి నేను ఒడ్డున కీడ్చె దను. ' అని చెప్పినాఁడు.

ఆమాట నుద్ధవఘోషునకుకూడ కడుపుబ్బ నవ్వు వచ్చినది. కాని బలవంతముగ లోలోపలనే అణఁచుకొన్నాఁడు. గట్టుమీఁదివా రెవరును తనమాటకు బదులు చెప్పకుండుట చూచి పురోహితుఁడు మరల దైన్యముగ ' నేను గట్టునకువచ్చు ఉపాయము లేదా ? ' అని అడిగినాఁడు.

" మీ సంగతి ఏమిటని అడిగితే జవాబు చెప్పరేమి స్వామీ ? ' అని ఉద్ధవుఁ డన్నాఁడు.

' ఇదుగో చెప్పలేదు ! నాపేరు పురుషోత్తమశర్మ. '

' సరే ఆమాట ఇదివరకే విన్నాము. '

' నేను మహారాజాధిరాజ గాడేశ్వరులవారి మహాపురోహి తుఁడను. '

' ఇప్పటివర కామాట చెప్పరేమి మరి ? '

' నా రాకకు హేతువు ఇప్పటికిని మీతో చెప్పలేదు. '

ఆమాట విని నిశ్చయముగా పెండ్లిముహూర్తము స్థిరపరచి మహాదేవి ఇతనిని పంపియుండు నని ఉద్ధవుఁ డనుకొన్నాఁడు. వెంటనే బలదేవుని చేసి చూచి " బలదేవా ? ఓబలదేవా ? ఈయన మహారాజు గారి కులపురోహితుఁడు. నిశ్చయముగా కల్యాణీదేవి పెండ్లిముహూ ర్తము స్థిరపరచి మనకు కబురు చెప్పుటకై గౌడమహాదేవి ఈయనను

పంపియుండును. తెలిసికూడ అతనితో ఎక్కసక్కెములు ఎద్దేవములు అంత మంచిపని కాదు. ఏమైనఁగానీ. ఇఁకముందు నీవేమియు మాటాడవద్దు. కేదారా! దుర్గముదగ్గర మొన్నటిగాలివాన కొకపెద్దమామిడిచెట్టు నదిలో పడిపోయినది. ఈపడవను అచటికి తీసుకొనిపో. ఆచెట్టుమీఁదుగా ఆయన కష్టములేకుండ దిగవచ్చును." అన్నాఁడు.

పడవకళాసులు మొగత్రిప్పి మామిడిచెట్టుపడినచోటికి పడవ తీసుకొనిపోయినారు. కొంచెముసేపటిలో బానకడుపు, ఊచకాళ్లు గలపురోహితుఁడు కేదారునివెంట కోటగుమ్మముదగ్గరికి వచ్చినాఁడు. ఉద్ధవుఁడు కొంతమందిసేవకులతో అచ్చటికాతని కెదురువచ్చి స్వాగతము చెప్పి సన్మానించినాఁడు.

పురోహితుఁ డొకఁడె కాని దుర్గములోనికి వెళ్లినాఁడు. మహారాజ్ఞి అతనినొకకుర్చీపై కూర్చుండఁబెట్టి కుశలప్రశ్న చేసినది. పురోహితుఁడు వరుసగా సమస్తసంగతులు మహారాజ్ఞికి నివేదించినాఁడు. అతఁడు చెప్పినసంగతు లివి. "మరల యుద్ధ మారంభమైనది. గౌడేశ్వరుఁడు దిక్కుమొక్కులేక అల్లాడిపోవుచున్నకన్యాకుబ్జయువరాజున కాశ్రయ మిచ్చినాఁడు. అది తెలిసినతోడనే చక్రాయుధునిపిన తండ్రి ఇంద్రాయుధుఁడు గౌడసామ్రాజ్యముపై దండెత్తి వచ్చినాఁడు. తమతమసైన్యములతో వెంటనే రావలసినదని గౌడేశ్వరుఁడు గౌడసామంతు లందరికి వార్త పంపినాఁడు. ఇంద్రాయుధుఁ డప్పటి కప్పుమండలాదుర్గమును ముట్టడించినాఁడు."

ఈసంగతు లన్నియు విని స్వామిభక్తిపరాయణుఁడైన ఉద్ధవుఁ డొక్కమాటుగా క్రుంగిపోయినాఁడు. ఈమాటు తప్పక కల్యాణీదేవి వివాహము జరిగితీరుననియు, లగ్ననిశ్చయము చేసి ఈబ్రాహ్మణుని అందుకోసమే పంపినారనియు, ఈశుభకార్యము కొంచెము జరిగిపో

యినయెడల తన నెత్తిమీఁదిబరువు తగ్గిపోవుననియు, ఆవృద్ధుఁ డెంతో ఆశపడినాఁడు. మనసులో ఎంతో సంతసించినాఁడు. ఏమేమో ఊహించినాఁడు. కాని ఒక్కమాటుగా ఆయాశలన్నియు నశించిపోయినవి. అతని గుండె చెదరిపోయినది. నోట మాటరాలేదు. పురోహితుఁడు మరల " వివాహముహూర్తము స్థిరపరచియే నన్నిచటికి పంపినారు. నేను బయలుదేరిననాఁటిప్రొద్దుటనే సైనికుఁ డొకఁడు వచ్చి మండలదుర్గమును శత్రువు లాక్రమించినా రని మహారాజునకు కబురు చెప్పినాఁడు. అందుచే వెంటనే మహారాజు యుద్ధసన్నాహపుగందరగోళములో పడినాఁడు. వివాహము జరుగకుండ యుద్ధమునకు వెళ్లుట మహారాజున కేమాత్రమిష్టము లేదు. కాని మహామంత్రియు, విశ్వానందసన్యాసియు అతనిని బలవంతపెట్టినారు.'' అని చెప్పెను. ఈసంగతు లన్నియు విని ఉద్ధవుఁ డొకపెద్దనిట్టూర్పు విడిచినాఁడు. మహారాజ్ఞి ఏమియు మాటాడలేకపోయినది. చివరకీసమాచారము కల్యాణీదేవికికూడ తెలిసినది. ఎవరికి తెలిసి ఏమిలాభము ?



## ౩

### పాటలీపుత్రము.

శీతకాలపు మొదటిరోజులలో ఒక నాటి తెల్లవారుజామున అయిదుగురుమనుష్యులు పాడువడిపోయినపాటలీపుత్రనగరమును దాటి పడమటికి వెళ్లుచున్నారు. భరతభూమికి పురాతనరాజధానియైన ఆనగర మిప్పుడు నిర్జనమై అడవిపెరిగి కుక్కలకు నక్కలకు నివాస మైపోయినది. రాతికట్టుగల రాజమార్గ మంతయు గడ్డిగాదము పెరిగిపోయినది. దారి కిరువంకల దట్టముగా పెరిగినతొంకలలో నడుమనడుమ మొండియిటుకగోడలు, విరిగిపోయినరాతిస్తంభములు, మేడలశిథిలావశేషములు కానవచ్చుచుండును. దారిపొడుగున అచ్చటచ్చట నాచుపట్టిపోయిన కోనేళ్లు, కలువలు తామరలు నిండిన బావ్డనబావులు కూడ కనఁబడును. క్రీస్తుశకము మగధదేశమునకు, ఉత్తరాపథమునకు, యావద్భారతవర్ష మునకు రాజధానియైన పాటలీపుత్రనగరమునకు ఎనిమిదవ శతాబ్దిచివరభాగమున ఇంతటిశోచనీయావస్థ వచ్చినది. బింబిసారుఁడు అజాతశత్రుఁడు, చంద్రగుప్తుఁడు, అశోకుఁడు, సముద్రగుప్తుఁడు మొదలైనచక్రవర్తులు కోటానకోట్లు ధనము వెచ్చించి జగదేకసుందరముగ, నిర్మించిన ఆమహానగరము ఈకథాకాలమునాటికి మహారణ్యమైపోయి ఘాతుకమృగముల కాటపట్టైనది.

“ పద. మనము గంగాతీరమువెంట వెళ్లుదము. ” అని ఆయైదుగురిలో ఒకఁడన్నాఁడు.

“ మరి మనము వెళ్లిపోతే బందీమాట ? ” అని మరొకఁడన్నాఁడు.

“ ఇక్కడ ఒకనిని ఉంచి పోవుదము. ”

ఆయడవిలో ఒంటరిగా ఉంచుట కెవ్వఁడును ఒప్పుకొనలేదు. తుద కిద్దరిని అక్కడ ఉంచి తక్కిన ముగ్గురును గంగాతీరమునకు బయలుదేరినారు.

'మరి గంగాతీరమునకు పోవుదారి గుర్తు తెలియునా?' అన్నాఁ డొకఁడు.

'ఏమిటి బ్రహ్మాండము! దక్షిణమునకు పోవు దారినిబట్టి పోయిన గంగాతీరమ్ము నిట్టే చేరఁగలము.' అని మరొకఁడు జవా బిచ్చినాఁడు.

'నీ కెట్లు తెలియును బాయీ?'

'వారణాసికి, ప్రతిష్ఠానమునకు కూడ మన మిప్పుడు నడచుచున్నదే మార్గము. మనమిప్పుడు తూర్పునుండి పడమటికి వెళ్ళుచున్నాము. గంగానది ఉత్తరపుదిక్కుగా నున్నది. మనము దక్షిణమునకు పోవు దారినిబట్టి పోయినచో గంగాతీరమునకు వెళ్ళగలము. అవును లే. మనమిప్పు డడవిలో దారితప్పిపోవుదుమనుకో! అప్పుడు గతి యేమిటి?'

'అడవిలో బయలునడుమ నిలువఁబడి పొద్దు చూచి నేను దిక్కులు తెలిసికొనఁగలను. కాని ఈవిశాలమైన మహానగరములో నూరువైపులకుపోవు దారు లున్నవి. వాటికికూడ అంతూ పొంతూ గాని చాలూమూలాగాని లేదు. వాటిమధ్య నిలువఁబడి నాలుగువైపుల ఎటుజూచినను దారియే. అడవిలేనిచోట్ల నెల్ల దారులే. రాతికట్టును పెకల్చుకొని దారిమీద ఎచ్చటను చెట్టుచేమ మొలవలేదు. అన్నిదారులకు రెండువైపుల వరుసవరుసలక్రింద ఇండ్లున్నవి. అటువంటప్పుడీ నగరాటవిలో దారితప్పిపోవు టంత ఆశ్చర్యపడవలసిన విషయముకాదు.'

ఆ బాటసారు లిట్లు మాటాడుకొనుచు ఉత్తరముగా పోవుమార్గమునుబట్టి గంగాతీరమునకు పోసాగినారు. కొంచెముసేపటిలో వారికి పాడుపడిననగరము వెనుక గంగాతీరమునందలి తెల్లని యిసుకదిబ్బలు కానవచ్చినవి. అచ్చటనే రేవునకు దగ్గరగా కొన్నిగుడారములు వేసియున్నవి. వాటిలో వందమందికి పైగా గుఱ్ఱపురౌతు లున్నారు. వారు వీరిని చూడఁగానే కేకలేసి పిలిచినారు. వీరుకూడ డేరాల దగ్గరికి వెళ్లినారు.

వెంటనే ఒకసైనికుఁడు "మీరు ఎక్కడికి వెళ్ళుచున్నారు ?" అని అడిగినాఁడు.

ఆపలుకరించినవానిగొంతుక ఆనవాలుపట్టి బాటసారులలో ఒకఁడు గబగబ ముందరికి వచ్చి 'ఎవరు ? జయనాగుఁడా యేమిటి ?' అని ప్రశ్నించినాఁడు.

'అవును. నీ వెవరు ?'

'ఆనవాలు పట్టలేదా యేమిటి ? నేను మోహనుఁడను.'

బాటసారులు ముగ్గురును డేరాలోనికి వెళ్లి సైనికులతో పాటు కూర్చున్నారు. అప్పుడు మోహనుఁడు జయనాగునికేసి చూచి "దారిలో శత్రువులజాడ ఏమైన తెలియవచ్చినదా ?" అని అడిగినాఁడు.

'ఉద్దండపురదుర్గము విడిచిపెట్టి బయలుదేరినతరువాత నాకు కత్తిపట్టుకొన్న మనుష్యుఁ డొక్కఁడైన కనఁబడనే కనఁబడలేదు. ఇఁక శత్రువులమాట చెప్పేదేమిటి ?'

'అయితే కన్యాకుబ్జసైనికు లతిరథులు మహారథు లని విన్నాను. వా రేమైనారు ?'

"చావుదెబ్బలమీద వారొక్కసారిమాత్రము మండలాడు

ర్గము ముట్టడించినారు. కాని ఇంతలో పులిపొందిపుత్రలాగున విమలనంది వచ్చి దుమికినాఁడు. అతనిసేనను చూచి వారు వెనుదిరిగిచూడకుండ వచ్చినదారి పట్టినారు."

" అయితే విమలనంది ఇప్పు డెక్కడ? "

" శోణసంగమముదగ్గర స్కంధావార మేర్పరచుకొని అతఁడు మహారాజుకోస మెదురుచూచుచున్నాఁడు. అతనివెంట అయిదువేల సైన్య మున్నది. చేయవలసిన దేమియు లేకపోవుటవలన వారికి పిచ్చి యెత్తినట్లున్నది. "వెనుక ఒకమారు మనగోపాలదేవచక్రవర్తి అయిదువేలసైన్యముతోనే బరేంద్రిమండలమునుండి ఘూర్జరులను తఱిమి తఱిమి కొట్టినాఁడు. ఇప్పు డున్నసైన్యముతో మనముకూడ వారణాసిని, చరణాద్రిని అవలీలగ ఆక్రమించుకొనఁగల" మని ఆసైనికులు గోలలెత్తుచున్నారు. కాని మహారాజగారిసెలవు లేకుండ శోణనదము దాటిపోవుటకు విమలనంది ఒప్పుకొనలేదు. "

" అవును. ఆమాట నిజమే. మహారాజుగారిసేనకూడ రెండు మూఁడురోజులలో చేరఁగలదు. "

" అయితే మహారాజుగారివెంట ఎవరెవరు వచ్చినారు? "

" మహాకుమారవాక్పాలదేవులవారు, మహామాత్యగర్గదేవులవారు నగరరక్షణకోసము నగరమందే ఉండిపోయినారు. తక్కినగాడ మహాసామంతు లందరును వచ్చినారు. "

" అంద రనఁగా? "

" ఉద్ధారణపురసామంతుఁడు కమలసింహుఁడు, దండభుక్తిసామంతుఁడు రణసింహుఁడు, డెక్కారీసామంతుఁడు ప్రమథసింహుఁడు, దేవగ్రామసామంతుఁడు వీరదేవుఁడు, పదున్నాసామంతుఁడు జయవర్ధనుఁడు వచ్చినారు. ఉత్తరాపథపురమునుండి పెద్దనాయఁడు భీష్మదేవుఁడు

కూడ వచ్చినాడు. ఈమాటు యుద్ధము బ్రహ్మాండముగా జరుగునని నేననుకొనుచున్నాను. "

" మోహనా ! నీకేమైన పిచ్చిపట్టినదా ? యుద్ధము చేయుటకు శత్రువు లేరి ? సరేకాని తీరభుక్తి సామంతులందరును విమలనందితో కలసి మనమహారాజుగారినాయకత్వము స్వీకరింతురని విన్నాను. అయితే మహారాజుగా రెప్పుడు వచ్చెదరు ? "

" పగలు భోజన మిక్కడనే జరుగునట్లు వత్తురనుకొనెదను? "

ఒకజాము ప్రొద్దెక్కినప్పటికి డేరాలు తీసుకొని రెండుమూడు బండ్లు గంగాతీరమునకు వచ్చి చేరినవి. రేవులోని మఱ్ఱిచెట్టుక్రింద గుడారములు వేసినారు. మోహనుడును, అతనితో కలసివచ్చినవారును వంట చేసుకొనుటకు మొదలుపెట్టినారు. పగలు మూడుజాముల ప్రొద్దు తిరుగునప్పటికి గౌడమహాసామంతులతోను,ఐదువేలసైన్యముతోను, మహారాజాధిరాజ ధర్మపాలదేవులవారు అచటికి వచ్చినారు. భోజనాదు లైనవెంటనే వారందరును విమలనంది దండు విడిసిన చోటికి ప్రయాణమైనారు. వారివెంట నూరుగురంగరక్షకులుమాత్రము వెళ్లినారు. తక్కిన యావత్తుసైన్యము విశ్రాంతికొఱకు మచ్చటనే ఆగిపోయినది.

## ౪

### మగధరాజ్యము — గౌడేశ్వరుఁడు.

మరునాఁడు పెందలకడనే లేచి గౌడసామంతు లొక్కరొక్క రుగా మహారాజుపటకుటీరముదగ్గరికి రాసాగినారు. అప్పటి కింకను మహారాజు నిద్రలేవలేదు. ద్వారమున కాపలాయున్న విమలనంది ఖడ్గహస్తుఁడై అక్కడే నిద్రపోవుచున్నాఁడు. అతని కాళ్ళకడ మహారాజు గారి తైనాతి కైవర్త గోవిందదాసు పండుకొని యున్నాఁడు.

మహాసామంతు లందరును డేరాముందర గుమిగూడి మహా రాజుకోసము కనుపెట్టుకొని యున్నారు. మంచుపడిన గడ్డిమీద కత్తి పడవేసి వృద్ధుఁడైన భీష్మదేవుఁడు దానిమీదనే కూర్చున్నాఁడు. అది చూచి సామంతు లందరు తడిగడ్డిమీదనే తాముకూడ కూర్చున్నారు.

'మహారా జింకను నిద్రలేవనట్లున్నది ?' అని కమల సింహుఁ డన్నాఁడు.

'లేదు. మహారాజు మేల్కొన్నయెడల గుమ్మమున విమల నంది పడిగా పెందుకు ?' అని ఉద్ధవఘోషుఁడు జవాబిచ్చినాఁడు.

'చూడు ! కమలసింహా ? మన మిచ్చట పడిగాపు పడియుం డుటకన్న సాధ్యమైనంతత్వరగా వారణాసిని ముట్టడించుటకు వెళ్లుట మంచిది. శత్రువులు కానరానప్పుడు మనకంతకన్న మంచిమార్గ మేమున్నది ?' అని భీష్మదేవుఁ డన్నాఁడు.

'అకారణముగా కన్యాకుబ్జరాజ్యమును ఆక్రమించు టంతమం చిపనిగా నాకు తోఁచుటలేదు.' అని ఉద్ధవుఁ డన్నాఁడు.

'చూడు ! ఏకబురు తెలుపకుండ కన్యాకుబ్జరాజు మండలాదు

గ్గముచు అకస్మాత్తుగా ముట్టడించలేదా మరి ? వారే ముందుగా దం డోపాయమునకు దిగినప్పుడు మన మింకను సామమును పట్టుకొని వ్రేలాడుట తెలివితక్కువపని. ఖడ్గవాదమునకే గాని ఇఁక శాస్త్రవా దమునకు వీలులేదు. ఎవరిఇష్టము వారిది. కన్యాకుబ్జసైన్యము కరూ శదేశమందో లేక కాశీనగరమందో మనకోసము కనుపెట్టుకొని యున్న దని నాతలంపు. ఇంద్రాయుధుఁడు మరల కొంతసైన్యము సాహా య్యము పంపఁగానే ఆసైన్య మీసైన్యము కలసి మనల డీకొనును.'

భీష్మదేవునిమాటకు పట్టరాని ఉత్సాహము కలిగి "స్వామీ! మీమాట నిజము. మనమీవేళనే శోణనదము దాటి కరూశదేశ మును ఆక్రమించుట మంచిది." అని కమలసింహుఁ డన్నాఁడు.

'నాయభిప్రాయ మదే సరిగా! గాని మహారాజు సెలవో ?' అన్నాఁడు రణసింహుఁడు.

'భీష్మదేవా ? ఇప్పటికే చాల ప్రొద్దెక్కినది. మహారాజు గారు నిద్ర లేవలేదు. ఆయన బయటికి రాఁగానే కొంచెముసే పామాట ఈమాట మాట్లాడి ప్రయాణమునుగూర్చి ఆలోచనపాలో చన ముగియునప్పటికి ఎంతలేదన్నను జాముప్రొద్దెక్కిపోవును. అంత వరకు మే మూరకే కూర్చుండు టెందుకు ? ఈలోపున జట్లుజట్లుగా విడఁదీసి గుఱ్ఱపుదండును ప్రయాణమునకు సిద్ధము చేసెదము. పాటలీ పుత్రముదగ్గర ఆగిపోయిన అయిదువేలసైన్యముకూడ ఇప్పటి కిక్కడికి రావలసినదే! సరే! అదిగడియకో అరగడియకో వచ్చితీరును, శోణ సంగమము కాపాడుట కది చాలును. ప్రమథసింహునిఅభిప్రాయము తెలిసికొనుఁడుమీరు!' అని జయవర్ధనుఁ డన్నాఁడు.

'మాది రాఢదేశము. యుద్ధముతప్ప నాకేపన్నాగములు తెలియవు. రాజనీతిలో బఖేంద్రమండలయోధులది పెట్టినపేరు. అబు

ద్ధిబలమువల్లనే వారు చాలాకాలమునుండి మమ్మోడఁగొట్టుచున్నారు. సామాన్యవిషయములోఁగూడ మాబుద్ధులు పనిచేయలేవు. ఇది మామూలుపనే ! కాని లాభమేమిటి ?' అని నవ్వుచు ప్రమథసింహుఁడు బదులుచెప్పినాఁడు.

'ప్రమథసింహా ! పదున్వారాజు చెప్పినమాట నిజము. చూడు! గోపాలదేవమహారాజును వట్టిపిరికివాఁ డని సామాన్యు లనుకొందురు. కాని అతనివంటిధీరుఁడు, దూరాలోచనగలవాఁడు, ఓఁగాములు తెలిసినవాఁడు, మఱొకఁడీబరేంద్రిమండలమున మందుకైనలేడు. సాధకబాధకము లాలోచించకుండ, ముందువెనుకలు చూచుకొనకుండ అతఁడేకార్యమును సంకల్పించఁడు. ఏకార్యమునకైన ముందడుగు వేసినాఁడో అది నెరవేరినదన్నమాటే. అతఁడు సిద్ధసంకల్పుఁడు. త్రికాలజ్ఞుఁడు. సరే దానికేమి ! ముందు నీవువిమలనందిని లేవు. కమలసింహా ! నీవు మాదండధరులకు కబురుపంపు.' అని భీష్మదేవుఁడు చెప్పినాఁడు.

ప్రమథసింహునిపిలుపుతో విమలనంది ఉలికిపడి లేచినాఁడు. కన్నులు నులుముకొనుచు అతఁడు, నేలపై చతికిలఁబడి కూర్చున్నమహాసామంతులను చూచి సిగ్గుపడిపోయినాఁడు. కమలసింహునికబురుతో సేవకులుకూడ డేరాదగ్గరికి వచ్చినారు. సామంతులందరు తమతమసేనల నన్నిటిని ప్రయాణమునకు సన్నాహపరచవలసినదని ఆసేవకులకాజ్ఞాపించినారు. విమలనంది మెల్లమెల్లగా భీష్మదేవునికడకు వచ్చి "స్వామీ ! ఏమిటిసంగతి ?" అని అడిగినాఁడు.

'మేమిప్పుడే శోణనదము దాటి వెళ్ళవలయునని యత్నించుచున్నాము. నీవుకూడ ప్రయాణసన్నాహముమీద ఉండవలసిన దని నీసైన్యమున కాజ్ఞాపించు.'

"సెలవైనదా మరి ?"

"నిద్ర లేవఁగానే మహారాజు సెలవు తీసుకొందుము."

ఆమాట విని విమలనంది నిర్వేరపడినాఁడు. రెప్పవాల్చక భీష్మదేవుని కేసి చూచుచు అతఁడు నిలఁబడిపోవుట చూచి ప్రమథ సింహుఁడు "ఓయీ ! నందీపుత్రా ! మేము తెల్లవారకుండ ఇచటికి వచ్చి కనుపెట్టుకొని యున్నాము. ప్రయాణమువిషయమై అందరము కలసి యోచన చేసిచేసి చివర కొకదారికి వచ్చినాము. అందరము కలసి నిర్ధారణచేసినపనికి మహారాజెప్పుడుకూడ అడ్డుచెప్పఁడు" అని అన్నాఁడు.

ఇంతలో గోవిందదాసు వచ్చి మహాసామంతు లందరికి ఆసనములు తెచ్చివేసినాఁడు. అది చూచి ప్రమథసింహుఁడు "ఇప్పుడిఁక ఆసనము లవసరము లేదు. యుద్ధయాత్రికులకు పచ్చగడ్డియే సుఖాసనము." అని అన్నాఁడు.

అప్పటి కప్పుడే ప్రయాణముసంగతి స్కంధావారమునం దంతట ప్రాకిపోయినది. పట్టరానిఉత్సాహముతో సైనికు లెల్లరు కేకలు వేయ మొదలుపెట్టినారు. కొందఱుకొందఱు గౌడేశ్వరునిగూర్చి జయ ఘోష పెట్టినారు. ఆజయఘోష రానురాను సైన్యమందంతట చెల రేగినది. ఆజయకోలాహలమువలన మహారాజునకు నిద్రాభంగమైనది.

మహారాజు పటకుటీరము వెలుపడఁగానే మహాసామంతు లందరు లేచినిలఁబడినారు. ఆసమయమునకే కన్యాకుబ్జయువరాజును, ఒకబౌద్ధసన్యాసిని వెంటఁబెట్టుకొని విశ్వానందుఁడచటికి వచ్చినాఁడు. మొట్టమొదట ఉద్ధవఘోషుఁడుమాత్రమే వారిని చూచి నమస్కారము చేసినాఁడు. ఉద్ధవుఁ డెవరికో నమస్కరించుచున్నాఁ డని ప్రమథసింహుఁడు ఊరక వెనుకకు తిరిగి చూచినాఁడు. అది చూచి సామం

తులును మహారాజునుకూడ వెనుకకు చూచినారు. విశ్వానందుఁడును చక్రాయుధుఁడును ఆతనికి కాన్పించినారు. వెంటనే అతఁడు విశ్వానందునికి ప్రణామముచేసి చక్రాయుధుని కభివాదనము చేసి స్వాగతము చెప్పినాఁడు. కాని వారివెనుకనే నిలువఁబడియున్న బౌద్ధసన్యాసిని ఆతఁడు చూడలేదు.

“ స్వామీ! ఎప్పుడు వచ్చినారు మీరు ? మీరు వచ్చినసంగతియే నాకు తెలియలేదు. ” అని మహారా జాశ్చర్యముతో విశ్వానందుని అడిగినాఁడు.

“ ఇప్పుడే వచ్చినాము. మాతోకూడ క్రొత్తవారొకరు వచ్చినారు. ”

“ ఎవరువారు ? ”

“ గుర్తించలేదా యేమిటి ? ” అని క్రొత్తసన్యాసిని ముందకిత్రోసినాఁడు విశ్వానందుఁడు.

మహాస్థవిరబుద్ధభద్రుని చూడఁగానే మహారాజు నిశ్చాంతపోయినాఁడు. మణిదత్తునిగృహమున త్రిరత్నములను ముట్టించి మహారాజుతో శపథముచేయించినవాఁ డితఁడే.

“ మహారాజాధిరాజ! ఎన్నో యేండ్లకు పిమ్మట నేఁడే బౌద్ధసన్యాసి మగధదేశమున బహిరంగముగా రాజసభకు రాఁగలిగినాఁడు” అని బుద్ధభద్రుఁడు నవ్వుచు అన్నాఁడు.

“ మహాస్థవిరా! స్వాగతము ” అని నవ్వుచు మహారాజు బదులుచెప్పినాఁడు.

ఈసమయముననే భీష్మదేవుఁడు కొంచెము ముందుకు వచ్చి “ మహారాజాధిరాజ! చాలాసేపటినుండి మేము తమకోస మీగుమ్మమున కాచుకొని యున్నాము. ” అన్నాఁడు.

"అయితే క్షమించవలెను తాతగారూ?" అని చిరునవ్వు నవ్వుచు అన్నాఁడు మహారాజు.

"శోణనదము దాటుటకు తమసెలవైనయెడల మేము తగిన సన్నాహములో నుందుము."

"నిలుచున్నపాటున?"

"అవును. గుప్తసైన్య మంతయు ప్రయాణమునకు సంసిద్ధమైనది."

"ఆలోచించకుండ ముందుకు చొచ్చుకొనిపోవు టంతమంచి పని కాదేమో? ప్రమథసింహ! మీరు రాజనీతియం దారితేరిన వారు. వెనుక కాపు చూచుకొనకుండ శత్రురాజ్యమున ప్రవేశించుట మంచిదా?"

"భీష్మదేవులవారు పితామహునివంటివారు. వారిమాట పూర్తిగా విన్నతరువాత తమరాలోచించి మరి సెలవిచ్చుట మంచిదని నామనవి."

"మహారాజ! కన్యాకుబ్జసైన్యము ముందుగా చెప్పకుండ మనమండలాదుర్గమును ముట్టడించినది. మనరాక విని దుర్గమును వదలిపెట్టి పారిపోయినది. ఇంతవరకు వారిజాడ మనకు తెలియనే లేదు. మండలాదుర్గము తరువాత ముద్గగిరియందో లేక హిరణ్యపర్వతమందో, లోహితదుర్గమందో లేక శోణసంగమందో, మహారాజసైన్యమును అడ్డుకొనుటకు వారికి భరసా లేనే లేదు. అయిదువేలసైన్యముతో విమలనంది శోణసంగమమున కనుపెట్టుకొని యుండి ఇప్పటికి పక్షమున కన్నపైగా అయినది. ఇంతవరకు వారి అడాపొడా కనఁబడలేదు. మండలాదుర్గమును ముట్టడించినసైన్యమైనను ఏమంత పెద్దదై యుండదు. కన్యాకుబ్జమునుండి మరల సైన్యసాహాయ్యము వచ్చువరకు వారు

మనకంటెఁ బవరు. ఈయవకాశములోనే మనము వారిని రూపుమాపుట ముఖ్యము. మరల సైన్యమువచ్చి వారికి తోడుపడినయెడల మనము లేనిపోనియిబ్బందులపాలు గావలసివచ్చును. గోళ్లతో తీరిపోవు పనికి గొడ్డళ్లెందుకు? మీరు దూర మాలోచించండి." అని భీష్మదేవుఁడు చెప్పినాఁడు.

"ఈస్వల్పసైన్యముతో మనము శత్రురాజ్యమున ప్రవేశించు టెలాగున?"

"మహారాజ! శత్రురాజ్య మెక్కడ? కరూశదేశము కన్యాకుబ్జరాజ్యపుపలుబడికిక్రిందికి రాలేదు.'

'మహారాజ! తమవెంట అయిదువేలసైన్యమున్నది. అయిదువేలసైన్యముతో విమలనంది శోణసంగమమున కనుపెట్టుకొనియున్నాఁడు. ఇదిగాక మావెంట అంగరక్షకులు మొదలైనవారు రెండువేలమందికి పైగా ఉన్నారు. ఈపన్నెండుపదమూఁడు వేలసైన్యముతో మనము వారణాసిని వశపరచుకొనలేమా?' అని జయవర్ధనుఁ డన్నాఁడు.

'పన్నెండువేలసైన్య మెందుకు? మహారాజుగారిసెలవైనచో నాయైదువేలసైన్యమును తీసుకొని వారణాసినే కాదు కన్యాకుబ్జమునుగూడ నేనాక్రమించుకొనఁగలను.' అని విమలనంది మహోత్సాహముతో అన్నాఁడు.

'ఇంతయెందుకు? మనకాల్బల మిప్పు డెంతదూరమున ఉన్నది.' అని ప్రమథసింహుఁ డడిగినాఁడు.

'ఏమైనను మూఁడునాలుగురోజులలోఁగాని కాల్బల మిచ్చటికి రాలేదు.' అని విశ్వానందస్వామి బదులుచెప్పినాఁడు.

'కాల్బలము వచ్చినతరువాత చరణాద్రినిగాని, వారణాసిని గాని ముట్టడించవచ్చును. ఈలోగా స్వల్పసైన్యము శోణసంగమము

మొదలు చరణాద్రివర కున్న ప్రదేశమంతయు మనమాక్రమించుకొన వచ్చును.' అని భీష్మదేవుఁడన్నాఁడు.

'సైన్యము లన్నియు ప్రయాణమునకు సంసిద్ధమైనవి. తమరు సెలవిచ్చినచో ముందుకు బయలుదేరును.' అన్నాఁడు కమలసింహుఁడు.

'మరిశోణసంగమమున ?' అని మహారాజడిగినాఁడు.

'మహారాజా! నావల్లఁగాదు. నన్నిక్కడనే ఉంచినయెడల నే నురిపోసుకొని చచ్చెదను.' అని విమలనంది దిగులుపడినాఁడు.

'అయితే ఎవరుమరి ? భీష్మదేవా ? తమరో ?'

'అసంభవము మహారాజా ? నేనాజన్మాంతము గుఱ్ఱపుదళముననే నడపఁగలను. దుర్గమునుగాని, తీర్థమునుగాని కాపాడుట నావలనఁగాదు. అదిగాక ఈయుద్ధమున శోణసంగమమును కాచుకొని యుండవలసిన అవసరము లేదు. ముందునకు పోయి అందర మొక్కమాటుగా పడినచో వారణాసి, చరణాద్రి, ప్రతిష్ఠానము, కన్యాకుబ్జము కూడ లోఁబడిపోవును. సందేహము లేదు.'

'అయితే వెనుకకాపు అవసరమే లేదా ?'

'మహారాజా! నామనవి చిత్తగించండి. వీరందరు యుద్ధముకోసము తహతహలాడిపోవుచున్నారు. అందరిని ముందుకు పోవలసినదని సెలవీయండి. వెనుకకాపుకోసము నేనిక్కడనే వేచియుండెదను. కాని కాల్బలము రాఁగానే నేనుకూడబయలుదేరివచ్చుటకు సెలవీయవలెను.' అని ఉద్ధవఘోషుఁడు నివేదించినాఁడు.

'కాల్బలమువచ్చినతరువాత శోణసంగమమునుగూర్చి ఆలోచించనే ఆలోచించనక్కర లేదు.' అన్నాఁడు భీష్మదేవుఁడు.

'మంచిది. ఉద్ధవఘోషునితోపాటు ఇక్కడ ఎంతసైన్యము ఉండవలెను?'

'రెండువేలసైన్యము ఎక్కువ.'

'అయితే మిగిలినయావత్తుసైన్యము ఇప్పుడే నదము దాటి పోఁగలదా?'

'ఆఁ. దాటఁగలదు. పాటలీపుత్రముదగ్గర ఆగిపోయిన అయిదువేలసైన్యముకూడ ప్రాగ్ద్రుమంములోపల ఇచ్చటికి చేరఁగలదు. వచ్చినవెంటనే శోణనదము దాటి వెళ్ళవలసినదని దానికి ఉద్ధవఘోషుఁడు మహారాజుసెలవు తెలియఁజేయఁగలఁడు.'

భీష్మదేవునిమాట పూర్తికాకపూర్వమే యుద్ధయాత్ర నిశ్చితమైనదని మహోత్సాహముతో రణసింహుఁడు, ప్రమథసింహుఁడు గొంతెత్తిఒక్కపెట్టున జయధ్వని చేసినారు. వెంటనే స్కంధావారమంతటను వందలకొలఁదివిజయశంఖములు మ్రోగినవి. సైనికుల జయనాదములకు అంతుపొంతు లేదు. పటహభేరీవాద్యరవ లప్పటికప్పుడే గుడారములెత్తివేసి శోణనదపుఇసుకతిప్పలపై నడక సాగించినారు. గుఱ్ఱపుడెక్కలతాకునరేగిన పెంధూళితో నదీగర్భము చీకటిక్రమ్మినది. సేనాముఖమందలిసైనికులజయఘోషతో భూమ్యాకాశములు మారుమ్రోగుచున్నవి. క్రోసున్నరమేర ఇసుకతిప్పలు జనారణ్యమైపోయినది.

---

౫

## వారణాసియుద్ధము.

నదము దాటినతరువాత అశ్వసైన్యము రెండుభాగములుగ విడఁదీసినారు. ఒకవేయిమందిసేనతో మహారాజు, భీష్మదేవుఁడు, వీరదేవుఁడు, ప్రమథసింహుఁడు అక్కడనే కొంచెముదూరమున స్కంధావార మేర్పరచుకొన్నారు. తలకొక అయిదువందలసైనికులను తీసుకొని రణసింహుఁడు, కమలసింహుఁడు, జయవర్ధనుఁడు, విమలనంది శత్రువులఆనుపానులు తెలిసికొనుటకు నాలుగువైపుల బయలుదేరినారు. ఒకవేయిమందిసైనికుల వెంటఁబెట్టుకొని చక్రాయుధుఁడు వారణాసిమార్గముబట్టి ముందుకు పోసాగినాఁడు. మరియొక వేయిమంది సైన్యముతో మరునాఁడే విశ్వానందుడు చక్రాయుధునికి తోడుగా వెళ్లుట కేర్పాటైనది.

మహారాజు భీష్మదేవునితో ఆలోచించి సామంతుల కందరికి "ఏసేనానాయకుఁడైననుసరే రెండురోజులకన్న ఎక్కువ స్కంధావారము విడిచిపెట్టి పోఁగూడదు" అని ఆజ్ఞాపించినాఁడు. ఆఉత్తరువు వినఁగానే విమలనంది తనయైదువందలసైనికులతో శిబిరమునుండి బయలుదేరి వెళ్లిపోయినాఁడు.

రెండురోజులలో గౌడసైన్యము కరూశదేశమును ఆక్రమించినది. పాటలీపుత్రమున ఆఁగిపోయినసైన్యము శోణనదముదాటి ఇవతలికి రాఁగానే స్కంధావార మెత్తివేసి మహారాజధర్మపాలదేవుఁడు ముందుకు బయలుదేరఁగలఁడు. మరునాఁడు నాలుగువేలసైన్యముతో ప్రమథసింహుఁడు, వీరదేవుఁడు కలసి వారణాసిమార్గముఁ బట్టినారు.

మిగిలిన రెండు వేల సైన్యముతో ధర్మపాలుఁడు, భీష్మదేవుఁడు శిబిరమందే ఉన్నారు. మూఁడవనాటికి తనను విమలనంది శిబిరమునకు రాకపోవుట చూచి భీష్మదేవుఁ డైదువందల సైన్యముతో ఆతని కలిసికొనుటకై నాలుగవనాటి ప్రొద్దుటనే ప్రయాణ మైనాఁడు. అయిదవనాటికి ధర్మపాలుఁడు భాగీరథీతీరమునకు వచ్చిచేరినాఁడు. అప్పటి కప్పుడే భాగీరథి ఆవలిగట్టున గౌడసేన విడిసియున్నది. ౧౦ కను వేల కొలఁది సైనికులు పడవలమీఁద నది దాటుచున్నారు. ఇది చూచి ధర్మపాలునకు వేడిపుట్టినది. కంగారుపడుచు గబగబ ముందుకు రాసాగినాఁడు. దారిలో విశ్వానందుఁడు, వీరదేవుఁడు, ప్రమథసింహుఁడు ఆతని కలసికొన్నారు.

“ నదిదాటుచున్న దెవరిసేన?” అని ధర్మపాలుఁడు ఆదుర్దాగా విశ్వానందు నడిగినాఁడు.

“ మహారాజ ! సంగతి సందర్భములు చాలాప్రమాదకరములుగానే ఉన్నవి. నదిదాటుచున్న సైన్యము మనదే. ”

‘ మూఁడురోజులలో డెబ్బదికోసులదూరము దాటివచ్చి నాలుగవనాటిప్రొద్దుటనే తన సైన్యముతో భాగీరథిదాటి, విమలనంది వారణాసిపైఁ బడినాఁడు. నగరములో కన్యాకుబ్జసైన్యము పదివేలకుపైఁగా ఉన్నది. ఆరోజుననే సాయంకాల మగుసరికి చక్రాయుధుఁడు భాగీరథీతీరమునకు వచ్చినాఁడు. విమలనందిచేసిన సాహసము తెలిసి నిలుచున్నపాటున గబగబ నదిదాటివచ్చి అతనిని కలిసికొన్నాఁడు. సమయమునకు చక్రాయుధుఁడువచ్చి తోడుపడకపోయినచో విమలనందితోపాటు అయిదువందలమందిగౌడవీరులు గంగలో కలిసిపోవలసినదే. కన్యాకుబ్జమహారాజు సెలవుప్రకారము వారణాసీనగరపాలకుఁడు గంగానదిమీఁదిపడవలను చాలావరకు కాల్చివేసినాఁడు. ఉన్నకొద్దిప

డవలతో రోజున నైదువందలమందికన్న ఎక్కువజనము నదిదాటుటకు వీలులేదు.' అని ప్రమథసింహుఁడు మహారాజుతో మనవిచేసినాఁడు.

'ఇప్పుడు మనకుదారి?' అని ఆతురిముతో మహారాజడిగినాఁడు.

'భీష్మదేవుఁ డిచ్చటికి రాఁగానే ఈవిషయమునుగూర్చి ఆలోచనలు జరిగినవి. అతని ఉత్తరువుప్రకారము రణసింహుఁడు తననైదువందలసైనికులతో పడవలనువెదకి పట్టి తీసుకొనివచ్చుటకు చరణాద్రినైపు వెళ్లినాఁడు.' అని విశ్వానందుఁడు చెప్పినాఁడు.

'ఆవలిగట్టునఉన్న సైన్య మెంత?'

'విమలనందిసేనతో కలసి రెండువేల అయిదువందలు.'

'ఈవలిగట్టున?'

'దాదాపు ఏడువేలవరకు ఉండవచ్చును.'

అప్పటి కప్పుడే గంగాతీరమున స్కంధావార మేర్పరచినారు. సామంతు లందరు మహారాజుతోపాటు శిబిరములోనికి వచ్చినారు. మహారాజువచ్చిన కబురు తెలియఁగానే సైనికు లొక్కపెట్టున ఆకాశము బ్రద్దలగునట్లు జయనాదములు చేసినారు. వేనవేలుకంఠములనుండి ఒక్కమాటుగా బయలుదేరిన ఆజయకోలాహలమునకు విశ్వనాథాలయగోపురశిఖరము కంపించిపోయినది. వారణాసిలోనివరుణాసంగమముదగ్గర విడిసియున్నసైన్యముకూడ ఈధ్వనివలన మహారాజురాక గ్రహించి సింహనాదము చేయమొదలుపెట్టినది. ద్విగుణీకృతోత్సాహముతో విమలనంది, చక్రాయుధుఁడు, నగరప్రాకారమును ముట్టడించినారు. కాని పదివేలసైన్యముముందు రెండువేలసైన్య మేమిపనిచేయఁగలదు?

గౌడసైనికుల నెత్తుటితో ఆదికేశవఘట్టము ఎఱ్ఱనై పోయినది. కాని ప్రాకారముమీద గౌడసైనికుఁడు కాలుపెట్టలేదు.

సైన్యము నెక్కించుకొని వారణాసిరేవు చేరినపడవలు పోయింకాల మగునప్పటికి మరల ఈవలిదరికి వచ్చినవి. భీష్మదేవుని, విశ్వానందునిశిబిరమందే యుండనియమించి రెండువందలసేనతో మాత్రము ధర్మపాలుఁడు వారణాసి చేరుటకు పడవనెక్కినాఁడు. అతనితో ప్రముఖసింహుఁడు, వీరదేవుఁడు కూడ బయలుదేరినారు. జామురాత్రి వేళకు పడవ ఆవలిదరి చేరినది. రక్తసిక్తదేహములతో విమలనంది, చక్రాయుధుఁడు మహారాజున కభివాదనము చేసినారు. విమలనంది అవస్థచూచి మహారాజు కోప మంతయు చెల్లాచెదరై పోయినది. వెంటనే విమలనందిని కౌఁగలించుకొని యుద్ధవిశేషము లడిగినాఁ డతఁడు.

" సమ్రాట్ ! శోణనదమునుండి అయిదువందలసైనికులతో నేను బయలుదేరివచ్చినాను. కాని వారిలో ఒక్కఁడుకూడ ఇప్పుడు జీవించిలేఁడు. స్వామికార్యార్థము వారందరి కాశీక్షేత్రమున శివసాయుజ్యము పొందినారు. ఒక్కగౌడసైనికుఁడైనను వరుణానది ఈవలిగట్టున దావలేదు. దుర్గప్రాకారముదగ్గర, ఆదికేశవఘట్టమున మెట్లపైని వారందరు ప్రాణార్పణము చేసినారు."

ఈమాటలు చెప్పుచున్నప్పుడు విమలనంది కన్నులు మెరిసిపోయినవి. అతఁ డుద్రేక మణఁచుకొని మరల చెప్పసాగినాఁడు. "భాగీరథిపైనున్న పడవల నన్నిటిని ఇంద్రాయుధుఁడు కాల్పించినాఁడు. అయినను మన కిప్పుడు వచ్చిన అవాంతర మేమియులేదు. మిగిలిన పడవలనుకూడ కాల్చివేయనీయండి. మనకు బాధలేదు. తమ యెదుటనే ఈవేళ తెల్లవారకుండ నేను వారణాసిని పట్టుకొనెదను. లేదా —"

“ లేదా—? ఆపైన—” లని గొణుగుగొంతుకతో ధర్మ పాలుఁ డడిగినాఁడు.

“లేదా రేపటిపొద్దుట సజీవుఁడైన గౌడసైనికుఁడు సూర్యభగ వానుకంటఁ బడఁడు. ”

“ అవుఁగాక! విమలా? లోఁబడిన ఈరాత్రియే వారణాసి లోఁబడవలెను. లేకున్న ఇఁక ఎప్పటికిని లోఁబడ దన్నమాట. ”

ఈమాట విని చక్రాయుధుఁడు కంగారుపడుచు ముందుకు వచ్చి “ మహారాజాధిరాజ! ఇది భీషణప్రతిజ్ఞ. నాకోసము నేటితో గౌడసింహాసనము శూన్యమైపోవునా? ” అని అన్నాఁడు.

“ చక్రాయుధదేవ! ఏదెట్లుకావలెనో అదట్లు జరిగితీరును. అంతయు భగవదిచ్ఛ. నేటిరాత్రితో గౌడసింహాసనము శూన్యమైపో వలసియున్నచో దాని నెవరు తప్పించఁగలరు? తెల్లవారకుండ ఈనగ రప్రాకారము నేలమట్టమైపోవలెను లేదా—”

“ లేదా గంగానది ఉత్తరతీరమున రేపు గౌడసైనికుఁ డొక్కఁ డైనను ప్రాణములతో ఉండఁడు. ” అని విమలనంది మహారాజన్న వాక్యమును పూర్తిచేసినాఁడు.

“ అవుఁగాక! చక్రధ్వజము చేతఁబట్టుకొని సేనాముఖమందు నేనుండెదను. నీవిప్పుడే సైనికు లందరితో గంగముట్టించి ప్రతిజ్ఞచే యించవలెను. ”

“ ఏమని సమ్రాట్? ”

“ ఈరాత్రి తెల్లవారులోపల వారణాసి పట్టుకొనకుండ గౌడ సైనికుఁడైనవాఁ డొక్కఁడుకూడ శిబిరమునకు తిరిగిపోడు—అని ”

క్రీస్తుశకము ఎనిమిదవశతాబ్ది చివరభాగమున చక్రాయుధు నికి సాయపడుటకై సమస్తగౌడసైన్యము యుద్ధయాత్రకు బయలుదేరి

నది. అంతకుముం దెప్పుడు మగధ దాటి రాలేదు. ఇంతవరకు ఆత్మ రక్షణకోసము ఉద్యోగించుచు తనపైకెత్తివచ్చినవారితో మాత్రమే పోరాడుటకుపూనుకొన్నది. రాజ్యకాంక్షతో పరదేశములనాక్రమించుటకు తలపడలేదు. పరదేశములవిషయమై వారెప్పుడును ఆలోచించనే లేదు. అందుచే తొందరపడి గంగానది దాటివెళ్లిన విమలనంది సాహసమునకు భీష్మదేవుఁడు మొదలైన మహాసామంతు లందరు త్రొక్కులాడినారు. మహారాజధర్మపాలుఁడు అంతగా ఢక్కామొక్కీలు తిన్నవాఁడుకాడు. మంచిపడుచుఁదనములో ఉన్నాఁడు. అందుచే ముందురాఁబోవు కష్టనిష్ఠురములఁగూర్చి తటపటాయించు స్వభావమాతనికి లేదు. విమలనంది చేసినసాహసమునకు ఆతఁడు కొంచెమైన భయపడలేదు. అల్పవయస్కులైన సామంతనాయకులు కొందరుకూడ ఈవిషయమున అతనితోపాటుధైర్యముగానే ఉన్నారు. మహారాజు చేసిన శపథమునకుకూడ వారు కంగారుపడలేదు. ఆశపథము భయముకలిగించుటకుబదులు వారికిని, సైనికులకును రణోత్సాహమును రెట్టించినది. యుద్ధముమాట చెవిఁబడఁగానే గౌడసైనికు లంద రెగిరిగంతులు వేయ మొదలుపెట్టినారు. పసిఁబట్టినవేటకుక్కలవలె శత్రువులమీాద దుముకు టెప్పుడెప్పు డని వారు కాలుత్రవ్వుచున్నారు. విదేశమందలి యుద్ధము కొంచెముగా రుచిచూచుటచే వారియావేశమునకు పట్టపగ్గములు లేకుండఁబోయినవి. సైనికు లెవరైనను, ఒకపనిచేయుటకుఁగాని, ఒకచోటికివెళ్లుటకుఁగాని, భయసూచన కనుపఱచినను, లేక కొంచెము వెనుకముం దాడినను, తత్క్షణమే క్రొత్తసైనికులు వచ్చి ఆలోటును నిరాక్షేపముగ పూర్తి చేయుచున్నారు.

మహారాజుపట్టినప్రతిజ్ఞ విని ప్రమథసింహుఁడు చాలా ఆదుర్దాపడినాడు. కాని తెగువఁజేసి ఆతఁడు మహారాజుతో నేమియు చెప్ప

లేకపోయినాఁడు. కొంచెముసేపు వెనుకముం దాలోచనచేసి కొంద రుమహాల్తీవాండ్రను వెంటఁబెట్టుకొని శిబిరరక్షణార్థై వరుణానదితూర్పు దిక్కున వేచియున్నాఁడు.

రాత్రి రెండుజాములవేళ కావచ్చినది. కాశీనగరములోని దేవాలయము లన్నిటిలో ఆరత్రికశంఖఘంటానాదములు మాటుమణఁగినవి. అప్పుడు ధర్మపాలదేవుఁడు స్వయముగా చక్రధ్వజమును చేతఁ బట్టుకొని వరుణానదినీటిలోకాలుపెట్టినాఁడు. అతనివెనుక నే మహాసామంతులు, సేనానాయకులు, నదిలోనికి దిగినారు. వారివెంట రెండు వేలగౌడసేన ముందడుగు వేసినది.

కన్యాకుబ్జసేన యుద్ధమునకు సంసిద్ధమైయున్నది. శత్రువుల ఎదుర్కొను టెప్పుడెప్పుడా యని కనుపెట్టుకొనిచూచుచున్నది. కోట బురుజులపైన, నగరప్రాకారముపైన వేలకొలఁది కాగడాలు వెలిగించినారు. ఆకాగడాలవెలుతురులో గౌడసేన నగరప్రాకారమును ముట్టడించినది. మహారాజు స్వయముగా నగరప్రాకారముదగ్గర నిలచి సైనికులను ప్రోత్సహించుచున్నాఁడు. కోటబురుజులనుండి, ప్రాకారము నుండి కన్యాకుబ్జసైనికులు, రాళ్లు, కత్తులు, కటారులు, ఈటెలు, విధివిరామము లేకుండ వర్షించుచున్నారు. సలసలమరుగుచున్ననూనెను, కరగించిన సీసమును క్రిందనున్నగౌడసైనికులపై గంగాళముల కొలఁది పోయుచున్నారు. అయినను ఎట్లో తప్పించుకొని గౌడసైనికులుకొందరు గోడ నెక్కుచునే యున్నారు. కాని అక్కడివారు ఎక్కినసైనికులను ఎక్కినట్లే క్రిందికి త్రోసివేయుచున్నారు. దెబ్బతినినకొలఁది గౌడ సైనికుల కుత్సాహము ఎక్కువగుచున్నది. అదిగాక మహారాజు స్వయముగా ప్రోత్సహించుచున్నాఁడు. అందుచే గౌడసైనికులు వెనుకముం దుచూడకుండ నక్షత్రవేగమున గోడను ఆక్రమించినారు. చాలామం

ది సైనికులు గోడపైకెక్కినారు. మందిమోపైపోవుటచూచి ప్రాకార మును కాపాడుచున్న సైనికులు వెనుకడుగు వేయసాగినారు. విమలనంది నగరప్రాకారమునుండి బురుజుపై కొక్కుదుముకు దుమికి అక్కడి సైని కులను చెల్లాచెదరుచేసినాఁడు. వెనుకకు పోవుచున్న సైన్యమును ప్రో త్సహించు చునగరపాలకుఁడు విమలనందిని ఎదుర్కొన్నాఁడు. కాని మొదటిదెబ్బతోనే నగరపాలకుని కత్తి విరిగిపోయినది. నిరాయుధుఁడై నను ఆతఁడు లోఁబడలేదు. వెంటనే విమలనంది ఆతని చంపుటకై కత్తినెత్తినాఁడు. కాని ఎత్తినకత్తి ఎత్తినట్లుండఁగానే చక్రాయుధుఁడు వారిరువురినడుమకు వచ్చి "విమలనందీ! జయసింహుఁడు నాక్షైదీ. అతనిని కాపాడవలెను." అని అన్నాఁడు.

ఈమాట విని సైనికు లందరును దిక్కాలుపోయి చూడసాగి నారు. ఏదో అడుగవలె నని విమలనంది చక్రాయుధునికేసి చూచి నాఁడు. అంతలో నగరములో ఒకచోట అగ్నిజ్వాలలు కనఁబడినవి. గౌడసైనికు లొక్కపెట్టున జయనాదము చేయసాగినారు. ఈజయధ్వని విని నగరప్రాకారముమీద మిగిలియున్న కన్యాకుబ్జసైనికులు వెనుకకు పారిపోవ మొదలుపెట్టినారు. గౌడసైన్యముపూర్తిగా ప్రాకారము నాక్రమించుకొన్నది. మహారాజు గోడనుండి దిగి నగరములోనికి వచ్చినాఁడు. అంతలో రక్తసిక్తదేహముతో యోధుఁ డొకఁడు వచ్చి "స్వాగతము ధర్మపాలదేవ సమ్రాట్టునకు" అని కేక లేసినాఁడు. అతనిచేతిలో చక్ర ధ్వజ మున్నది. అదిచూచి ఆతఁడు తనసైనికుఁడే యని గ్రహించి మహారాజు "ఎవరు నీవు?" అని ప్రశ్నించినాఁడు.

"మహారాజ! ఇంతలోనే మరచిపోయినారా? నేను జయ వర్ధనుఁడను."

గుభాలున మహారాజాతని కౌఁగలించుకొన్నాఁడు. వెంటనే కమలసింహుఁడు, వీరదేవుఁడు, విమలనంది జయవర్ధనున కభివాదనము చేసి ఆతనిచుట్టును మూగినారు.

జయవర్ధనుఁడు పడవలకోసము చరణాద్రివైపు వెళ్లినాఁడు. అతనికి కొంతదూరములో కొన్నిపడవలు దొరకినవి. వాటితో అతఁడు నది దాటినాఁడు. వెంటనే బయలుదేరి అసిసంగమము దగ్గరికి వచ్చునప్పటికి గౌడసేన వరుణాసంగమమును ముట్టడించినసంగతి అతనికి తెలిసినది. నగరప్రాకారమున వేరొకచోట ముట్టడి లేకపోవుటవలన కన్యాకుబ్జసేన యావత్తు వరుణాసంగమము దగ్గరకే వచ్చి గౌడసేన నెదుర్కొన్నది. నగరరక్షకులుకూడ మఱొకవైపున భయమేమియు లేదని చాలావర కక్కడికే వచ్చినారు. అసిసంగమమునమాత్రము కొంచెముసైన్యము కాఁపున్నది. ఈపీలు కనుపెట్టి జయవర్ధనుఁ డా స్వల్పసైన్యమును ఓడించి నగరములోనికి ప్రవేశించినాఁడు. అప్పటికి నగరప్రాకారము గౌడసేనకు లోఁబడిపోయినది.

ఈసంగతి విని మహారాజు జయవర్ధనుని ప్రశంసించినాఁడు. కన్యాకుబ్జసేన అప్పటి కప్పుడే పూర్తిగా ఓడిపోయినది. నాయకుఁడు పట్టుపడుటవలన ఓడిపోయినసైనికు లందరు మహారాజును శరణుఁ జొచ్చినారు. వెంటనే ప్రమథసింహుఁడు నగరమున ప్రవేశించి ప్రాకారరక్షణకు కట్టుదిట్టములు చేసినాఁడు.

పొద్దుపొడిచినతరువాత మహారాజును, ప్రమథసింహుఁడును అత్యాశ్చర్యముతో నదివంక చూడసాగినారు. వేలకొలఁది గుఱ్ఱపు రౌతులు నది కడ్డుపడి ఈదుకొని వచ్చుచున్నారు. అదిచూచి మహారాజున కెక్కడలేని కంగారుపుట్టినది. అది శత్రుసైన్య మనుకొని వారి నడ్డుకొనుటకు మార్గము యోచింపసాగినాఁడు. గుఱ్ఱములు

చూపుమేరదూరము వచ్చినతరువాత వాటిని తేరిపారఁజూచి ప్రమథ సింహుఁడు ఉత్సాహముతో "మహారాజ! వారు మనసైనికులే. అదుగో గుట్టములవెనుక చక్రధ్వజ మెగురుచున్నది. చూడండి!" అని అన్నాఁడు.

అరగడియసేపటిలో గుట్టపు కళ్లెము నోటఁగఱచుకొని వృద్ధుఁడైన భీష్మదేవుఁడు నది ఈదుకొని మణికర్ణికాఘట్టమునకు వచ్చి చేరినాఁడు. అతఁడు మెల్లక్కి పైకి వచ్చుచుండఁగానే మహారాజు గబగబ ఎదురువెళ్లి విస్మయముతో "భీష్మదేవా! ఏమిటిది?" అని ప్రశ్నించినాఁడు.

భీష్మదేవుఁడు తడిగుడ్డలతోనే మహారాజున కభివాదనముచేసి "మహారాజ! చక్రధ్వజము చేతఁబట్టుకొని రెండువేలసైన్యముతో ఏలినవారు స్వయముగా వారణాసిని ముట్టడించినా రని తెలిసి గౌడ సైన్యము యావత్తు నది కడ్డుపడి ఈదుకొనుచు ఈవలిదరికి వచ్చినది. లోకమున మానవున కసాధ్యమైన పనిలేదు. దానికి మీరే నిదర్శనము. మిమ్ము చూచి గౌడసేన గంగానదిని ఆదరినుండి ఈదరికి ఈదుకొని రా సాహసించినది. మీనిదర్శనమువల్లనే గౌడసైనికు లెల్లరు రణోన్మత్తులై పోయినారు. తిండిలేక, నీటనాని, చలితో వణఁకిపోవుచు అలసిపోయియున్నను యుద్ధోత్సుకులైన గౌడసైనికు లిప్పటి కిప్పుడు ప్రతిష్ఠానము ముట్టడింపఁబోవుటకు సంసిద్ధులై యున్నారు." అని చెప్పినాఁడు.

ఈమాటవిని పట్టరాని సంతోషముతో "మహారాజ! ఎంత దూరప్రయాణము చేసి ఎంతగా బడలిపోయియున్నను గౌడసేన దుర్జేయ మని మరచిపోకుఁడు. నిజమునకు కన్యాకుబ్జయుద్ధము ముగిసిపోయినట్లే. ఇక్కడ గౌడసేనలదెబ్బ రుచిచూచినపిమ్మట మరల

కన్యాకుబ్జసేన మనల నిరోధించుటకు సాహసించలేదు.'' అని ప్రమథ సింహుఁడన్నాఁడు.

బాష్పరుద్ధనేత్రములతో మహారాజు నదినీదుకొని వచ్చిన సైనికులకేసి చూచినాఁడు. సైనికులందరొక్కమారు జయనాదము చేసినారు.



## ౬

### భిల్లమాల—ఇంద్రాయుధుఁడు.

రాత్రి నాలుగవజాము నడచుచున్నది. భిల్లమాలానగరపు తూర్పు నగరివాకిట మంగళవాద్యములు ప్రయోగించుటకు మేళగాండ్రు తయారగుచున్నారు. అప్పటికిని కోటవాకిట దీపము వెలుఁగుచున్నది. నాలుగవజాము పడిగాఁపువాండ్రు తమవంతుపారా తీరుటవలన కులాసాగా కాలక్షేపము చేయసాగినారు. నగరమునకు వెనుకనున్న పర్వత శిఖరములపై నిర్మలమైన ఉషఃకాంతి ప్రకాశింపసాగినది. నగరవాసులొకరిద్దరుమాత్రము రాజవీథిని తిరుగాడుచున్నారు. నగరమున కున్న నాలుగువాకిళ్లు మూసియే యున్నవి. మేళగాండ్రలో నైణవికుఁ డప్పుడే పిల్లనఁగ్రోవిపై చేయివేసినాఁడు. ఇంతలో తూర్పువాకిటితలుపు ఎవరో తట్టినారు.

" ఎవరు మీరు ? " అని కాపలావాఁ డడిగినాఁడు.

" త్వరగా వాకిటితలుపు తియ్యి ! "

" ఇంకను వేళ కాలేదు. "

" కాకున్నను సరే తలుపు తెరువక తప్పదు. "

" ఎవరు నీవు ? "

" ఎందుకు ? "

" నీమాటకు నాకు నవ్వువచ్చుచున్నది. నీ వేమైన పరదేశివా ? "

" ఏమి ? అట్లనుచున్నావు ? "

" ఘూర్జరరాజ్యపు కట్టెఁబొగ్గసి పెటఁగి పనుకొనదను.

పూర్తిగా తెల్లవారకమునుపు స్వయముగా మహారాజఘూర్జరేశ్వరుఁడు వచ్చినను భిల్లమాలానగరపు గవిడితలుపు తెరువము. తెలిసినదా ?"

"తెల్లవార వచ్చినది. ఇంకను రాత్రి యేమిటి ?"

"ఇంకను అరగడియసేపాలస్య మున్నది."

"అయితే నీ వున్నపాటున మహారాజుగారిదగ్గరికి వెళ్లి "మహారాజాధిరాజ ! పరమభట్టారక, పరమమాహేశ్వర, అశేషభూపాలమాళిమకుటమణికోటికాంతి నీరాజిత—"

"ఏమిటి ?"

"కన్యాకుబ్జమహారాజులంగారు వచ్చినా రని నివేదించు."

"మంచిది. ఎవరు వచ్చినను సరే. కొంచెముసేపు వేచియుండవలసినదని చెప్పు."

"ఏమి ?"

"ఏమి లేదు. అక్కడనే కొంచెముసేపు కనుపెట్టుకొని యుండకతప్ప దని చెప్పు."

"నామాట నీకు సరిగా వినరాలేదా యేమిటి ? కన్యాకుబ్జమహారాజులంగారు స్వయముగా విచ్చేసి నగరివాకిట వేచియున్నారు."

"తెలిసిన దయ్యా ! తెలిసినది. అయినను మరికొంచెముసేపు వేచియుండవలెను."

"వీలులేదు. నీవు ఉన్నపాటున తలుపుతీసి తరువాత నాగభటదేవమహారాజులంగారికి కబురు చెప్పవలెను. మహారాజాధిరాజమహోదయేశ్వరుఁడు స్వయముగా భిల్లమాలాధిపతికి అతిథిగా వచ్చియున్నాఁడు. తెలిసినదా ?"

"మంచిది. తెలిసినది.. కొంచెముసేపున్న తరువాత అతిథిగా

లకు నిరాక్షేపముగ వెళ్లవచ్చును. నీ వీసంగతి వారితో చెప్పు."

ఈమాటతో వాకిటివెలుపల నిలచియున్న మనుష్యుఁడు హతాశుఁడై మారుమాటాడకుండ వెనుకకు తిరిగి వచ్చినాఁడు. రాత్రికి బందోబస్తుగా కట్టిన ఆనగరివాకిటికి కొంచెముదూరములో ఒకచోట మంచిచెక్కడపుపనితనము గల నాలుగుగుఱ్ఱాలరథ మొకటి ఆగియున్నది. తలుపు తీయించుటకు వెళ్లినమనుష్యుఁ డారథముదగ్గరికి తిరిగివచ్చి సారథిని పిలచి మెల్లఁగా మహారాజులంగారు మేల్కొనినారా ?" అని అడిగినాఁడు.

సారథి మాటాడలేదు. రథమునకు కట్టిన పెద్దకట్టుపరదాలలో పలనుండి "నేను లేచినాను. భానుగుప్తా ! నీ వొకమా టిటురా !" అని ఎవరో పిలచినారు.

'మహారాజాధిరాజా ?' అని భానుగుప్తుఁ డారథము వెనుకకు వెళ్లినాఁడు.

'మన మిప్పు డెక్కడికి వచ్చినాము ?' అని మహారాజ ఇంద్రాయుధుఁ డడిగినాఁడు.

'భిల్లమాలానగరము చేరినాము.' అని భానుగుప్తుఁడు బదులు చెప్పినాఁడు.

'అయితే సరే. ఇక ఈపరదా లన్నిటిని విప్పు. నేను రథము దిగెదను.'

'రథ మింకను నగరివాకిటనే ఉన్నది మహారాజ !'

'ఏమి ? ఎందుచేత ?'

'నగరివాకిటితలుపు లింకను తీయలేదు.'

'నేను వచ్చినట్లు చెప్పలేదా ?'

'చెప్పినాను. పూర్తిగా తెల్లవారినఁగాని తలుపుతీయరఁట !'

'లోనికి కబురుపంపలేదా మరి ?'

'పంపినాను. మహారాజు జింకను నిద్రలేచినట్లు లేదు.'

ఆసమయముననే కోలిజాముననగారావాద్యము లాంగిపోయినవి. ఘణఘణధ్వనులతో కోటతలుపులు తెరచినారు. ఇంద్రాయుధుని సెలవుప్రకారము సారథి చబుకుతో ఒకసారి సరువిసరి గుఱ్ఱములను అదలించినాడు. గుఱ్ఱపుడెక్కలచప్పుడుతో చరచర రథము కదలినది. కోటకాపలావాండ్రు వారి నేమియు పలుకరింపలేదు. భానుగుప్తుడు గుఱ్ఱమెక్కి రథమువెనుకనే పోసాగినాడు. అప్పుడే తెల్లవారుటచే నగరము చాలసందడిగ ఉన్నది. రాజవీధిని ఎడతెరపిలేకుండ గుఱ్ఱములు, రథములు, బండ్లు, అటునిటు పరుగెత్తిపోవుచున్నవి. ఆకోలాహలము విని రథములో నున్నమహారాజు సారథిని పిలచి 'అరుణగుప్తా ? మనల సన్మానించుటకై ఘూర్జరమహారాజు ఎదుర్కొలునన్నాహ మేమైన చేసినాడా ?' అని ప్రశ్నించినాడు.

'ఏమియు ఉన్నట్లు కాన్పించదు.' అని సారథి విస్మయముతో బదులుచెప్పినాడు.

'మరి రథచక్రములకిరకిరలు, గుఱ్ఱపుడెక్కల టకటకలు అంతుపొంతులేకుండ వినవచ్చుచున్న వేమి ?'

'మహారాజాధిరాజా ! అవి బేహారులతండా. నగరద్వార మిప్పుడే తెరచుటవలన వీథిలో జనసమ్మర్ద మెక్కువగా ఉన్నది. అంతే కాని మ రేమియు లేదు.'

కొంచెముసేపటిలో రథము వచ్చి ఘూర్జరరాజప్రాసాదము ముందాగినది. ఆరథపుగొప్పతనము చూచి ఒకరిద్దరుభటులు దగ్గరికి వచ్చి 'ఎవరు వచ్చినారు ?' అని సారథిని ప్రశ్నించినారు.

భానుగుప్తుడు గంభీరముగా "పరమేశ్వర, పరమమాహేశ్వర,

పరమభట్టారక మహారాజాధిరాజ కన్యాకుబ్జమహోదయ కుశస్థలేశ్వర ఇంద్రాయుధదేవమహారాజులంగారు విచ్చేసినారు. ఈరథము వారిదే." అని భటులు చెప్పినాఁడు.

ఆమాట విని భటుఁ డొకఁడు గబగబ కోటలోనికి పరుగెత్తిపోయినాఁడు. రెండవభటుని యుత్తరువుతో దౌవారికులు కోటగుమ్మము మొదలుకొని రాజప్రాసాదపుఁ బలిమెట్లవఱకు విలువయైనమడుగులు పఱచినారు. ఇంద్రాయుధదేవుఁడు మెల్లఁగా రథము దిగి ఆమడుగులమీఁదుగా నడచి మేడమెట్లదగ్గఱికి వచ్చినాఁడు. అతఁడు మొదటిమెట్టుపై కాలుపెట్టఁబోవుసమయముననే మేడమీఁది మొదటిగది తలుపు తెఱచుకొని విలువయైన తెల్లనిబట్టలు వేసుకొన్నపురుషుఁ డొకఁడు గబగబ మేడమెట్లు దిగి రాసాగినాఁడు. అతనివెనుకనే పదిమంది రాజపురుషులు, ఛత్రము, చామరము, స్వర్ణరాజదండము మొదలైనరాజలాంఛనములను పట్టుకొని దిగివచ్చుచున్నారు. వారిని చూచి ఇంద్రాయుధదేవుఁడు క్రిందిమెట్టుమీఁదనే ఆగిపోయినాఁడు. అమూల్యవస్త్రములు కట్టుకొన్నపురుషుఁడు మెట్లు దిగివచ్చి చిరునవ్వు నవ్వుచు ఇంద్రాయుధుని కేసి చూచి "మహారాజ! స్వాగతము." అని అన్నాఁడు.

తల కొంచెము ఓరగా వంచి రెండుచేతులు కొంచెము ముందుకు చాపి ఇంద్రాయుధుఁడు చిరునవ్వు నవ్వినాఁడు.

"దారిలో ఒడుదుడుకేమియు రాలేదు గదా?" అని ఘూర్జర మహారాజనాగభటదేవుఁడు మెల్లగా చిరునవ్వు నవ్వుచు అడిగినాఁడు.

"లేదు. మారథమువచ్చునప్పటికింకను తెల్లవారకపోవుటచే నగరివాకిటిద్వారము తలుపు తెఱచుటకు కొంచెమాలస్యమైనది."

ఆమాటకు బదులేమియు చెప్పకుండ "లోపలికి దయచేయండి" అని నాగభటదేవుఁ డింద్రాయుధునకు చేయి అందించినాఁడు. వారిరువురు చేతులుపట్టుకొని నెమ్మదిగా మేడమెట్లెక్క మొదలుపెట్టినారు. రెండుమూఁడు మెట్లెక్కినతరువాత "మహారాజ! మీతో ఛత్రధరుఁడు గాని, దండధరుఁడు గాని ఎవ్వరును రాలేదా యేమి?" అని నాగభటదేవుఁడు ప్రశ్నించినాఁడు.

"లేదు." అని ఇంద్రాయుధుఁడు కొంచెము సిగ్గుపడినాఁడు.

ఆమాట విని నాగభటదేవుఁడు నిర్విణ్ణుఁడై ఇంద్రాయుధుని కేసి చూచుచు మెట్లపైనే ఆగిపోయినాఁడు. ఇంద్రాయుధుఁడు సిగ్గున తల వంచుకొన్నాఁడు. ఘూర్జరమహారాజు నింగితము గ్రహించి గబగబ పదిమందిపరిచారకులు ఛత్రచామరములు తీసుకొనివచ్చి ఇంద్రాయుధునికి పట్టినారు. మరల చేతులు పట్టుకొని ఇరువురుమహారాజులును మెట్లెక్కి పోసాగినారు. కొంచెము దూర మెక్కినతరువాత నాగభట దేవుఁడు మరల ఇంద్రాయుధుని కేసి చూచి "మహారాజ! ఇప్పుడు చక్రాయుధుఁ డెక్కడ?" అని సాకూతముగ ప్రశ్నించినాఁడు.

"ప్రతిష్ఠానమం దున్నాఁ డనుకొనెదను."

"అయితే మీరు నగరము విడచిపెట్టి ఎందుకు బయలుదేరినారు?"

క్రీస్తుశకము ఎనిమిదవశతాబ్దిని నగర మనఁగా కన్యాకుబ్జమని యే ఉత్తరాపథమందు వాడుక. అందుచే నాగభటదేవుఁడు కూడ కన్యాకుబ్జమును నగరమనియే వాడినాఁడు. నాగభటదేవుని ప్రశ్నకు చాల సిగ్గుపడిపోయి తడబాటుమాటతో ఇంద్రాయుధుఁడు మెల్లమెల్లగా "నిరాటంకముగ ఆతఁడు గబగబ ముందుకు తోసుకొనివచ్చుచున్నాఁ డని తెలిసి నేను తమసైన్యములను సాయము తీసుకొనిపోవ

టకై ఉన్నపాటున బయలుదేరి వచ్చినాను. అందుచేతనే సేనకు లెవరును వెంటవచ్చుటకు అవకాశము లేకపోయినది." అని బదులు చెప్పినాఁడు.

"అయితే మీసైన్య మింతవరకు చక్రాయుధుని ఎక్కడఁ గూడ విరోధించనే లేదా ?"

"విరోధించ కేమి! వారణాసియందు పదివేలసైన్య మున్నది. కాని రెండుమూఁడువేలసైన్యముతో ధర్మపాలదేవుఁడు దానిని ఓడించి సులభముగా వారణాసిని లోఁబరచుకొన్నాఁడు."

"చరణాద్రియందు గాని, ప్రతిష్ఠానమందు గాని యుద్ధమే కాలేదా ?"

"యుద్ధము కాకేమి ? యుద్ధము జరిగియే చరణాద్రి వారివశమైనది."

"మరి ప్రతిష్ఠానము ?"

"ఇప్పటి కింకను లోఁబడ లేదని తెలియవచ్చినది."

ఈమాటతో నాగభటదేవునకు చాలవిరక్తి పుట్టినది. గభాలున అతఁడు ముఖము త్రిప్పుకొన్నాఁడు. ఆముఖము చిల్లింపు కనుపెట్టి ఇంద్రాయుధుఁ డొకనిట్టూర్పు మెల్లగా విడచినాఁడు. వెంటనే ఆతఁడు నాగభటదేవుని కేసి చూచి కంపితస్వరముతో "మరి మీరు యుద్ధమున కెప్పుడు బయలుదేరెదరు ?" అని అడిగినాడు.

"మీరు చాలా శ్రమపడి వచ్చినారు. ముందు విశ్రాంతి తీసుకొనుఁడు. యుద్ధయాత్రసంగతి తరువాత మాట్లాడుకొనవచ్చును" అని తొణఁకకుండ నాగభటదేవుఁడు గంభీరముగ జవాబుచెప్పినాఁడు.

మహారాజకోసం మొకపెద్దగది విడిదిగా ఏర్పాటైనది. నాగభట దేవుఁ డింద్రాయుధుని ఆగదిలో ప్రవేశపెట్టి పరిచర్యకోసము కొంద

రు సేవకులను నియోగించి వెలుపలికి వెళ్లిపోవుటతో వెనుకకు తిరిగినాఁడు.

అగణిగుమ్మముకడనే మహారాజుకోస మొక యోధుఁడు వచ్చి వేచియున్నాఁడు. అతనిని చూచినతోడనే నాగభటదేవుఁ డాత్రము తో "మీరు వచ్చి ఎంతసేపైనది ?" అని అడిగినాఁడు.

"ఇప్పుడే వచ్చినాను. ఇంద్రాయుధుఁడు వచ్చినాఁడా?"

"ఆహా ! నీమాట నిజమైనది. చక్రాయుధుఁడు చరణాద్రిని, వారణాసిని ఆక్రమించుకొన్నాఁడని విని భండెకులనాపకుఁడైన ఈ రాజపశువు రాజధానిని విడిచిపెట్టి పారిపోయివచ్చినాఁడు. వాహులిక ధవళదేవ ! ఇప్పుడు మనమే కన్యాకుబ్జమును వశపరచుకొనుట మంచిది. ఈయధముఁడు మగఁటిమిలేనివాఁడు. అఁడుదానికన్నను వట్టి హీనుఁడు. పిరికిపంద. ఇఁక కన్యాకుబ్జసింహాసనముమీద ఇతనిని కూర్చుండఁబెట్టుట వట్టిపనికిమాలినపని."

"నిజము. తరతరాలనుండి వచ్చుచున్న రాజధానిని విడిచిపెట్టి ఈపిరికిపంద పారిపోయివచ్చినాఁడు. ఘూర్జరులబాహువులలో శక్తి యున్నయెడల ఈభిల్లమాలయే రేపీపాటికి కన్యాకుబ్జమైపోఁగలదు"

"ఇప్పుడు తిరుగ ఈతని ఆసింహాసన మెక్కించుట వృథా యాసముతప్ప మరొకప్రయోజనము లేదు. ఇదివరకు మూడుసారు లీరీతిగానే రాజధానిని విడిచిపెట్టి వచ్చినాఁడు. ఆమూఁడుసారులు కూడ మనమే దయఁదలఁచి పూనుకొని మరల సింహాసన మీతని వశము చేసినాము. కాని లాభ మేమి ? చక్రాయుధుఁ డెన్నిసారులు కన్యాకుబ్జమును ముట్టడించినాఁడో అన్నిసారులుకూడ ఈమహాత్ముఁ డాత్మరక్షణము చేసుకొనలేక రాజధానిని విడచిపెట్టి మనకడకు పారిపోయివచ్చినాఁడు."

“ అయితే ఇప్పుడే ఇతనిని బందీగా పట్టుకొని మనము చక్రా యుధునిపక్షమునకు తిరిగిపోవుట సర్వోత్తమ మైనపని.”

“ ఇప్పుడు చక్రాయుధుఁడు మనకు దొరకునా ? అతఁడు జయగర్వితుఁడై నిరాటంకముగ, నిర్భయముగ కన్యాకుబ్జముపై వచ్చి పడుచున్నాఁడు. అతనికి చేఁదోడు వాదోడుగా గౌడచక్రవర్తి యొకఁ డున్నాఁడు. మనము చాలాకాలమునుండి అతనితో అతనితండ్రితో పగఁబెట్టుకొని యున్నాము. ఇప్పు డకస్మాత్తుగా స్నేహితులవలె మన మాతనిపక్షమునకు తిరిగిపోయినచో మనపై విశ్వాస ముంచునను ధైర్య మేమున్నది ?”

“ ఆమాటకూడ ఆలోచించవలసినదే. అసలు చక్రాయుధుఁ డిప్పు డెక్కడ ?”

“ ప్రతిష్ఠానమం దున్నాఁడని విన్నాను. వారణాసి, చరణాద్రి ఇదివరకే ధర్మపాలదేవుని వశ మైనవి.”

“ మరి ఇప్పుడు ఇంద్రాయుధుఁడు పారిపోయివచ్చుటవలన కన్యాకుబ్జరాజ్యము యావత్తు ఆతనివశ మైనదనియే నానమ్మకము. ఇంద్రాయుధుఁ డేమన్నాఁడు ?”

“ మీరు యుద్ధమున కెప్పుడు బయలుదేరెద రని నన్నడిగి నాఁడు.”

“ మీ రేమన్నారు మరి ?”

“ ఏమియు జవాబు చెప్పలేదు.”

“ మంచిపని చేసినారు. కొన్నాళ్లవరకు ఇంద్రాయుధుని బం దీగా ఇచటనే ఉంచండి.”

“ మరి యుద్ధమో ?”

" మీ కేమైన పిచ్చిపట్టినదా ? ఆపుడాసీకన్న వెఱ్ఱివారికేపడదు ఇతఁడు. ఈకులనాపకునికోసము మనకు వృథాశ్రమ మెందుకు ? "

" మరి మాటబదనామీ వచ్చునేమో ? "

" వత్సా ! ఈవిషయమున నీ కింకను పరిశ్రమ చాలదు. రాష్ట్రనీతిలో మాటనిలకడలు, మాటతపావత్తులు లేవు. అంతయు ధృతరాష్ట్రుని కౌఁగిలింతలు. "

" అయితే ఇప్పుడు కర్తవ్యము ? "

" అతిథిసత్కారము. "

" మహామంత్రీ ! నీవంటి అసత్యవాదిని, నీవంటి కటికగుండె వానిని నే నెచ్చటను చూడలేదు. "

" చూడు వత్సా ! ఈమిథ్యావాది, క్రూరస్వభావుఁడైన వాసవుకధవఁడే లేకున్నయెడల వత్సరాజు దిగ్విజయము జరుగనే జరుగకపోవును. అట్లే ఆతనిపుత్రుఁడవైననీరాజ్యము నిమ్మకు నీరు పోసిన ట్లుండనే యుండకపోవును. తెలిసినదా ? "

" నిజమే. నేను కొలువుకూటమునకు వచ్చెదను. "

" సరే. రావచ్చును. "

" ఇంద్రాయుధునికూడ వెంటఁబెట్టుకొని రానా ? "

" వద్దు. అటువంటి తెలివితక్కువపని చేయకు. "

" చూడు. మహామంత్రీ ! గౌడులు మామూలుమనుష్యులు కారు. వారణాసిని పదివేలసైన్యము కాపాడుచుండఁగా, ధర్మపాలదేవుఁడు రెండుమూఁడువేలసైన్యముతో వచ్చి అవలీలగ దానిని వశపరచుకొన్నాఁడు. తెలిసినదా ? "

" నిజమే. కాని మీతండ్రికాలమున గౌడులు వట్టిఅనామకులు. పిరికిపందలు. ఘోటకపురోహితును చూచి చెదరిపోయెడివారు. "

“ సరే. కాని బౌద్ధాచార్యనాగసేనులవా రెక్కడ ? ”

“ కారాగారమున. నేఁడే అతనినేరము విచారణ జరుగును. చూడు మహారాజ ! ముసలిపురోహితబ్రాహ్మణుని ప్రేరేపణవలన అన్యాయము చేయకు. ”

“ రాష్ట్రనీతిలో సత్యాసత్యములు న్యాయాన్యాయములు లేవని ఇప్పుడే నీవు చెప్పి ఇంతలో ఆమాట మరచిపోయినావా ?”

“ ఇది రాష్ట్రనీతి కాదు. రాజనీతి. తెలిసినదా ? ”



## ౭

### ఘూర్జరరాజనీతి.

వారణాసి వశమైన రెండుమూడు రోజులకు జయవర్ధనుఁడు వందల సైన్యముతో చరణాద్రిదుర్గమును వశపరచుకొన్నట్లు కబురు తెలిసినది. దుర్గరక్షణకై సైన్యము పంపవలయు ననియు, దుర్గరక్షణకుతగిన వ్యవస్థ కుదిరినతరువాత ప్రతిష్ఠానమునుకూడ ముట్టడించుటకు సెల విప్పించవలసిన దనియు జయవర్ధనుఁడు ధర్మపాలదేవచక్రవర్తికి కబురంపినాఁడు. వారణాసియుద్ధము చూచి యుండుటచే భీష్మదేవుఁడు మొదలైనసామంతులకు చరణాద్రి లోఁబడిపోయినసమాచారమంతగా ఆశ్చర్యము కలిగించలేదు. సమాచారము తెలిసినవెంటనే ధర్మపాలదేవుఁడు జయవర్ధనునకు 'కాల్బలముకన్న దుర్గరక్షణకు వేరొకమార్గము లేదు. కాఁబట్టి మనకాల్బల మిచటికి చేరవచ్చునందాక ఒకవారము రోజులు వేచియుండవలసిన' దని కబురు పంపినాఁడు.

గౌడపటాతిసేన వారణాసి చేరవచ్చునప్పటికి దాదాపు కన్యాకుబ్జయుద్ధము ముగియవచ్చినది. చరణాద్రి లోఁబడిపోయినకబురు తెలియఁగానే చక్రవర్తిబిరుదధారియైన ఇంద్రాయుధుఁడు ప్రతిష్ఠానదుర్గమును కాపాడుట కెట్టియేర్పాటులు చేయకుండ పైపెచ్చు రాజధానిని విడచిపెట్టి ఎకాయెకిని ఘూర్జరరాజధానికి పారిపోయినసంగతి ఇదివరకే తెలిసినది. అచట ఆతఁ డెట్టిదురవస్థలో ఉన్నాఁడోకూడ మన మెరిఁగినవిషయమే. ఇంద్రాయుధుఁడు పారిపోయినట్లు తెలియఁగానే సామంతరాజు లందరు యుద్ధము మానివేసి చక్రాయుధుని రాజధాని కాహ్వానించినారు. యుద్ధము లేకుండనే ప్రతిష్ఠానము,

కన్యాకుబ్జముకూడ ధర్మపాలదేవునియధికారముక్రిందికి వచ్చినవి. వారణాసితోపాటు చరణాద్రిప్రతిష్ఠానములనుకూడ కాపాడుటకు కొంచెము సైన్యము నట్టిపెట్టి తక్కినసేనతో చక్రాయుధుఁడు, ధర్మపాలదేవుఁడు కన్యాకుబ్జమునకు బయలుదేరి వెళ్లినారు.

భిల్లమాలానగరమున ఘూర్జరరాజున కతిథియైయున్న ఇంద్రాయుధుఁడు ప్రతిదినము, త్వరగా గౌడచక్రవర్తిపై దండెత్తవలసిన దని ఘూర్జరరాజును బలవంతపెట్టుచునే యున్నాఁడు. ఈరీతిగ ఒకనెల రోజులు మాటలతోనే గడచిపోయినవి. ఘూర్జరుఁడు యుద్ధసన్నాహము చేయుచున్నట్లు కాన్పించుటలేదు. యుద్ధప్రస్తావము వచ్చినప్పుడెల్ల 'ఇదుగో తొందరలోనే బయలుదేరుదము.' అని చెప్పి ఘూర్జర మహారాజు, మహామంత్రి వాహుకధవళదేవుఁడు ఇంద్రాయుధుని సమాధానపరచుచున్నారు. నిజమునకు ఇప్పట్లు గౌడచక్రవర్తితో యుద్ధముచేయుటకు వారి కసలే యిష్టములేదు.

చక్రాయుధుఁడు సామంతులయాహ్వానముపై కన్యాకుబ్జము వచ్చినాఁడు. వెంటనే అతనిని సింహాసన మెక్కించుటకు వారందరు తొందరపడుచున్నారు. భీష్మదేవవిశ్వానందులతో తర్కవితర్కములు చేసి ఆలోచించినతరువాత ధర్మపాలదేవునకు అప్పుడే చక్రాయుధుని సింహాసనమెక్కించుటంత మంచిదిగా తోచలేదు. చక్రాయుధుని అభిప్రాయముకూడ అట్లే యున్నది.

వజ్రాయుధుఁడు చనిపోఁగానే ఇంద్రాయుధుఁ డకస్మాత్తుగా ఆసింహాసన మాక్రమించుకొన్నాఁడు. ఆవిషయమున ఘూర్జరరాజు అతనికి చాలా సాయపడినాఁడు. నాగభటదేవునితండ్రి యైనవత్సరాజు దిగ్విజయముకొరకు బయలుదేరి ఉత్తరాపథమునంతయు గెలిచినాఁడు. అప్పు డతనితో ప్రతిఘటించి యుద్ధముచేసినవాఁ డొక్కవజ్రాయు

ధుఁడే. ఆయుద్ధమున ఓడిపోయినను వజ్రాయుధుఁడు ఘూర్జరులకు లోఁబడలేదు. వారియాధిపత్య మంగీకరించలేదు. కొంతకాల మైన తరువాత దక్షిణాపథమందలి రాష్ట్రకూటవంశీయుఁ డైనధ్రువవర్మ యుద్ధమున వత్సరాజు నోడించి వెనుకకు తరిమినాఁడు. ఆయవకాశము చూచుకొని వజ్రాయుధుఁడు మరల తనయధికారమును దిట్టపరచుకొన్నాఁడు. వజ్రాయుధునితో యుద్ధముచేయుచున్నప్పుడు, ఆతని తమ్ముఁడైన ఇంద్రాయుధుఁడు వత్సరాజునకు చాటుచాటుగ చాలా సాయము చేసినాఁడు. అందువలన వజ్రాయుధుఁడు చావఁగానే ఘూర్జరులసాయమున ఆసింహాసనము సులభముగా ఇంద్రాయుధునివశ మైనది. ఘూర్జరులతో లాలోచీయై ఇంద్రాయుధుఁడు తనయన్నగారిని చంపినాఁ డనికూడ కన్యాకుబ్జప్రజలు చాటుమాటున చెప్పుకొన్నారు. దీనివల్లనే కన్యాకుబ్జసామంతులకు ఇంద్రాయుధుని పొడ గిట్టదు. ఇంద్రాయుధునిపేరు చెప్పిన వారందరును మండిపడెడివారు. కాని ఎంత ఎడమొగము పెడమొగమున్నను ఘూర్జరరాజునకు భయపడి ఎవ్వరును బహిరంగముగా రాజుపై తిరుగుబాటు చేయుటకు సాహసించలేదు. కాని అందరును లోలోపల చాలాకాలమువరకు వజ్రాయుధునికోసము, ఆతనిపుత్రునికోసము ఎంతో విచారపడినారు. రైతుమొదలుకొని సామంతరాజువర కందరుకూడ చక్రాయుధుఁడు పెద్దవాఁ డగువరకు వేచియున్నారు. చక్రాయుధుఁడు తనతండ్రిరాజ్యమున కాలుపెట్టఁగానే ప్రజలంద రాతనిపక్ష మైనారు. ఇంద్రాయుధుఁడు పారిపోయినవెంటనే ప్రజలందరు తిరుగుబాటుచేసి ప్రధానదుర్గములలో ఇంద్రాయుధునిపక్షపాతు లైననాయకు లందరిని హత్యచేసినారు. ఒక్కరోజులో కన్యాకుబ్జనగరమున ఇంద్రాయుధుని పేరు తలపెట్టువాఁడుకూడ లేకుండపోయినాఁడు. వజ్రాయుధునికాలము

నాఁటిసేవకులు, ప్రధానోద్యోగులు, తిరుగ తమతమ పూర్వపదవులందు మరల చేరినారు.

ఘూర్జరరాజసాయముతో ఇంద్రాయుధుఁడు మరల తప్పక దండెత్తివచ్చుననియు, వచ్చినను, వెనుకటంత సులభముగా ఈమారు మాత్రము రాజ్య మాక్రమించుకొనలేడనియు, అందరును స్థిరపరచుకొన్నారు. అయినను రాజధానియం దప్పుడే అభిషేకోత్సవము జరుపుట కెవ్వరును అంగీకరించలేదు. "కన్యాకుబ్జరాజ్యపుసరిహద్దులం దున్నసామంతు లంద రెంతకాలమువరకు చక్రాయుధునియాధిపత్య మంగీకరింపరో అంతవరకుకూడ యుద్ధాగ్ని రగుల్కొనుచున్నట్లే" అని సంగతిసందర్భములు పూర్తిగా తెలిసినవిశ్వానందుఁడు ధర్మపాలదేవచక్రవర్తితో చెప్పినాఁడు. శీఘ్రకాలములో మరల భయంకరముగా యుద్ధము పొసఁగుటకు సన్నాహము జరుగుచున్నదనియే భీష్మదేవునిదృఢవిశ్వాసము. ఈకారణములవల్ల అభిషేకోత్సవము మాట మఱఁగిపోయినది. రాజ్యరక్షణకై తగినకట్టుదిట్టములు చేయుటకు భీష్మదేవుఁడు పూనుకొన్నాఁడు. అతఁడు విమలనందిని, ప్రమథసింహుని వెంటబెట్టుకొని క్రొత్తసేనను కూర్చుకొనుచు యమునానదికుత్తరముననున్న రేవుస్థలము లన్నిటియందు గౌడసేనను కాపుంచినాఁడు. ప్రతిష్ఠానమున రణసింహుఁడును, కౌశాంబియందు వీరదేవుఁడును, మథురయందు కమలసింహుఁడును, స్థాణ్వీశ్వరమందు జయవర్ధనుఁడును, కన్యాకుబ్జరాజ్యపు నాలుగుసరిహద్దులందు కనుపెట్టుకొని యున్నారు. ప్రతిష్ఠానమునుండి స్థాణ్వీశ్వరమువరకు వందలకొలఁది క్రోసులదూర మున్నది. ఆప్రదేశము మొదలుకొనియే ఘూర్జరరాజ్య మారంభమగుచున్నది. అన్నిపొలిమేరలందు ఘూర్జరసైన్యము యుద్ధమునకు సిద్ధమగుచున్నట్లు గౌడసామంతులకు తెలిసినది. రేవురేవున

గుఱ్ఱపురౌతులు, కాల్బలముకూడ కత్తి క్రిందఁబెట్టకుండ కాచుకొని యున్నారు.

ఈసంగతు లన్నియు తెలియఁగానే యుద్ధము ముగియ లేద నియు, విశ్వానందుఁడు చెప్పినమాట అబద్ధము కాదనియు ధర్మపాల దేవుఁ డనుకొన్నాఁడు. వెంటనే ఆలోచనసభ ఏర్పాటుచేసినాఁడు. సామంతు లందరియెదుట "ఇంద్రాయుధునికి తోడ్పడినకారణము నను, తనతండ్రికి విరోధి యనునెపముననను, చక్రాయుధుఁడు హఠా త్తుగ ఘూర్జరరాజ్య మాక్రమించుకొనవచ్చునని తలంచి నాగభట దేవుఁ డాత్మరక్షణకోసమే యీయుద్ధసన్నాహామంతయు చేయుచు న్నాఁడేమో! కాఁబట్టి మనము తక్షణము భిల్లమాలకు మనరాయ బారిని పంపుట అత్యుత్తమ మని నాకు తోచుచున్నది." అని తన యభిప్రాయమును ధర్మపాలదేవుఁడు వెల్లడించినాఁడు. కాని సామం తులందరు రాయబారిని పంపుట వ్యర్థమని నొక్కి చెప్పినారు. విశ్వా నందుఁడు "విశ్వాసఘాతుకులైనఘూర్జరులు యుద్ధయాత్రకుముం దీరీతిగానే చాలాకాలము సంసిద్ధపడి సంసిద్ధపడి చివరకు వార్తకూడ తెలియఁజేయకుండ హఠాత్తుగ పరరాజ్యముపై వచ్చిపడుట మామూ లని" తనయభిప్రాయము చెప్పినాఁడు. ఎవ రెంతచెప్పినను ధర్మ పాలదేవుఁడు రాయబారిని పంపువిషయమై తనయభిప్రాయము మా ర్చుకొనలేదు. "ఏదెట్లున్నను క్రొత్తసేనలు పంపవలసినదని ముం దుగా మహాకుమారవాక్పాలదేవునకు కబురుపంపుట మంచి దని భీష్మ దేవుఁడు చెప్పినాఁడు. ఆమాటమీఁద గౌడనగరమునకు దూత వెళ్లినాఁడు.

ఆకాలమున ఇప్పటిపంజాబురాజపుతానాలుకూడ ఘూర్జరుల యధికారముక్రిందనే ఉన్నవి. భోజ, మత్స్య, అవంతి, గాంధార,

మద్రి, కురు, యవన, కీర, మొదలైనరాజ్యములన్నియు ఘూర్జరసామంతుల ఏలుబడిలోనే ఉన్నవి. భిల్లమాలాధీశ్వరునిఆధిపత్య మంగీకరించినను వారందరు స్వతంత్రులుగానే ఉన్నారు. వారందరిదగ్గరికి దూతలను పంపుటకు చక్రవర్తి స్థిరపరచుకొన్నాఁడు. "వజ్రాయుధునిష్కృతుఁడైనచక్రాయుధుఁడు కన్యాకుబ్జసింహాసన మెక్కుచున్నాఁ" డనువార్త తీసుకొని దూతలు ఘూర్జరసామంతరాజ్యములకు బయలుదేరి వెళ్ళినారు.

అందరికన్నముందు భిల్లమాలకు వెళ్ళినదూత తిరిగి వచ్చినాఁడు. "ఘూర్జరరాజు భిల్లమాలనుండియే గౌడేశ్వరున కభివాదనము చేసినాఁడు. చక్రాయుధుఁడు తనతండ్రిసింహాసన మాక్రమించినసంగతి విని ఆతఁడు చాలాసంతసించినాఁడు. క్రొత్తకన్యాకుబ్జరాజును సన్మానించుటకు త్వరలోనే ఘూర్జరరాజదూత అచటికి రాఁగలఁడు.

శరణుఁ జొచ్చినవారిని కాపాడుట రాజధర్మము. కాఁబట్టి ఇంద్రాయుధుని రక్షించక తప్పదు. అంతేకాని ఇంద్రాయుధునిపక్షమై ఘూర్జరరా జెప్పుడును కన్యాకుబ్జరాజ్య మాక్రమించుటకు తలపెట్టఁడు. తిరిగి తనరాజ్యము పునరుద్ధరించుకొనుటకై ఇంద్రాయుధుఁడేమైనప్రయత్నము చేసుకొన్నచో ఘూర్జరరాజు అట్టిప్రయత్నముల కభ్యంతరపెట్టఁడు. వేగముగ స్వదేశమునకు గౌడేశ్వరుఁడు తిరిగి వెళ్లిపోయినను ఘూర్జరులతో ఏర్పడిన ఈస్నేహపాశము తెగిపోదు."

తక్కినచోట్లనుండి సమాధాన మేమియు రాలేదు. నాగభటదేవునిసందేశము విని ధర్మపాలుఁడు స్వదేశమునకు తిరిగిపోవుటకు సంకల్పించినాఁడు. కాని సామంతు లెవ్వరును దానికి సమ్మతింపలేదు.

# ౮

## సర్వానందుని గృహాతిథ్యము.

చక్రాయుధుని కన్యాకుబ్జసింహాసన మెక్కించుటకు ధర్మపాల దేవుఁడు బ్రహ్మప్రయత్నము చేయుచున్నసమయమున గౌడదేశము నిమ్మకు నీరుపోసినట్లు శాంతముగా ఉన్నది. వైశాఖమాసము బరేంద్రిమండలమున ఎండలు చాలా ఎక్కువ. తీయమామిడిచెట్లన్నియు పండ్లబరువున నేలకు వ్రాలిపోయినవి. పగలు రెండుజాములవేళ కావచ్చినది. వీథులందు పిట్టపురుగైన తిరుగుట లేదు. నాలుగుదిక్కులు బోంయ్యి మనుచున్నవి. పక్షులుకూడ చెట్లపైని గూళ్లలో ఆకులచాటున మెడ వాలవైచుకొని దాగుకొన్నవి.

గంగాతీరమందలి ఒకయగ్రహారమున యువకుఁ డొకఁడు వెదురువంకెన చేతఁబట్టుకొని ఇంటి ముంగిటికి వచ్చినాఁడు. అది పూరిల్లు. దానినాలుగువైపుల మట్టిగోడ ఉన్నది. పేడపూతలవలన ఆగోడ నునుపుదేరి ఉన్నది. ఆయింటిపెరటిలోను, ముంగిటను పూలచెట్లున్నవి. ఆపూలతోటచుట్టు వెదురుకంచె ఉన్నది. ఆవెలుగుప్రక్కనే వరుసగా కొబ్బరిచెట్లు, తాటిచెట్లున్నవి.

ఆయువకుఁడు దబ్బపండుచాయ శరీరమువాఁడు. అతనివయస్సు సుమారు పాతికేండ్లుండవచ్చును. మెడలోని యజ్ఞోపవీతమునుబట్టి అతఁడు జాతికి బ్రాహ్మణుఁడైనట్లు తోచుచున్నది.

అతఁడు వీథివాకిటికి వచ్చి నిలువఁబడినాఁడు. ఇంతలో ఇంటిలోపలినుండి ఎవరో ,, పగలు రెండుజాముల మిడిమెండలో ఎక్కడికీప్రయాణము ? '' అని పిలచినారు.

యువకుఁడు చిరాకుపడుచు మరల ఇంటిలోనికి వచ్చి పడక గదిగుమ్మముదగ్గర నిఁలువఁబడి "ఎందుకు పిలచినావు ?" అని అడిగి నాఁడు.

ఇంతలో అతనివెనుకవైపునుండి అడుగులచప్పుడు వినవచ్చి నది. వెంటనే వెనుకకు తిరిగి చూచినాఁడు. ఆప్రక్కగదినుండి ఇరు వదేండ్లయీడుగల సుందరి ఒకతె వచ్చి అతనిముందు నిలువఁబడినది.

ఆమె పెదవిచివురులపై పారాడుచున్నవి మందహాసరేఖలు. తేమెరుపుకనుగోనలనుండి సాగుచున్నవి నిశితకటాక్షములు. సంపం గిరేకులవంటి వ్రేళ్లతో పైటచెరఁగుఅంచును మెలిబెట్టుచు ఆమె "ఇంత ఎండలో ఇప్పుడు ప్రయాణ మెక్కడికి ?" అని మెల్లగా అన్నది.

ఆమెను చూడఁగానే యువకునివదనము ప్రసన్నమైనది. ఎక్క డిచిరా కక్కడనే చెల్లాచెదరైపోయినది. ముఖమున చిరునవ్వు చెంగ లించినది. ఆమెవంక రెప్పవాల్చక చూచుచు "ఎందుకు పిలచినావు?" అని అడిగినాఁ డతఁడు.

"నిప్పులు చెరుగుచున్న ఈమిడియెండలో వంకెనతీసుకొని ఎక్కడికి వెళ్లుచున్నారు మీరు ?"

"నీకోసమే."

"నాకోసమా ?"

"అవును. నీకోసమే."

"నే నేమి కాయనా ? పండునా ? వంకెన తీసుకొని నా కోస మెందుకు ?"

"అమలా! నీవు నిజముగా—"

"అబ్బా! చమత్కారము కట్టిపెట్టి కొంచెముసేపు, ఎక్కడికి

వెళ్లుచున్నారో దయచేసి చెప్పండి. మామిడిచెట్లు పండినదా ? "

" నామాట పూర్తి కానీయ వేమి ? నీవు నిజముగా పాల పొంగువంటి యౌవనముతో పట్టపగటి ఆకాశలక్ష్మివలె వెలిగిపోవు చున్నావు. "

" అదుగో మరల అసందర్భపుమాట! వేళాకోళమునకు వేళా పాళా లేదా ? మీకేమైన పిచ్చిపట్టినదా ? ఏదికాని వేళ నిప్పులు తూర్పారబోయుచున్న ఈమిడిమెండలో మామిడిచెట్లు పండిన దని ప్రయాణ మైనారా ? "

" చూడు. కోనేటిగట్టుమీది పెద్దమామిడిచెట్టున రెండుపండ్లు పరువునకు వచ్చినవి. క్రిందపడినచో పాడైపోవును. "

" పాడైపోనీయండి. ఇప్పుడు మీరు వెళ్లుటకు వీలులేదు. "

యువతి యువకునిచేయి పట్టుకొని కూర్చుండబెట్టినది. చేతిలోని వంకెనను అవతల పారవేసి యువకుఁడు మాట్లాడక కూర్చున్నాఁడు. ఒకరి నొకరు చూచుకొనుచు వారుభయు లట్లే కూర్చున్నారు. ఎవ్వరును మాట్లాడ లేదు. కొంచెముసేపటిలో సిగ్గున ఆయువతి చెంపలు కెంపెక్కినవి. త్రపాముగ్ధమైన ముఖము ఓరగా ఎత్తి క్రీగంట వాడిచూపులు పరపుచు " ఆలాగున రెప్పవేయకుండ ఏమిటి చూడడము ? " అని కనుబొమ్మలు చిట్లించిన దామె.

" నిన్ను— "

" అబ్బా ! చాలు లెండి ! పొండి ! "

" వెళ్ళుచున్నవానినే నీవు పట్టుకొని కూర్చుండబెట్టినావు. "

" అబ్బా ! ఏమి చమత్కారమండి ? మీ రిప్పుడు వెళ్లుటకు వీలులేదు. ఇక్కడనే నాప్రక్కనే కూర్చుండిపోవలెను. "

" అయితే కన్నులు మూసుకొని కూర్చుండనా ? "

‘ ఇంతసేపు రెప్పవేయకుండ చూచినను తనివి దీరలేదా ? ”

‘ తీరునా మరి చెప్పు ? ”

‘ అయితే చూడండి. మనసుతీర చూడండి. ఎంతసేపు రెప్ప వేయకుండ చూడవలెనని యున్నదో అంతసేపు చూడండి. ”

ఆయువతి మేలిముసుఁగు తీసివేసి ముఖము వంచుకొని కూర్చున్నది. దప్పిగొన్న చాతకమువలె ఆయువకుఁ డమృతము కురియుచున్న ఆమెముఖసౌందర్యమును నిర్నిమేషనేత్రములతో గ్రోలసాగినాఁడు. వెచ్చవెచ్చని పడుచుప్రాయపుకోరిక లాసౌందర్యసీమను ప్రేమ తాండవమాడసాగినవి. ఆదృష్టికి రెప్పపాటు లేదు. ఆతృష్ణ కంతులేదు. ఆమైమరపునకు పాటులేదు. ఆయావేగపు పొంగులకు విసుగు వేసటలు లేవు. ఏ మాయాయౌవనము ! స్వర్ణపక్షములతో సౌందర్యసీమను యథేచ్ఛావిహారము చేయుచున్నది. ఆహా ! దినసౌధపు రెండవమెట్టుపై నిలువఁబడి పారఁజూచుచున్న ఆతపలక్ష్మి. పెకల్చుకొని పొరలి వచ్చుచున్న సెలయేరు. పూలతోటలో శేషచైత్రమందలి పవనసౌరభోచ్ఛ్వాసము. తరుగువిరుగులు లేని అనురాగజీవితములో తేలిపోవని సుఖస్వప్నము. చూచినకొలఁది పెరిగిపోవుచున్న ఒకమహాకాంక్ష.

ఆయువకుఁ డింకను చూచుచునే యున్నాఁడు. కొంచెముసేపటిలో ఆయువతి కెంబెదవులపై చిరునవ్వువెన్నెలతీగలు ప్రాకినవి. చెంపలపైన, చెక్కులపైన, కెంపు తళుకెత్తినది. ముఖమండలమంతయు ఉదయచంద్రబింబమైపోయినది. ఇక మనసుపట్టలేక పాలనీటిగులాబి పూవుచలించునట్లు ముఖము చిట్లించుచు “ ఏమిటది? పొండి ? ”అని కొంచెము కసరుకొన్నది.

“ అయితే వెళ్లెదను. ” అని ముఖముపై ముఖమాని అన్నాఁ డాయువకుఁడు.

"వద్దు." అని ఆతని రెండుచేతులు తనమెడచుట్టు వేసుకొని, ఆతనివక్షమున తలనాని, తేలఁగన్నులతో ముఖముకేసి చూచుచు అన్నదామె.

"అసలు సంగతి యేమిటి? అమలా?" అని ఆమెముంగురులు దువ్వుచు అడిగినాడతఁడు.

"మాయన్నగారింటికి వెళ్లివచ్చినాను."

"ఓహో! అది! చూచుటకు వెళ్లినావా?"

'అవును. మాయన్నగారు నేఁడే ఊరినుండి వచ్చినారు.'

'మంచిది. అందరు కులాసాగా ఉన్నారా?'

'ఆఁ ఉన్నారు.'

'అయితే సరే. నే నిఁక వెళ్ళనా? ఒకఅరగడియసేపు నన్ను విడిచిపెట్టు. అప్పుడే గాడ్పుసాగినది. ఏమాత్రము గాలిదెబ్బ తగిలి నను మామిడిపండ్లు క్రిందరాలిపడి పాడైపోవును.'

'సరే. మీరు దయచేసి మామిడిచెట్లుదగ్గరికే వెళ్ళండి.'

పడగ విప్పుతాచుపామువలె గుభాలున లేచి నిలువఁబడి నదామె. ఆయువకుఁడు నవ్వుచు ఆమెచేయి పట్టుకొని మరల కూర్చుండఁబెట్టి "కోపము వచ్చినదా?" అని అడిగినాఁడు.

'నాకోపముజోలి మీ కెందుకు? నాకు కోపము వచ్చిన మీకు పోవున దేమి? కోపమువచ్చినను ఒకటే రాకున్నను ఒకటే. ఎట్లైనను నేను మీకు మామిడిచెట్టుపాటి చేయలేకపోయినాను.'

'కోపపడకు. అయితే నేను వెళ్ళను.'

'లేదు. వెళ్ళండి. మీమనసు కోనేటిగట్టుపై పడి తహతహ లాడిపోవుచున్నది. వట్టికట్టైనుమాత్రము ఇచ్చట పట్టుకొని యుంచిన నాకు లాభ మేమిటి?'

'అమలా! ఇంతకోప మెందుకు? అసలుమాట చెప్పకుండ నన్ను బాధపెట్టుచున్నావు'

'ఒకమాట—'

'అదే నేను గూడ అడుగుచున్నాను. ఏమి మాట?'

'కోపపడరు గదా!'

'నీమీద కోపపడఁగలశక్తి ఉన్నదా నాకు?'

'అబ్బా! చాలులెండి మీమాటలు! ఒకమాట—'

'చెప్పు! ఏమి మాట?'

'చేసెద ననిన చెప్పెదను.'

'నాకు సాధ్యమైన—'

'నేను చెప్పనండి. మీరు కోనేటికి వెళ్ళండి. నేను చెప్పను.'

'సరే. చేసెదను. చెప్పు!'

'చేసెదరా? చేసెదరా?'

'ఇదుగో ఇప్పుడు చెప్పినాను గదూ!'

'అది కాదు. ముమ్మాటికి చెప్పవలెను.'

'చేసెదను. చేసెదను. చేసెదను. సరేనా?'

'నామీద ఒట్టుపెట్టుకొని చెప్పవలెను.'

'ఒట్టు పెట్టుకొనెదను. కాని నీమీదమాత్రము పెట్టుకొనను. అమలా!'

'అయితేసరే. నామాట చెల్లించెదరా?'

'తప్పక!'

'మా అన్నగారింటికి వెళ్ళినానండి!'

'సరే. తరువాత?'

'ఆయన మావదినకోసము బంగారుగాజులజత తెచ్చినాఁడు.'

'ఆఁ అయితే ?'

'ఎంత బాగున్నవండి అవి !'

'సరే. తరువాత ?'

'ఇఁక నేను చెప్పనండి.'

యువకుఁడొక వేడినిట్టూర్పు విడిచినాఁడు. తరువాత "అమలా ! మీయన్న దిగ్గజమువంటిపండితుఁడు. దేశమున మంచిపేరుకీర్తులు కలవాఁడు.' అన్నాఁడు.

'అయితే నామొగుడు వట్టిమూర్ఖుఁడా ?'

'అబ్బా ! మూర్ఖుఁడు కాడు. నామాట కొసవరకు విను. కాని—'

'మరల "కానీ" యేమిటి ? తర్కమున మీరు చాలఉద్దండులఁట ! మానాన్నగారు నాతో చెప్పినారు మరి. !'

'అమలా ! ఆసంగతి ఎవ రెఱుఁగుదురు ? నిన్ను చూచినతరువాత నేను నాచదువంతయు మరచిపోయినాను. గౌతమీయము మడుగంటినది. కాణాదము గంగగలసినది. అసలు నేను ఏదోకొంత చదువుకొన్నమాట వాస్తవము. ఇష్టముండి ప్రయత్నము చేసినయెడల ఏదో రెండుడబ్బులుసంపాదించఁగలను. కాని—'

'అబ్బా ! మరల "కాని" ఏమిటి?'

'కాని నీవు నాకు పూలసంకెలవు. నీకు నేను బొత్తుగా కట్టుబడి పోయినాను. ఈసంకెల విడఁదీసికొనలేను. విడిపించుకొనుట నా కిష్టము లేదుకూడ.'

'మీ రిప్పుడు దొట్టుపెట్టుకున్నారు గదా ! బంగారుగాజులు తెచ్చిపెట్టరా మరి ?'

'ఒట్టుపెట్టుకొన్నాఁడీదరిద్రుఁడు. ఆమాటకూడనిజమే. కాని—'

'అదుగో మరల "కాని"?'

'సరే. నీవు కనుపెట్టుకొని ఉండు. నే నిప్పుడే వచ్చెదను.'

ఆయువకుఁడు పెమురువంకెన తీసుకొని ఇల్లు బయలుదేరినాఁడు. బంగారుగాజులు తప్పక వచ్చునని అమల రెట్టింపుసంతోషముతో ఇల్లు చక్కఁబెట్టుకొనసాగినది. సర్వానందభట్టాచారి వీధిని బడి తోటకు వెళ్లినాఁడు.

సర్వానందభట్టాచార్యులవారు న్యాయశాస్త్రమం దందెవేసిన పండితుఁడు. వేదము చదువుకొనుట కాతఁ డగ్రహారము వచ్చినాఁడు. ఘనాంతస్వాధ్యాయి అయినతరువాత తిరిగి స్వగ్రామము వెళ్లలేదు. ఆయగ్రహారములోని ఒకభట్టాచారి ఆసర్వానందుని చూచి బుద్ధికుశలతలు గల సద్గోత్రికుఁడైన మంచిపండితుఁ డని అతనికి తనకూతురు నిచ్చి పెండ్లిచేసి ఆయగ్రహారములోనే ఒకమూల కాపురము పెట్టించినాఁడు. పదుబన్వారాజైన జయవర్ధనుఁడు సర్వానందునిపాండిత్యప్రకర్ష చూచి కొంతభూమి మాన్య మిప్పించినాఁడు. ఆమాన్యమువలన వచ్చురాఁబడితో తిండికి బట్టకు లోటు లేకుండ అతఁడు కాలక్షేపము చేయుచున్నాఁడు. పైగా డబ్బుసంపాదనకై తిరుగు టాతని కిష్టము లేదు. ఒకరిదగ్గరికి పోయి "దేహి" అని చేయి జాపుట గౌరవమునకు లోటని తలంచుపండితుఁ డతఁడు. అప్పుకోసము పొరుగింటికి వెళ్ళుటకుకూడ అతనికెంతో అభిమానము. ఉన్నదానితో కలియో గంజియో త్రాగి ఆభిజాత్యమునకు లోటు రాకుండ రోజులు వెళ్లఁబుచ్చుచున్న ఆతఁ డిప్పుడు చిక్కునఁ బడిపోయినాఁడు.

అమల మంచితెలివిగలయిల్లాలు. ఎంతమంచి ఇల్లాలైనను నగలమీఁదిఆపేక్షను చంపుకొనలేదు. తనవదిన బంగారుగాజులు పెట్టుకొను టామె చూచినది. ఆగాజు లామె కామెపెనిమిటి తెచ్చిపెట్టి

నాఁడు. తనపెనిమిటి తనకు మాత్ర మెందుకు తెచ్చిపెట్టఁడని ఆమె అనుకొన్నది. డబ్బువిషయమైన తికమక లాడువారి కేమి తెలియును? తనపెనిమిటి గొప్పపండితుఁడు. ఆమాట తనతండ్రిగారే చెప్పినారు. తనయన్నగారు తనపెనిమిటికన్న ఏమంత గొప్పవాఁడు! అటువం టప్పుడు గాజులజత చేయించలేకపోవునా? పెనిమిటిపై నున్న గౌరవ విశ్వాసములవల్లనే ఆమె కీకోరిక పుట్టినది. కాని సర్వానందునివిష యమున ఆచిన్నకోరికకూడ తలకుమీరినదే.

సర్వానందుఁడు మెల్లమెల్లగా నడచి కోనేటిదరికి వెళ్లినాఁడు. చెట్లనుండి పండినమామిడిపండ్లు కోసుకొనుచున్నాఁడు. తిరుగ ఇంటి మొగము పెట్టినాఁడు. భార్యకు మాటయిచ్చినసంగతి అతనిమనసును బాధించుచునే యున్నది. అతనికి భార్యపై విపరీతానురాగము. ఒక నిముసమైనను ఆమెవిరహము సైపలేడు. ఏమి చేయుటకు తోచక అతనిమనసు కల్లోలపడిపోవుచున్నది. ఈయాలోచనలో మునిఁగి అతఁడు ఇంటిమార్గము తప్పిపోయి, ఆయూరిపొలిమేర నున్న పెద్ద రహదారికి పోవుదారినిబడి పోయినాఁడు.

ఆరోజుననే ఏదోసైన్యము వచ్చి ఆయగ్రహారపుపొలిమేర మకాము చేసినది. గంగాతీరమందలిమామిడితోపులో డేరాలు వేసి నారు. ఆడేరాలప్రక్కనే ఒకపనసచెట్టునీడను కూర్చుండి కొందరుసై నికులు సరససల్లాపము లాడుకొనుచున్నారు. ఏదో మాటసందర్భ మున వారందరు గొల్లున నవ్వినారు.ఆనవ్వువలన ఆదారినేవచ్చుచున్న సర్వానందునికి జ్ఞానము వచ్చినది. ఆలోచనలో మునిఁగిపోయి దారి తప్పివచ్చినా నని ఆతఁ డప్పుడు తెలిసికొన్నాఁడు. ఆడేరాలును, ఆసై నికులను చూచినతోడనే ఆతని కెక్కడలేనికుతూహలము పుట్టినది.

వెంటనే వారిదగ్గరికి వచ్చి 'మీ రెక్కడికి వెళ్ళుచున్నారు ?' అని అడిగినాఁడు.

'కన్యాకుబ్జమునకు.'

ఆమాట విన్నతోడనే ఆతనికి వెనుకటిగాథ అంతయు జ్ఞాపకము వచ్చినది. అన్నమాట నిలుపుకొనుటకే గాడేశ్వరుఁడు కన్యాకుబ్జముపై దండెత్తిపోయినాఁడు. ఆవిషయమును, తనవిషయమును తలంచుకొనుచు అతఁడు మెల్లఁగా ఇంటికి మళ్లినాఁడు.

సాయంకాలము కావచ్చినది. అమలదేవి వంటయింటిలో వంట ప్రయత్నము చేయుచున్నది. సర్వానందుఁడు గడపలో కాలుపెట్టిన తోడనే 'అమలా ?' అని కేకవేసినాఁడు.

'ఇదుగో వంటయింటిలో !' అని అమల మారుపలికినది.

'ఒకమారు ఇటురా ?'

అమల లేచి వంటయింటితలుపు దగ్గరసా వేసి నడవలోనికి వచ్చినది. పెనిమిటిని చూడఁగానే ఆమెముఖము కలకలలాడిపోయినది. నవ్వుచు ఆమె 'ఎందుకు ?' అని అడిగినది.

'ఈవేళ నీవు నామాట దక్కించవలెను.'

'ఏమి మాట ?'

'ఇదుగో చూడు. నీవు కంకణములసంగతి మరచిపో. నేను పేదవాఁడను. మనసంసారముసంగతి నీ వెరుఁగనిది కాదు. ఇప్పుడు నగ చేయించవలె నన్న నేను మరొకయూరికి వెళ్ళక తప్పదు. నిన్ను వదలిపెట్టి నేను గడపదాటి కాలుపెట్టలేను. వజ్రాలు ముత్యాలు మాణిక్యాలు అలంకరించుకొన్నను ఇప్పటికన్న ఎక్కువగా నేను నిన్నాదరించలేను. నగలు పెట్టుకొనకపోయినను నీవు నాకంటికి రంభవలె కనఁబడుచున్నావు. కాఁబట్టి నేను పెట్టినబట్టు తీసివేయవలెను.

ఇదుగో చూడు. నీకోసము చెట్టునపండినమామిడిపండ్లను తెచ్చి నాను.'

ఆమాట వినఁగానే అమలదేవి నవ్వుమొగము చిన్నపోయినది. ఆమె మామిడిపండ్లు తీసుకొన్నమాట నిజమే. కాని వాటి నొక మూల విసరి పారవేసినది. పెనిమిటిమాట కేమియు మారు పలుక లేదు. అంతకంతకు ఆమెముఖము తుమ్మలలో పొద్దుగ్రుంకిన ట్లైపో యినది. గబగబ నడచి వంటయింటిలోనికి వెళ్లిపోయినది. ఆమెవరుస చూచి సర్వానందుఁడు నిర్విణ్ణుఁడైనాఁడు. వంటయింటిలో ఆమె ఏమి చేయుచున్నది. ?

కొంచెమునే పైనతరువాత సర్వానందభట్టాచార్యులవారు 'అమలా ?' అని పిలచినారు. ఎవరును పలుకలేదు. మరల పిలిచి నారు. లోపలినుండి జబాబు రాలేదు. మెల్లమెల్లగా ఆయన గుమ్మ ము దిగి గంగాతీరమందలిసైనికులడేరాలదగ్గరికి ప్రయాణమైనాఁడు.

---

# ౬

## ఘూర్జరులతో యుద్ధము.

గూర్జరరాజుదగ్గరనుండి దూత రాఁగానే ధర్మపాలదేవచక్రవర్తి స్వదేశమునకు పోవుటకు బయలుదేరినాఁడు. ఇష్టము లేకున్నను భీష్మదేవవిశ్వానందులు చక్రవర్తి వెంట బయలుదేరక తప్పినది కాదు. సేనను వెంటఁబెట్టుకొని మజిలీలు చేసుకొనుచు అతఁడు ప్రతిష్ఠానమునకు రాసాగినాఁడు. దారినడుమ ఒకనాఁడు సాయంకాలము గంగాతీరమున మకాము చేసినారు.

నాలుగువైపుల చిన్నచిన్న డేరాలు వేసినారు. వాటినడుమ చక్రవర్తికోసము ప్రత్యేకముగ బహుసువర్ణకలశశోభితమైన పటకుటీర మేర్పాటైనది. అది గ్రీష్మఋతువు. ఎండలు తీవ్రముగ ఉన్నవి. సాయంకాలమైనను ఉక్క తగ్గలేదు. అందుచే ధర్మపాలదేవుఁడు గాలికోసము శిబిరమువెలుపటనే కూర్చుండి యున్నాఁడు. నాలుగువైపుల డేరాలలో సైనికులు నిప్పు రాజవేసి వంటచేసుకొనుచున్నారు. రెండు మైళ్లమేర వ్యాపించినఆస్కంధావార మంతట పొగలు బయలుదేరినవి. గంగాతరంగములపై సందెగాడ్పులవలన ఆపొగలు తెరలుతెరలుగా గగనమున వ్యాపించుచున్నవి.

ఇంతలో శిబిరమువెనుకవైపున గుఱ్ఱపుడెక్కల టకటకధ్వనులు వినవచ్చినవి. చూచుచుండఁగనే శరవేగమున గుఱ్ఱమును పరుగెత్తించుకొనుచు రౌతుఁ డొకఁడు శిబిరముదగ్గరికి వచ్చి గుఱ్ఱము దిగినాఁడు. వెంటనే ఆగుఱ్ఱము క్రింద విఱుచుకొని పడిపోయి ప్రాణములు విడచినది. ఆరౌతు దానివైపు చూడనైన చూడకుండ వగర్చుకొనుచు

'మహారాజు ఎక్కడ?' అని అడిగినాఁడు.

'నీ వెవరు? ఎక్కడనుండి వచ్చుచున్నావు?' అనిఒక సైనికుఁడతనిని అడిగినాఁడు.

'నేను కన్యాకుబ్జమహారాజుదూతను. కొంప మునిఁగిపోయినది. త్వరగా నన్ను చక్రవర్తిదగ్గరికి తీసుకొనిపొండి' అని ఆతురతతో రౌతు చెప్పినాఁడు.

వెంటనే అతనిని వెంటఁదీసుకొని సైనికుఁ డొకఁడు చక్రవర్తి శిబిరమువైపు బయలుదేరినాఁడు. రెండడుగులు నడచినతరువాత ఆ రౌతుకేసి చూచి 'ఏమిటి సంగతి?' అని మెల్లగా సైనికుఁడు ప్రస్తావించినాఁడు.

'చాలామర్యాద! ఘూర్జరులు మూఁడువైపులనుండి కన్యాకుబ్జరాజ్యపుసరిహద్దులను ఆక్రమించినారు. మాసేన వెనుకకు పారిపోయి వచ్చుచున్నది. అందుకోసము మామహారాజు వన్నిచటికి పంపినాఁడు.'

చక్రవర్తి శిబిరముబైట కూర్చుండి భీష్మదేవుఁడును, ప్రమథసింహుఁడును ముందుముందు జరుగఁబోవుఘూర్జరయుద్ధమునుగూర్చి సాధకబాధకము లాలోచించుచున్నారు.

'మనము వెంటనే మరల వెనుకకు మళ్ళక తప్పదు. ఈసైన్యమంతయు మరల గౌడదేశమునుండి యమునాతీరమువర కున్నవందల కొలఁదిక్రోసులదూరము నడచి వచ్చునప్పటికి సగపడనశించిపోవును.' అని భీష్మదేవుఁ డన్నాఁడు.

'అయితే నిజముగా మరల యుద్ధమారంభ మగునందురా?'

'అను టేమి? ఆరంభ మైతీరును. అందు కేమాత్రము సందేహము లేదు. మనము గౌడదేశమున కాలుపెట్టకముందే ఘూర్జరు

లు కన్యాకుబ్జ మాక్రమించి ముందుకు వచ్చుచున్నా రన్నకబురువచ్చి తీరును. చూడు !'

'అయితే మరి ఇప్పు డీ ప్రయాణ మెందుకు ?'

'ఈమాట ఇప్పు డనుచున్నావు నీవు ! నేను విశ్వానందుఁడు ను ఇప్పట్ల ప్రయాణము పనికిరాదని ఎంతదూరము చెవినిల్లుకట్టుకొని పోరినను మీ కప్పుడు మామాట నచ్చలేదు. ససేమిరా ప్రయాణ ము పనికిరా దని నేను మరింతపట్టుబట్టి భీష్మించుకొని కూర్చున్నమె డల సైన్యము తిరుగుబాటు చేయునేమోయనికూడ నాకు తోచినది. అదిగాక మ రొకసంగతి. ఎందుకులే ఇప్పుడు ! తరువాతచెప్పెదను.'

ఇంతేవరకు రణసింహునితోను, చక్రవర్తితోను వాదమాడు చున్నజయవర్ధనుఁడు భీష్మదేవునిమాట విని 'భీష్మదేవా! మీ కేమైన పిచ్చిపట్టినదా ? ఉన్నపాటున ఘూర్జరులు వచ్చి చుట్టుముట్టినను చక్ర వర్తి గౌడదేశప్రయాణము మానఁడు. పెండ్లిచేసుకొనకుండ యుద్ధము చేయు టిఁక చక్రవర్తితరము గాదు. మీరు వృద్ధులు. పడుచువారి సంగతులు మీమనసునకు తట్టవు.' అన్నాఁడు.

చక్రవర్తి సిగ్గుపడి ముఖము వంచుకొన్నాఁడు. భీష్మదేవుఁడు చిరునవ్వు నవ్వుచు 'ఇదుగో ప్రమథసింహా ! ఈబరేంద్రమండలము వారు చెడ్డఅకతాయలు. వారిమాయలు వారిమర్మాలు వారికేగాని మ రెవ్వరికి తెలియవు.' అన్నాఁడు.

ఆమాటలకు జయవర్ధనుఁడు కొంచెమైనసిగ్గుపడక మరల 'ప్రమ థదేవ ! నామాట అబద్ధము కాదు. కన్యాకుబ్జము ప్రవేశించినవెంట నే చక్రవర్తి నాతో 'ఇంటికి తిరిగి పోవునప్పుడు రాఢదేశమందలి పుణ్యక్షేత్రములను కొన్నిటిని చూచి మరి పోవలెను.' అని అన్నాఁ డు. నేను దాని కేమన్నానో తెలిసినదా ? 'మహారాజా ! ఒక్క

గోకర్ణక్షేత్రమును దర్శించిన చాలును. తక్కినతీర్థక్షేత్రము లన్నిటిని చూచినంతఫలము చేకూరును.' అని అన్నాను. కాని చక్రవర్తి ఆ మాటకు బదులు చెప్పలేదు. దానినిబట్టి 'సరే ఇఁక త్వరలోనే చక్రవర్తి శుద్ధాంతమున మహాదేవి సాక్షాత్కరింపఁ గలదని నేనను కొన్నాను. ఏ మనెదవు?' అని అన్నాఁడు.

ఆమాట కెక్కడలేనిసిగ్గు వచ్చి చక్రవర్తి ఇఁక అక్కడ ఉండ లేక శిబిరములోనికి పారిపోయినాఁడు. ఆసమయముననే కన్యాకుబ్జ రాజదూత శిబిరముముందరికి వచ్చి భీష్మదేవున కభివాదనము చేసి నాఁడు. దూతను చూడఁగానే భీష్మదేవుఁ డాత్రముతో 'ఎవరు నీవు?' అని అడిగినాఁడు.

'మహారాజ! నేను కన్యాకుబ్జరాజదూతను. మహారాజాధి రాజ చక్రాయుధదేవమహారాజులంగారు నన్ను గౌడచక్రవర్తిసాన్ని ధ్యమునకు పంపినారు. ఘూర్జరరాజుసెలవుప్రకారము ముందుగా యుద్ధవార్త చాటించకుండనే హఠాత్తుగా మత్స్య, భోజ, మద్ర, కురు, యదు, యవన, గాంధార, కీర దేశములసామంతు లందరు కన్యాకు బ్జరాజ్యమును ముట్టడించినారు. యమునాతీరమున వందలకొలఁది చోట్ల ఘూర్జరసేనలు మాసేనలను ఓడించినవి. వారిధాటి కాఁగలేక మాసైన్యములన్నియు వెనుకకు తగ్గుచున్నవి. దక్షిణమున, పడమట, సరిహద్దులం దున్నసైన్యములను చేర్చుకొని నగరరక్షణకై చక్రాయు ధదేవులవారు వచ్చినారు. వారు గౌడచక్రవర్తిసాన్నిధ్యమున సవినయ ముగ 'ఘూర్జరులు త్వరలో కన్యాకుబ్జము ముట్టడింపఁగలరు. మేము ముట్టడిలో చిక్కుపడిపోఁగలము. సైన్యముతో వెంటనే మీరు వచ్చి సాయపడకున్నచో మా కిఁక వేఱుగతి లేదు.' అని మనవిచేయు మని చెప్పి నన్నిచటికి పంపినారు.'

ఈమాట విని భీష్మదేవుఁ డాత్రముతో లేచి నిలువఁబడినాఁడు. అది చూచి సామంతరాజగణ మంతయు లేచి నిలువఁబడినది. ప్రమథసింహుఁడు గబగబ శిబిరద్వారముకడకు వెళ్లి ' మహారాజ! త్వరగా బయటికి రండి!' అని కేక వేసినాఁడు.

వెంటనే ధర్మపాలుఁడు శిబిరమునుండి వెలుపలికి వచ్చినాఁడు. భీష్మదేవుఁడును, ప్రమథసింహుఁడును ఏకకంఠముతో ' మహారాజ! యుద్ధ మారంభమైనది. చక్రాయుధదేవుఁడు దూతను పంపినాఁడు.' అని చెప్పినారు.

ఆమాట విన్నతోడనే చక్రవర్తి వెలవెలపోయినాఁడు. కొంచెముసేపటి కాతఁడు మనసు కుదుటుపరచుకొని 'మంచిది. తాతగారూ! మీమాట తప్పిపోలేదు. గౌడసేన, గౌడసామంతులు స్వదేశమునకు తిరిగిపోవుట భగవంతున కిష్టములేదు. ఆగడియ ఇంకను రాలేదు కాఁబోలు! సరే రేపే కన్యాకుబ్జమునకు బయలుదేరవలెను. మీరందరు ప్రయాణమునకు సర్దుకొనుఁడు.' అని అన్నాఁడు.

' మనము కన్యాకుబ్జమునకు బయలుదేరకముందే కొన్నియేర్పాటులు చేయవలెను. ఉద్ధవఘోషుఁ డిప్పుడు ప్రతిష్ఠానదుర్గమం దున్నాఁడు. వెంటనే అతనికి ఈకబురు తెలియఁజేయవలెను. సాధ్యమైనంతత్వరగా క్రొత్తసైన్యములను పంపవలసిన దని మహాకుమార వాక్పాలదేవునిదగ్గరికి దూతను పంపవలెను.' అని భీష్మదేవుఁడు చెప్పినాఁడు.

కౌశాంబిమొదలుకొని స్థాణ్వీశ్వరమువరకు సరిహద్దులం దెల్ల యుద్ధము జరుగునుగాన గౌడసేనను విడఁదీసి దళము లేర్పరచుట మంచిది.' అని ప్రమథసింహుఁ డన్నాఁడు.

' ప్రమథదేవా! ఇప్పటికిని నీవు కుఱ్ఱవాఁడవే. ఘూర్జరుల

రణనీతి నీకు బొత్తుగా తెలియదు. సరిహద్దునీడలం దెప్పుడును ఘూ ర్జరులు యుద్ధము చేయరు. సేనలన్నియు నడుమ కొకచోటికి చేరిన తరువాత మిడుతలదండువలె ఘూర్జరు లొక్కుమ్మాటుగా మనల చుట్టు ముట్టుదురు. మనము వారివ్యూహమును చెదరఁగొట్టఁగలిగినయెడల దేశమునకు తిరిగిపోఁగలము. లేకున్న గాడసైనికుఁ డొక్కఁడుకూడ ఇంటిమొగము చూడఁడు.' అన్నాఁడు భీష్మదేవుఁడు.

'భీష్మదేవా! తిరిగి మన మీదూతను పంపివేయనక్కఱ లేదా ?' అని చక్రవర్తి అడిగినాఁడు.

'పంపవలసిన అవసరము లేదు. పంపినచో చారులమూల మున మనరాక ఘూర్జరులకు తెలిసిపోవును.'

'మంచిది. ఈరోజున దూత విశ్రాంతితీసుకొనవచ్చును. మన తో కలసి రేపుప్రొద్దుటనే అతఁడుకూడ కన్యాకుబ్జమునకు బయలు దేరును.'

రాత్రి జాముప్రొద్దుపోయినతరువాత చక్రవర్తి శిబిరముముందు నిలువఁబడి జయవర్ధనుఁడును కమలసింహుఁడును మాట్లాడుకొన్నారు.

'కమలసింహా! మీచెల్లెలికి కల్యాణపుగడియ ఇంకను రాలేదు. పెండ్లికోసము చక్రవర్తి నిజముగా చాల తహతహలాడిపోవు చున్నాఁడు. కాని లాభ మేమిటి? మొత్తముమీఁద ఈవిషయమున భగవంతునకు తొందర యున్నట్లు కనఁబడదు. ఇంతకు మంచిరోజులు త్రోసుకొనిరావలెను. అది మానవుని చేతిలో లేదు.' అని జయవర్ధ నుఁ డన్నాఁడు.

'కల్యాణి దురదృష్టవంతురాలు. ఇంతకు భగవత్సంకల్ప మట్లున్నప్పుడు మన మెవర మేమిచేయఁగలము ? చక్రవర్తి కామెపై అపరిమితమైన ప్రేమ ఉన్నట్లు అతనిచూపులే చెప్పక చెప్పుచున్నవి.

కల్యాణికికూడ చక్రవర్తిపై ఎక్కడలేనిప్రేమ అని ఉత్పలఘోషుఁడు నాతో చెప్పినాఁడు.'

'చక్రవర్తిమనసంతయు గోకర్ణముమీఁదనే ఉన్నదనుట కేమా త్రము సందేహము లేదు. నేను గోకర్ణముపేరెత్తగానే చక్రవర్తి ముఖము ఎట్లైనపోయినది. నీవు చూడలేదా?'

'చూడ కేమి? చూచినాను.'

'ఇం కొకరహస్య మున్నది.'

'ఏమి టది?'

'నీ వేమైనగ్రుడ్డివాఁడవా యేమి? కన్యాకుబ్జమునుంత వచ్చిన ప్పుడు చక్రవర్తి డేరాలో ఉన్నాఁడు. అతఁడు వెలుపలికి రాఁగానే సామంతు లీకబురు చెప్పినారు. అప్పుడు నీ వతనిముఖము కనుపెట్టి చూచినావా?'

'లేదు. చూడలేదు.'

'అప్పటి కప్పుడు రెక్కలుకట్టుకొని గోకర్ణమున వ్రాలవల యునని చక్రవర్తియుబలాటము. ఈకబురువలన ఆతనికి ఆశాభం గము కలిగినది. ఎప్పు డెప్పుడని తొందరపడుచున్నవాని కీయవాంత రమువలన క్రొత్తయెడబాటు కలిగినది. ఆముఖము వెలవెలపోవుట కదియే కారణము. విరహలక్షణములు మనకు తెలియదా యేమిటి?'

'అవును. సమావేశమునకు తొందరపడుచున్నవానికి నూత నవిరహము దుర్భరమే.'

---

# ౧౦

## మరికొంత కాలము.

చీకటిపడినను సర్వానందభట్టు తిరిగి ఇంటికి రాలేదు. ఇదివర కతఁ డెన్నఁడును ఇల్లువిడచి ఇంతసేపు బయటికి పోయియుండలేదు. ఎంతపని మునిఁగిపోయినను మాటిమాటికి ఇంటిలోనికి వచ్చి భార్యను చూడకుండ అతఁ డుండలేఁడు. అటువంటివాఁడు పొద్దుపోయినతరువాతకూడ ఇంటికి రాకపోవుట చూచి అమల కెక్కుడలేనిభయము పుట్టినది. మనసు చెదరిపోయినది. ఏమిచేయుటకు తోఁచక ఆమె దీపము చేతఁబుచ్చుకొని అతనిని వెదకుటకై వీథిలోనికి బయలుదేరినది. చీకటిలో ఒంటరిగా పెనిమిటిస్నేహితులయిండ్లకన్నిటికి వెళ్ళి కనుగొన్నది. కాని ఆతనిజాడ ఏమియు తెలియలేదు. జాము రాత్రివర కామె ఇల్లిల్లు తిరిగి చివరకు తనయన్నగారింటికి వచ్చినది. ఇంతరాత్రివేళ చీకటిలో అమల ఒక్కతెయే వాకిటిలోనికి వచ్చుట చూచి వదినగారు చాల కంగారుపడినది. ఈసంగతి తెలిసి అమలదేవియన్నగారు పండుకొనియున్నవాఁ డులికిపడి లేచి ఈవలికి వచ్చినాఁడు. జరిగినసంగతి యావత్తు తెలిసికొని ఇరుగుపొరుగువారిని కేకవేసి పిలిచి సర్వానందుఁ డేమైన కనఁబడినాఁ డేమో అడిగినాఁడు. పొద్దువాలినతరువాత అతఁ డెవ్వరికి కాన్పించలే దని తెలిసినది. వెంటనే ఇల్లు బయలుదేరి అగ్రహారమూ చివరనుండి ఈచివరవరకు గాలించి వెదకినారు. కాని ఆతనిజాడ దొరకలేదు. సొంతయింటితలుపు గొళ్ళెము వేసి ఏడ్చుచు అమల పుట్టింటికి వచ్చినది.

ఇది జరిగిపోయినకొన్నాళ్ళకు అమలదేవి యన్నగారికి రాజధా

నినుండి ఆహ్వానము వచ్చినది. వరాహరాతభట్టాచార్యులవారికి గౌడ నగరమునకు వెళ్ళకతప్పినది కాదు.

వరాహరాతభట్టాచార్యులవారితండ్రిపేరు విశ్వరాతభట్టాచార్యులు. అతఁడు న్యాయశాస్త్రమందు పేరుమోసినపండితుఁడు. దేశములోని సంస్కారులందరిలో అతనికి మంచిపేరున్నది. శాస్త్రపాఠములు చెప్పుటలో అతనికి కొట్టినపిండి. న్యాయవాదమునందతఁడు చెప్పినది వేదము. శాస్త్రవాదమునందితనిని గెలువఁగలపండితుఁడా గౌడదేశము మొత్తముమీఁద లేనేలేఁడని చెప్పవలయును. రాజాస్థానమందుండవలసిన దని గౌడదేశమహామంత్రులవారైనగర్గదేవశర్మగారు ఆయనను చాల బలవంతపెట్టినారు. కాని రాజధానియం దుండుట కాతఁ డొప్పుకొనలేదు. అతనియనంతరము అతనికొడుకైన వరాహరాతభట్టుకూడ తండ్రియంతవాఁ డైనాఁడు. ఇంటికైన పెద్దవాఁ డిప్పుడు తానే కావున వరాహరాతభట్టు అప్పుడప్పుడు గౌడనగరమునకు వెళ్ళవలసివచ్చెడిది. కొద్దిరోజులలోనే అతఁడు మహామంత్రులవారియిష్టులలో ముఖ్యుఁ డైనాఁడు.

గోపాలదేవునికాలముననే గౌడదేశము సామ్రాజ్యమైనది. అనేకరాజకీయపదవులు సృష్టిఅయినవి. ఉద్యోగు లెందరో కావలసివచ్చినారు. అందువలన ఏదైనరాజోద్యోగము స్వీకరింపవలసిన దని గర్గదేవులవారు భట్టును బలవంతపెట్టినారు. చదువుసంధ్యలు లేనిపురుషోత్తమశర్మను మహాపురోహితపదవినుండి తీసివేసి భట్టున కాపదవి కట్టిపెట్టవలె నని మహామంత్రితలంపు. కాని ఈనియామకము మహాదేవి దేవదేవి కేమాత్రము సమ్మతిలేదు. పూర్వ మొకప్పుడు ముందుగా శుభవార్త తెచ్చిచెప్పినకారణమున పురుషోత్తమశర్మ కామెయే ఆపదవి ఇప్పించినది. ఇప్పుడతనిని తీసివేయుట కసలు వీలు లేదు. ఆమె

పట్టబట్టినది. అందుచే మహామంత్రి తనయభిప్రాయము మార్చుకొన్నాడు. ఇంతలో మహాక్షపటలికోద్యోగము ఖాళీవచ్చినది. వెంటనే మహామంత్రి భట్టును పిలువనంపి ఆపదవియందతనిని నియోగించినాడు. మహామంత్రులవారిబలవంతమున రాజోద్యోగి కాగానే భట్టు సకుటుంబముగ రాజధానికి వచ్చి కాపురము పెట్టినాడు. చదువుకొన్నవాడు, కష్టపడి పనిచేయఁగలవాడు, మంచిబుద్ధికుశలతలు కలవాఁడు కాఁబట్టి భట్టు కొలఁదికాలములోనే ప్రఖ్యాతి సంపాదించి గౌడరాజ్యపుప్రధానోద్యోగులలో ఒకఁడైనాఁడు. కొన్నాళ్ళకు మహామంత్రులవారు వర్ధమానమండలధర్మాధికారిగా భట్టును నియోగించినారు. అతఁడు రాఢదేశమునకు వచ్చి డెక్కరీనగరమున నివాసమున్నాఁడు. వేరుదారి లేకపోవుటచే అమలదేవికూడ అన్నగారితో పాటు అక్కడికే వచ్చినది.

కన్యాకుబ్జమునుండి చక్రవర్తి విజయయాత్రసంగతి తెలియఁగానే గౌడనగరమునుండి క్రొత్తసైన్యము కన్యాకుబ్జమునకు బయలుదేరినది. ఆసమయమున రాఢదేశమునుండికూడ చాలాసైన్యములు వెళ్లినవి. వారందరితో కూడవరాహరాతభట్టు తనభావమరదివిషయమై కనుగొనవలసినదని చెప్పినాఁడు. కాని అందువలనగూడ లాభము లేకపోయినది. అతఁ డెక్కడనున్న సంగతి ఎవ్వరికిని తెలియదు.

కొన్నాళ్లకు మరల ఘూర్జరులు కన్యాకుబ్జము నాక్రమించుచున్నారు కాఁబట్టి సాధ్యమైనంతత్వరలో క్రొత్తసైన్యములను కూడఁగొట్టి పంపవలసిన దని చక్రవర్తివద్దనుండి మరొకకబురు వచ్చినది. వెంటనే లక్షసైన్యముతో మహాకుమారవాక్పాలదేవుఁడు కన్యాకుబ్జమునకు బయలుదేరుట స్థిరపడినది. ఈసంగతి విని వరాహరాతభట్టు మధ్యదేశమున సర్వానిమాసియనుసంధానమునకై మహాకుమారుని

బలవంతపెట్టవలసిన దని మహామంత్రికి ప్రార్థనపూర్వకముగ బాబు వ్రాసినాఁడు. అట్లే తప్పక అనుసంధించెద నని వాక్పాలదేవుఁడు మహామంత్రికి వాగ్దానము చేసినాఁడు. వర్షాకాలము వెళ్లఁగానే సైన్యముతోకూడ వాక్పాలదేవుఁడు కన్యాకుబ్జమునకు బయలుదేరినాఁడు.

ఒకనాటిసాయంకాలమున డెక్కా—రీనగరమందలి ఒకభవనము ముంగిట కూర్చుండి మలినవేషధారిణి యైనయువతి ఒకతె సాయంతన దేవపూజకై వత్తివత్తి సర్దుకొనుచున్నది. ఆయింటి అరుగుమీదనే మరొకపడుచుముత్తైదువ చంటిపిల్ల నెత్తుకొని కూర్చున్నది. ఆమె ఆయువతికేసి చూచి "వదినా! ఇంతమందినౌకరులు, చాకరులు ఉండఁగా మీరు శ్రమపడు టెందుకు చెప్పండి. ఈకొంచెముపని వాళ్లతో చెప్పిన వాళ్లు చేయరా?" అన్నది.

"ఏమి చేయను? ఏదో పనిబెట్టుకొన్నఁగాని ప్రొద్దుపోదు. మన్నదిన్నపామువలె పనిపాటు లేకుండ కూర్చున్నయెడల బెంగచేత ఉన్నమతికొంచెము పోవును. ఆపని ఈపని ముందుబెట్టుకొని రోజు లెట్లో వెళ్లఁబుచ్చుచున్నాను." అని అమలదేవి ప్రమిదలో నూనె పోయుచు అన్నది.

"వదినా! ఎప్పటికిని అదేపనిగ బెంగపెట్టుకొని మనసు పాడుచేసుకొనకండి. అతఁ డెప్పుడో ఒకప్పుడు ఇంటికి రాకమానఁడు. అతనిమనసెప్పుడు మీమీదనే. రాక ఎక్కడికి పోఁగలఁడు? ఊరక బెంగపెట్టుకొని కూర్చున్న లాభ మేమిటి చెప్పండి" అని అన్నభార్య అన్నది.

"ఏమి రావడము నామొగము! అదుగో ఇదుగో అని ఇప్పటి కప్పుడే ఆయన ఇంటిపట్టువదలి ఏడాది కావచ్చినది. నన్ను చూడ కూడ ఒక్కగడియసేపుకూడ ఉండఁబట్టలేకపోయెడివా రాయన. ఆదే

పుడు లేనప్పుడు నాకు ప్రపంచ మేమిటి వల్లకాడు ! నే నేదో పని మీాద ఎక్కడికైన వెళ్లి ఒక్క అరగడియ సేపు కనఁబడక పోతే ఆయనకు లోకమే చీకటైపోయేది. ప్రొద్దస్తమానముకూడ ఆయనప్రాణాలన్ని నామీాదనే. అటువంటి ఆయన ఇన్నాళ్ళవరకు నన్ను చూడకుండ ఉండఁగలరా ? ఆయన మరి ఉన్నాఁడో లేదో ! ఉండడమే కనుక నిజమైతే తిరిగిరారా మరి ? ఏమి వదినా ? ఏది లేకపోయిన చివరకు నాకు కబురైన పంపరా ? చూడు. వదినా ! నన్ను విడచి పెట్టి ఉండవలసి వచ్చునని చివరకు పొరుగూరికి వెళ్ళుటకుకూడ ఆయన ఇష్టపడెడివారు కారు. నాకోసమే ఆయన కాఁగుడిసె స్వర్గమైపోయినది. అన్యో ! నా నెత్తిన రాయిఁబడ ! నా మొగము మండ ! ఎంతపాపిష్ఠిదాన నైపోయినా నమ్మా ! వదినా ! ఎప్పటికైన నారేఖ బైటఁబడునా ? నేను కనఁబడకున్న ఆయన కొక్కగడియ తోఁచదు. అటువంటప్పుడు నన్ను చూడకుండ ఇన్నా ళ్ళుండఁగలరా వదినా ? ఇఁక ఆయన లేరు. కాని పోని మాటలు చెప్పి మీారు నా కన్నీళ్లు తుడుచుచున్నారు. నిజముగానే ఆయన ఉన్నయెడల, అమలా అని పిలువకుండ ఒక్కక్షణ మాఁగలేనివారు ఇన్నాళ్ళవరకు ఇంటికి రాకుండ ఉండునా ? '

అమల ఇక మాటాడలేకపోయినది. ఆమెకన్నులనుండి ఎడతెరపిలేకుండ బాష్పములు కురిసినవి. అది చూచి ఆమెవదినకూడ గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు అరుగుదిగివచ్చి తనపైటచెరఁగుతో వదినగారి కన్నులు తుడుచుచు “ ఛీ ! వదినా ! ఏమిపని ఇది అసలుసంజవేళ? ఏడువకు ! నీవు కంటఁగడిబెట్టినయెడల ఆయన కశుభముకూడ. అవసరము వచ్చినగనా ఇల్లువిడిచి పొరుగుచోట ఎన్నాళ్లైన ఉండవలసి

వచ్చును. ఉద్యోగము సద్యోగము చేసుకొనవలసినమగవారు మన లాగున ఎప్పుడును ఇల్లు కనుపెట్టుకొని యుందురా చెప్పు! ఏదో నాల్గుడబ్బులు సంపాదించుకొని వచ్చుటకు ఆయన దేశాంతరము వెళ్లినాడు. నేడు గాకపోయిన రేపైన తప్పక వచ్చితీరును. అందు కోసమని ఏడ్చుచు బెంగపెట్టుకొని కూర్చుండిన లాభమేమిటి?" అని ఓదార్చినది.

వదినగారిమాటతో అమలకు వెనుకజరిగినగాథ అంతయు జ్ఞాపకము వచ్చినది. ఇంక ఆమెకు దుఃఖ మాగలేదు. కన్నీరు వరద గట్లు నట్లేచ్చుచు ఆమె వెక్కివెక్కి "వదినా! నాచేతులార నాకొంపకు నేనే ముప్పు తెచ్చుకొన్నాను. ఇష్టముండి ఆయన దేశాంతరము పోలేదు. ఆయన ఇల్లు విడచి పరదేశాలపా లగుటకు నాపాపిష్ఠిఘటమే కారణము." అన్నది.

అమల దుఃఖము మరపించుటకు ఆమె ఎంతో ప్రయత్నించినది. ప్రసంగము మార్చినచో మనసు కొంచెము కుదుటబడునని తలచి ఆమె "వదినా! అందులో నీత ప్పేమున్నది?" అని అడిగినది.

అడ్డుపెట్టినకొలది పై కుబికి వచ్చుట దుఃఖమునకు లక్షణము. నిజముగా ఓదార్పు దుఃఖము నెక్కువచేయును గాని తగ్గించలేదు. వదినెగారి ప్రశ్నకు విపరీతఫలము వచ్చినది. ఆప్రశ్నతో వెనుకటిసంగతు లన్నియు మనసునతోచి అమల కెక్కడలేనిదుఃఖము పొంగి పొరలి వచ్చినది. ఆమె తలచుకొనితలచుకొని ఏడ్చుచు "ఆయన తనంతట తాను ఇంటిపట్టు వదలిపోలేదు. నేను చెప్పలేను వదినా? నామూలముననే ఇంతకొంప మునిగినది. నాదేవుడు నాకు గాకుండ పోయినాడు. నే నాయనమనసు తెలిసికొనలేక పోయినాను. అయ్యో! నా తలవ్రాత పగులు! నా చేతులార కోరికోరి నా దేవుని సింహాసనము

నుండి లాగి పారవేసినాను. నా కింక పుట్టగతు లున్నవా? అయ్యో! ఆపాపానికి ఇప్పుడు ప్రాయశ్చిత్త మనుభవించుచున్నాను. నాకర్మమే నన్ను కట్టికుడుపుచున్నది. అయ్యో! ఎంతపాపము పండినదమ్మా! వదినా! మరల నాదేవుఁడు నాకంటఁ బడునా? నాయింటదీపము వెలుఁగునా? నానుదుట ప్రొద్దుపొడుచునా? అయ్యో కర్మమా! నా కాయదృష్టమే ఉన్న యెడల ఇంతపుట్టిముసుక ఎందుకుదాపురించును? ఏడ్చిఏడ్చి నాగొమ్ము గరిశెలుపడుచున్నది. నాకాంక్ష గడ్డలుకాను! ఆమాయదారికోరికమూలాన సీతకువచ్చినన్నికష్టాలు వచ్చినవమ్మా! వదినా! ఈపాపిష్ఠిఘటము బ్రిద్దలుకా దేమి? నాకు చావురా దేమి? అయ్యో! పచ్చతోరణము పటాలున త్రెంచినాను. వదినా! నాయీగ చావులు ఎప్పుడు తీరిపోవునమ్మా? నారాజు వచ్చి ఎప్పటికైన నోరార ‘అమలా!’ అని నన్ను పిలుచునా? నాకోసము ఇట్టివెనలుమూలల వెదకునా?’ అని గోలకెత్తినది.

ఆమెదుఃఖము చూచి వదినెగారుకూడ కంట నీరుపెట్టుకొన మొదలుపెట్టినది. వా రిరువురు ఇట్లు దుఃఖించుచుండఁగా చంటిపిల్ల అక్కడిపూజాసామగ్రిని నలువైపులకు విరఁజిమ్మివేసినది. ఆచంటిబిడ్డ చేయుచున్నపసిని వారిరువురుకూడ ఎరుఁగనే ఎరుఁగరు.

ప్రొద్దుక్రుంకినది. ఇంటింట దీపములు పెట్టినారు. కోవెలలలో శంఖఘంటాధ్వనులు మ్రోగినవి. ఆచప్పుడువలన మరల వారిరువురికి జ్ఞానము కలిగినది. పైటచెరఁగుతో కన్నులు తుడుచుకొని అమల మరల పూజాసామగ్రిని సిద్ధముచేసుకొనసాగినది. చంటిబిడ్డ నెత్తుకొని వదినెగారు ఇంటిలోనికి పోవుటకై లేచినది. ఇంతలో ఎవరో వాకిట పిలిచినారు. ఆపిలుపు విని అమల కంగారుపడుచు ముసుఁగుసవ్దుకొని

లోపలికి వెళ్లుటకు లేచినది. ఇంతలో వెనుకనుండి ‘ అమలా !’ అని ఎవరో పిలచినారు.

‘ ఎవరు అన్నయ్యా ? నీవేనా ?’ అని అమల ఒకనిట్టూర్పు విడచినది.

‘ అవును.’ అని వరాహరాతభట్టాచార్యులవారు అన్నారు.

‘ నీకొఱకు అనహాలుపట్టలేకపోయినాము. చెడ్డకంగారుపుట్టినది. ఈవేళ ఇంతపొద్దుపోయిన దేమి ?’

‘ గౌడనగరమునుండి ఒకదుర్వార్త వచ్చినది. అందువలన మనసు బాగులేక పని పూర్తిచేసుకొని వచ్చునప్పటికి ఈవేళ అయినది.’

‘ ఏమి కబురు ? ఆయనసంగతి కాదుగదా ?’

‘ కాదు. అమలా ! ఆసంగతి కాదు. క్రొత్తసైన్యము లక్కడికి చేరకమునుపే మహారాజాధిరాజధర్మపాలదేవుఁడు ఘూర్జరులచేత ఓడిపోయినాఁడు. ఘూర్జరులు మరల సమస్తకన్యాకుబ్జరాజ్యమును ఆక్రమించుకొన్నారు.’

‘ అయ్యో !’ అని అమల ఒకపెద్దనిట్టూర్పు విడచినది.

# చతుర్థఖండము.

౧

ఆహారాన్వేషణము.

సైన్యముతోఁగూడ ధర్మపాలదేవుఁడు కన్యాకుబ్జమువైపునకు మరలినాఁడు. రెండుమూఁడురోజు లగునప్పటికి దారిలోనే వారికి ఘూర్జరులరణనీతి బాగుగా తెలిసివచ్చినది. ముందునకుపోయినకొలఁది జనశూన్యమైనదేశము, కాలిపోయిననగరములును, గ్రామములును, ఏనుఁగులు గుఱ్ఱాలు త్రొక్కి-పాడుచేసినపైరుపొలాలు తప్ప వారి కేమియు కానవచ్చుటలేదు. రోజురోజునకు సైనికులకు, బరువులు మోయుజంతువులకు తిండి దొరకుట కష్టమైపోవుచున్నది. ఈయిబ్బంది కనుపెట్టి భీష్మదేవుఁడు చాలా విచారించినాఁడు. అయినను గౌడసేన ఎట్లో మెల్లమెల్లగా ముందుకు పోసాగినది. జయవర్ధనుఁడు, విమలనంది, కమలసింహుఁడు మొదలైననాయకులందరును ప్రతిదినము ప్రొద్దుటనే గుఱ్ఱపుదండును వెంటఁదీసుకొని చుట్టుపట్ల దూరగ్రామములకు తినుబండారములు సంపాదించుటకై వెళ్ళుచున్నారు.

ఉన్నట్లుండి ఘూర్జరులగుఱ్ఱపుదండు గ్రామములపైఁ బడి అమాయకులైనప్రజలను హత్యచేయుచున్నది. పల్లెటూళ్లను, పట్టణములను కూడ కాల్చివేయుచున్నది. తినుబండారము లేమైనజాగ్రత పెట్టుకొన్నచో సైనికులు వాటిని దుమ్ములో పారఁబోయుచున్నారు. అందువలన గౌడసైనికులకు ఆహారపదార్థము లేవియు దొరకుటలేదు. ఏదోవిధముగ కష్టపడి పదార్థము లేమైన సంపాదించుకొన్నను నదు

దారిలో గ్రద్దలవలె ఘూర్జరసైనికులు వచ్చి పడి వాటిని తన్నుకొని పోవుచున్నారు. గౌడసేనానాయకులొక్కొక్కమారు కూడఁగొట్టి తెచ్చుకొన్న ఆహారపదార్థములను విడచిపెట్టి ఆత్మరక్షణకై పాఱిపో వలసివచ్చుచున్నది. క్రమముగా గౌడసైన్యములోని అశ్వసైనికులు తగ్గిపోవుచున్నారు. గుఱ్ఱపుదండు లేకున్నచో ఘూర్జరులతో యుద్ధమున కసలే వీలు లేదు. ఇట్టియుద్ధములకు కాల్బల మెంత ఉన్నను లాభము లేదు. కొన్నిరోజులు ఒకపూటనే తిండి తిని, కొన్నిరోజులు కట్టి పాసములు చేసి, ఎట్లో చావుదెబ్బలమీద ధర్మపాలుఁడు కన్యాకుబ్జము చేరినాఁడు. అతఁడు సైన్యముతో నగరమున ప్రవేశించుట తెలిసియు ఘూర్జరసేన చూచిచూడనట్లూరకున్నది. ముందుముందు ఇబ్బంది రావచ్చునని తలంచి భీష్మదేవుఁడుమాత్రము గంగాతీరమందే శిబిర మేర్పాటుచేయుటకు ప్రయత్నించినాఁడు. కాని లక్షలకొలఁది ఘూర్జరసైనికు లొక్కమాటుగా చుట్టుకొని అతనిని, అతనిసైన్యమును చెల్లాచెదరు చేసివైచినారు. చివరకు తప్పించుకొనివచ్చి అతఁడుకూడ నగరములోనికే పోయినాఁడు. అతఁడు నగరములో ప్రవేశించినతక్షణమే ఘూర్జరులు కన్యాకుబ్జమును నాలుగువైపుల ముట్టడించినారు.

నగరములోనికి రాఁగానే భీష్మదేవుఁడు ముందుసంగతినిగూర్చి ఆలోచింపసాగినాఁడు. గౌడనగరమునుండి వచ్చుచున్నక్రొత్తసైన్యము చాలదూరములో ఉన్నది. వందక్రోసుల ఈలోపల తమకు సాయపడుసైన్య మేదియు లేదు. నగరములో, త్రాగుటకు నీరుతప్ప,ఆహారపదార్థము లేవియు చాలినన్ని లేవు. ఈస్థితిలో యుద్ధము చేసినయెడల అపజయము తప్పదు. సామంతు లందరిముందు భీష్మదేవుఁ డీవిషయములను వెల్లడించి చివరకు “క్షత్రియుఁడైనవాఁడు యుద్ధమును వెనుకకు వేయఁడు. కాని వృథాగా సైన్యమును నష్టపెట్టుకొనుట

నా కిష్టములేదు. నగరములో లెక్కలేనంతమందిజను లున్నారు. వేన వేలుసైనికు లున్నారు. ఇప్పు డున్నఆహారపదార్థములు వీరందరికెన్ని రోజులు వచ్చును ? ” అని అడిగినాఁడు.

“ ఒకనెలరోజులు రావచ్చును.” అని చక్రాయుధుఁడు బదులు చెప్పినాఁడు.

“ తరువాతదారి ? ”

‘ అపజయమో మృత్యువో ? ’

‘ మరణించుటకు మోఘుఁడైనవాఁ డెప్పుడును కత్తిదూసి నిలువఁబడును. కాని పరాజయముమాత్రము అవమానకరము. తిండి తిప్పలు లేకుండ ముట్టడిలో జనులు చాలాకాలము ఉండలేదు.అప్పుడు లోపల వెలుపటకూడ యుద్ధ మారంభమగును. అందుచే సావధాన ముగ యోచింపవలెను. ”

‘ అయితే ఇప్పుడు మనకు మార్గ మేమిటి ? ’ అని చక్రవర్తి అడిగినాఁడు.

‘ కన్యాకుబ్జమునుండి వెనుకకు తిరిగిపోవుటయే నామట్టునకు నాకు మంచిదిగా తోఁచుచున్నది. క్రొత్తసైన్యము రాఁగానే మధ్య దేశమును ఆక్రమించుటకు ఆట్టేరోజు లక్కర లేదు. కాని చేతిలో ఉన్న దుర్గమును ఊరక విడిచిపెట్టుట చాలా కష్టము ’ అని భీష్మదేవుఁ డన్నాఁడు.

‘ భీష్మదేవ ! నాచేతులార నేను కన్యాకుబ్జమును పోరాడ కుండ శత్రువులపాలు చేయలేను. యుద్ధముచేసి చచ్చిపోయెదను. నేను పోయినమాత్రాన గౌడదేశమున కేలోటును రాదు. కాని వెను దిరిగి పోయినచో అపకీర్తి తప్పక వచ్చును. బ్రతికియున్నంతవరకు ఘూర్జరులు దానిని దెప్పిపొడుచుచుందురు. ’ అన్నాఁడు చక్రవర్తి.

‘వెనుకకు వెళ్లినంతమాత్రాన ఓడిపోయినట్లు కాదు మహా రాజా !’

‘అది కాదు భీష్మదేవా ! నగరములో వేనవేలు గౌడసైనికు లున్నారు. వారిలో చచ్చుటకు సంసిద్ధులైనవారెల్లరు నాతో ఉండ వచ్చును. మిగిలినవారిని వెంటఁబెట్టుకొని మీరు మరల ప్రతిష్ఠానము నకు తిరిగిపొండు. అక్కఱైనచో ఆహారపదార్థములతో గూడ క్రొత్త సేనను వెంటఁబెట్టుకొని వచ్చి మీరు మాకు సహాయపడవచ్చును. అంతవరకు మే మెట్లో తంటాలుపడెదము.’

‘మహారాజ ! నేను వృద్ధుఁడను. ముట్టడిలో మిమ్ము వదలిపెట్టి నే నొక్కఁడను వెనుకకు పోఁగలనా ? ఇదేనా గౌడచక్రవర్తి న్యాయ విచారణ ?’

‘అది కాదుభీష్మదేవా! ఇదియే నా మొదటియుద్ధయాత్ర. అందుచే నేను ప్రాణము లున్నంతవరకు పోరాడక వెనుకకు తిరిగిపోలేను.’

‘మిమ్ము ముట్టడిలో దిగవిడచి నే నే మొగము పెట్టుకొని గౌడ దేశమునకు పోఁగలను ?’

సేనానాయకులు, సామంతులు మొదలైనవా రందరును అక్క డనే కూడియున్నారు. భీష్మదేవునికి చక్రవర్తికి జరుగుచున్న సంభాష ణను వారు మహాసక్తి వినుచున్నారు. ఆసమయమున జయవర్ధనుఁడు లేచి ‘‘ అయితే ఎవ్వరును వెనుకకు తిరిగిపో నక్కరలేదు.’ అని అన్నాఁడు.

‘ఉన్నది. జయవర్ధనా ! ముట్టడిలో చిక్కుపడిపోయినచో రోజురోజునకు సైన్యము క్షీణించిపోవును. క్రొత్తసైన్యము వచ్చి చేర వలెను. తినుబండారములు సంపాదించుకొనవలెను. అధమము వీని కోసమైనను మనము వెనుకకు వెళ్లక తప్పదు. లేకున్నచో ముట్టడిలో

చిక్కుకొని చావవలసినదే.' అని రణసింహుఁడు చెప్పినాఁడు.

'ప్రస్తుతము దుర్గములో ఉన్న గుఱ్ఱపుదళ మెంత?' అని భీష్మదేవుఁ డడిగినాఁడు.

'పాతిక వేలకు తక్కువ వుండదు!' అని విమలనంది బదులు చెప్పినాఁడు.

'పదునైదు వేలగుఱ్ఱపుదళమును వెంటఁ దీసుకొని ఉన్న పాటున ప్రతిష్ఠానమునకు ఎవరు పోఁగలరు?' అని భీష్మదేవుఁ డడిగినాఁడు.

'అందరును.' అన్నాఁడు విమలనంది.

'వేళాకోళమాడుచున్నావా? నందిపుత్రి!' అని భీష్మదేవుఁడు కన్నెఱ్ఱఁ జేసినాఁడు.

'స్వామీ! తమతో వేళాకోళ మాడఁగలసాహస మున్నదా నాకు? నేను ప్రతిష్ఠానమునకు కాదు పదునైదువేలసైన్యముతో భిల్లమాలానగరముపైఁ బడుటకే పోఁగలను. చచ్చుప్రతిష్ఠానము లెక్కా? జమా?'

'ముట్టడిసమయమున గుఱ్ఱపుదళముతో ప్రయోజనము లేదు. సైన్యమును బయటికి పంపకున్న గుఱ్ఱములకుకూడ మేత పెట్టవల్లసి వచ్చును.' అన్నాఁడు భీష్మదేవుఁడు.

'దానికై విచారపడవలసిన అవసరము లేదు. కాని ప్రస్తుతము పదివేలగుఱ్ఱపుదళముతో ఘూర్జరులస్కంధావారమును చెదరఁగొట్టుటకు ఎవ్వరు పోఁగలరు? త్వరగా చెప్పవలెను.' అని చక్రవర్తి మరల సామంతులను ప్రశ్నించినాఁడు.

'నేను.' అన్నాఁడు జయవర్ధనుఁడు.

'నేను వెళ్ళఁగలను.' అన్నాఁడు కమలసింహుఁడు.

'నా కైదువేలసైన్య మిచ్చిన చాలును. వెళ్లి నిముసములో

ఘూర్జరులశిబిరమును కుక్కలు దిన్నవిస్తరి చేసివచ్చెదను.' అని విమల నంది లేచినాఁడు.

'ఒక్కసామంతుఁడు వెళ్లిన చాలును.' అని భీష్మదేవుఁడు చెప్పినాఁడు.

'విమలనందీ! నీవు వెళ్ళుటకు వీలులేదు.' అని చక్రవర్తి అన్నాఁడు.

'మహారాజ! నే నేమి పాపము చేసుకొన్నాను?'

'అది కాదు విమలా! నీవు చేయవలసినపని వేఱే ఉన్నది.'

'సరే. జయవర్ధనుఁడు కమలసింహుఁడు కలసి వెళ్ళవచ్చును. మహారాజ! తమసెల వేమిటి?' అని భీష్మదేవుఁ డడిగినాఁడు.

'సరే. జయవర్ధనుఁడు వెళ్ళవచ్చును.'

'అయితే మహారాజ! నేనో మరి?' అని కమలసింహుఁ డన్నాఁడు.

'మీరు నాకు పిచ్చి ఎత్తించుచున్నారు. చూడు. కమల సింహా! నీవు నాతో ఉండి యుద్ధమునకు రావలెను.'

'మీవెంట రావలెనా?'

'అవును.'

యుద్ధ మెక్కడ? ఇప్పుడు మహారాజా!'

'ఆసంగతి తరువాత చెప్పెదను. జయవర్ధనా! నీవు రేపు ప్రొద్దుటనే బయలుదేరవలెను. యుద్ధము చేయకుండ ఘూర్జరస్కంధావారమును చీల్చుకొని ముందునకు వెళ్ళిపోవలెను. వాయువేగమున ప్రతిష్ఠానమునకు పోవలెను. క్రొత్తసైన్యమునుకూర్చుకొని తీసుకొనిరావలెను. అశ్వసైన్యమునుమాత్రము వెంటఁదీసుకొని ప్రతిష్ఠాన మార్గమును విడిచిపెట్టవలెను. ఈపనులు ఎంతతొందరగా జరిగిన

అంతమంచిది. లక్షకాల్బలమును, ఏబది వేలగుఱ్ఱపుసైన్యమును పంపతల సిన దని ప్రయాగనుండి గౌడనగరమునకు కబురు పంపవలెను నీవు. తెలిసినదా ?'

' చిత్తము. మీయాజ్ఞ శిరసావహించెదను. '

' మహారాజ ! మిగిలిన గుఱ్ఱపుదళమో ?' అని భీష్మదేవు డడిగినాడు.

' తాతగారూ ! రేపు నేనుగూడ యుద్ధమునకు వెళ్లెదను. '

' మీరు యుద్ధమునకా ?'

' అవును. కమలసింహుడు, విమలవంది, నేను, కలసి తక్కిన గుఱ్ఱపుదళముతో ఆహారపదార్థములకోసము పడమటికి వెళ్లెదము. '

' పడమటికా ?'

' అవును. జయవర్ధనుడు తూర్పునకు వెళ్లును. మేము పడ మటికి వెళ్లెదము. '

' మహారాజ ! మేముకూడ వచ్చెదము !' అని రణసింహుడు, ప్రమథసింహుడు, వీరదేవుడు మొదలైన సేనానాయకు లందరొక్క పెట్టున లేచి నిలువబడినారు.

' మీరు భీష్మదేవునికి పార్శ్వరక్షకులై ఉండవలెను. మే మెం తో దూరము పోము. ఒకటి రెండు రోజులలోనే మరల తిరిగి వత్తుము.'

మరునాటి ప్రొద్దుటనే కన్యాకుబ్జపు తూర్పునగరివాకిటనుండి హఠాత్తుగా పదివేలగుఱ్ఱపుదళము దుర్గము విడిచిపెట్టి బయలుదేరి ఘూర్జరశిబిరముపై పడినది. ఘూర్జరులు యుద్ధమునకు సద్దుకొనులో పలనే స్కంధావారమును చెల్లాచెదరు చేసివైచి ఆసైన్యము తూర్పు గా పారిపోయినది. నాలుగైదుక్రోసులవరకు ఘూర్జరులు వారిని తరిమినారు. జయవర్ధనుని తరుముకొనుచు ఘూర్జరసేనలు బయలు

చేరినవెంటనే నగరిపశ్చిమద్వారమునుండి పదునైదువేలసైన్యముతో ధర్మపాలుఁడు బయలువెడలినాఁడు. ఘూర్జరు లాసైన్యమును ఆక్రమించినారు కాని పెద్దగాలిదెబ్బకు మబ్బులు చెదరిపోయినట్లు ఎక్కడివా రక్కడ నాలుగువైపులకు చెల్లాచెదరైపోయినారు. చూచుచుండఁగానే పదివేలసైన్యముకూడ గుఱ్ఱపుడెక్కలతాకున రేగిన పెంధూళిమబ్బులో అదృశ్యమైపోయినది.

---

## ౨

### అదృష్టచక్రము తిరిగిపోయినది.

రాత్రి రెండవజాము కావచ్చినది. వారణాసీనగరపువీథు లన్నియు చీకఁటి కొట్టాడుచున్నవి. దుకాణములందలిదీపము లన్నియు ఆరిపోయినవి. వీథులలో జనసమ్మర్ద మేమాత్రమును లేదు. ఆసమయమున ఒకమేడదగ్గర చీకటిచాటున ఎవరికొరకో ఎదురుచూచుచు ఒకబౌద్ధసన్న్యాసి దాగుకొన్నాఁడు. అతఁ డాచీకటిలో మాటిమాటికి వీథికేసి తొంగితొంగి చూచుచున్నాఁడు.

రెండవజామున తోరణములందు మ్రోగుమంగళవాద్యములు ఆగిపోయినవి. వారణాసీనగరమందలి లెక్కలేనిదేవాలయములలో రాత్రిపూజాసమయమున మ్రోగుశంఖఘంటానాదములుగూడ తగ్గిపోయినవి. ఎక్కడను చీమచిటుకుమనుసడికూడ లేదు. ఆమహానగరము చీకటిలో మునిగి నిశ్శబ్దముగ ఉన్నది.

ఆసమయమున రాతికూర్పుగల రాజగృహపు [illegible]ప్పుడు వినవచ్చినది. అది విని ఆసన్న్యాసి ఆమేడచాటున దాగుకొన్నాఁడు.

కొంచెముసేపటిలో అస్త్రధారి యైనయోధుఁ డొకఁ డామేడ దగ్గరికి వచ్చినిలువఁబడినాఁడు. అప్పుడు ఆసన్న్యాసి గుమ్మములోపల నుండియే "ఎవరు నీవు ?" అని అడిగినాఁడు.

'నేను భిల్లమాలనుండి వచ్చినఅతిథిని.' అని ఆయోధుఁడు బదులు చెప్పినాఁడు.

'ఆనవాలు ?'

‘ ఆర్యసంఘము సెలవుప్రకారము నాదగ్గరికి “ ధర్మచక్రము ” పంపినారు. ’

‘ అది మీదగ్గర ఉన్నదా ఇప్పుడు ? ’

‘ ఆఁ. ఉన్నది. ’

‘ ఏది ? చూపెదరా ? ’

పైఁబట్టచాటుననుండి గుండ్రని ధాతుఖండమును బైటికి తీసి సన్న్యాసి కిచ్చినాఁ డాయోధుఁడు. వెంటనే సన్న్యాసి “ లోపలికి దయ చేయండి ! ” అని అన్నాఁడు.

యోధుఁడు మేడలోనికి వచ్చినాఁడు. నలువైపుల కటికచీకటి. దారి తెన్ను కనఁబడుట లేదు. యోధుఁడు కొంచెము తడబాటుపడుచు “ ఏమార్గమున రాను ? ” అని అడిగినాఁడు. ఆప్రశ్నకు బదులు చెప్పకుండ సన్న్యాసి అతనిచేయి పట్టుకొని ముందుకు తీసుకొనిపోసాగినాఁడు. చీకటి కొల్లాడుచున్న కొన్నిగదులు దాటి వారుభయులు మేడనడుమకు వచ్చినారు.

ఆమేడ పడిపోవుటకు సిద్ధముగా ఉన్నది. పైయంతస్థున కొంత భాగము పడిపోయినదికూడ. దానిముంగిట లతలు పొదలు పెరిగిపోయినవి. మేడ పెద్దదైనను మనుష్యు లున్నజాడ ఏమియు కానవచ్చుట లేదు. వా రుభయులు ఒకగదిలోనికి వెళ్లినారు. ఆగదినిండ చీకటి కొల్లాడుచున్నది. ఆచీకటిలోనే సన్న్యాసి ఆగదిలోని మెట్లవరుస దిగి నేలమాళిగ ప్రవేశించినాఁడు. అలవాటు లేకపోవుటవలన యోధుఁడుమాత్రము గబగబ ఆమెట్లు దిగలేకపోయినాఁడు. ఆసొరంగపుదారి నిబడి కొంచెము సేపు నడచునప్పటికి మఱొక మెట్లవరుస తగిలినది. ఆమెట్లమీఁదుగా వారుభయులు పై కెక్కిపోసాగినారు. సన్న్యాసి ముందుగా వెళ్ళి పైమెట్టుమీద నిలుచుండబడి తలుపు తట్టినాఁడు. తలుపులోపలి

నుండి ఎవరో “ఎవరు మీరు ?” అని అడిగినారు.

‘నేను బుద్ధమిత్రుఁడను.’

‘మీ రొక్కరే వచ్చినారా ?’

‘భిల్లమాలనుండి వచ్చినఅతిథి నాతో కూడ వచ్చినాఁడు.’

‘ఆనవాలు చూపించినాఁడా ?’

‘ఆఁ. చూపించినాఁడు.’

తలుపు తీసినారు. సన్యాసియు, యోధుఁడును ఆగుమ్మము దాటి మరల ఒకచీకటిగదిలో ప్రవేశించినారు. ఆకారుచీకటి చూచి కొంచెము కంగారుపడి ఆయోధుఁడు కత్తి సవరించుకొన్నాఁడు. అది చూచి ఆగుమ్మమున కాపలాఉన్నసన్యాసి మరల “ఎవ్వరు మీరు ?” అని అడిగినాఁడు.

‘నేను భిల్లమాలనుండి వచ్చినఅతిథిని.’

‘ఎవరితో పనియుండి వచ్చినారు ?’

‘ఉత్తరాపథమందలి ఆర్యసంఘమును దర్శించుటకు వచ్చి నాను.’

‘మీ రేజాతివారు ?’

‘ఘూర్జరప్రతీహారులము.’

‘ఏమతము ?’

‘నేను బౌద్ధుఁడను. పురుషాంతరములనుండి త్రిరత్నములను అర్చించుచున్నాను.’

‘ఆర్యసంఘముతో మీ కేమిపని ?’

‘పరమేశ్వర, పరమమాహేశ్వర, పరమభట్టారక మహారాజాధిరాజ ఘూర్జరేశ్వర నాగభటదేవమహారాజులంగారి సెలవుప్రకారము ఆర్యసంఘముసన్నిధికి నేను దూతగా వచ్చినాను.’

'నిదర్శనము గాని, ప్రమాణము గాని కావలెను.'

'ఉన్నది.'

'ఏమిటి ?'

'పరమేశ్వర, పరమసౌగత మహామండలేశ్వర, ఘూర్జరమహామంత్రిరాజ వాహులకధవళదేవ చాళుక్యులవారి ముద్రివేసిన జాబు.'

'చూపవలెను.'

వెంటనే వెలుఁగు వచ్చినది. ముందు కన్నుల కద్దుకొని జాబును, తరువాత సన్యాసి కిచ్చినాఁడు యోధుఁడు. ఆసన్యాసి కాలిగుడ్డలు కట్టుకొన్నాఁడు. తల, గడ్డము, మీసములు నున్నగా క్షౌరము చేయించినాఁడు. అతనికుడిచేతిలో జపమాల ఉన్నది. లేఖ చూచుకొని 'మంచిది నాతోకూడ రావచ్చును.' అన్నాఁ డతఁడు.

వారుముగ్గురు ఆగది దాటి మరొకగదిగుమ్మముదగ్గరికి వచ్చినారు. ఆగఁదితలుపు వేసియున్నది. రెండవసన్యాసి తలుపు కొట్టినాఁడు. లోపలినుండి 'ఎవరు మీరు ?' అని ఎవరో అడిగినారు.

'భిక్షుజనదాసు. భిక్షుబుద్ధమిత్రి, ఘూర్జరేశ్వరప్రితినిధి నాయకరుద్రేణుఁడు.' అని రెండవసన్యాసి బదులుచెప్పినాఁడు.

'ఇంతరాత్రివేళ ఘూర్జరరాజప్రతినిధి ఏయుద్దేశ్యముతో ఇక్కడికి వచ్చినాఁడు ?'

'ఉత్తరాపథమందలి ఆర్యసంఘమును దర్శించుటకు.'

'నిదర్శనముగాని ప్రిమాణముగాని ఉన్నదా ?'

'ఆఁ. ఉన్నది.'

'తలుపు తెరచినారు. రుద్రేణుఁడు ఈవలికి వచ్చినాఁడు. మరల తలుపు మూసుకొనిపోయినది. ఆగుమ్మముప్రిక్కనే ఒకబౌద్ధభిక్షువు నిలువఁబడి యున్నాఁడు. అతఁడు రుద్రేణుని తీసుకొని గది

నడుమకు వెళ్ళినాఁడు. వెంటనే ఆగదిలో నాలుగువైపులు నాలుగు కాగడాలు వెలిగినవి. రాతితో కట్టినయరుగుముందు రుద్రేణుఁడు నిలువఁబడినాఁడు. ఆయరుగుమీదనే త్రిరత్నములును, వానివెనుకవైపున దర్భాసనములమీద ముగ్గురువృద్ధభిక్షువులును, వారివెనుక మరి పదునెకండుగురు భిక్షుకులును కూర్చున్నారు. భిక్షుజనదాసు అరుగు ముందరికి వచ్చి 'రుద్రేణనాయకా! మీరు సద్ధర్ములా?' అని అడిగినాఁడు.

'అవును. నేను బౌద్ధుఁడను.'

'త్రిరత్నములపై మీకు నమ్మక మున్నదా?'

వెంటనే రుద్రేణుఁడు త్రిరత్నములకు ముమ్మారు ప్రణామము చేసినాఁడు.

'మీరు త్రిరత్నములు స్పృశించి ప్రమాణము చేయవలెను.'

'ఏమని ప్రమాణము?'

'ఇప్పు డిక్కడ మీరు విన్నది కాని, కన్నది కాని మరెవరితోను చెప్పనని.'

'నేను రాజప్రతినిధిగా వచ్చినాను. ఇక్కడకు వచ్చినకార్య మేమైనదో మహారాజాధిరాజునకు నివేదింపనక్కరలేదా మరి?'

'ఘూర్జరేశ్వరునకు, వాహుకధవళదేవునకు తప్ప మూడవవానితో చెప్పనని శపథముచేయుఁడు.' అని వేదికపై కూర్చునవృద్ధభిక్షుకులలో ఒకరన్నారు. అతఁడు సంఘనాయకుఁడు బుద్ధభద్రుఁడు.

అప్పుడు రుద్రేణుఁడు త్రిరత్నములను ముట్టి ముమ్మారు శపథము చేసినాఁడు. వెంటనే బుద్ధభద్రుఁడు 'ఘూర్జరేశ్వరుఁడు మిమ్మేయుద్దేశ్యముతో మాకడకు పంపినాఁడు?' అని అడిగినాఁడు.

'పరమేశ్వర, పరమమాహేశ్వర, పరమభట్టారక, పరమవై

ష్ణవ, మహారాజాధిరాజనాగభటదేవులవారు ఆర్యసంఘముతో సంధి చేసుకొనుటకు నన్ను పంపినారు. పరమసౌగతమహామండలేశ్వర వాహుకధవళదేవులవారిపరామర్శవలన ఘూర్జరేశ్వరుఁడు బౌద్ధసంఘముపై విద్వేషమును మానుకొన్నారు. బౌద్ధసంఘముతో సంధి జరిగినయెడల గౌడయుద్ధము ముగియుననియు, తమప్రియమిత్రుఁ డైన కన్యాకుబ్జేశ్వరుఁడు మరల సింహాసన మెక్కుననియు మహారాజాధిరాజఘూర్జరేశ్వరుని నమ్మకము. .

ఆర్యసంఘమునకు గౌడయుద్ధమునకు సంబంధ మేమున్నది ? '

'పరమసౌగతు లైనసంఘనాయకులు నన్ను మన్నించవలెను. నేను దూతను మాత్రమే. ఆర్యసంఘము సాయము చేయకుండ సామాన్యుఁ డైనగౌడేశ్వరుఁడు మధ్యదేశము నాక్రమించ లేడని మామహారాజగారినమ్మకము. '

'ఏవిధముగా సంధి చేసుకొనవలెనని ఘూర్జరేశ్వరునితలంపు ? '

'సంధిఒడంబడిక జరిగినవెంటనే ఘూర్జరరాష్ట్రమున ఆర్యసంఘమువారు నష్టపడినసంపత్తియావత్తు తిరిగి ఇయ్యఁగలమనియు, సంఘమువారిసెలవుచొప్పున బౌద్ధులను, సద్ధర్మమును కాపాడెదమనియు మామహారాజాధిరాజుగారు సంఘనాయకులతో మనవిచేయు మనినారు. '

'ఒడంబడికప్రకారము మీరు నడచుకొనఁగలరనుటకు నిదర్శనము ? '

'మహామండలేశ్వర, పరమసౌగత, ఘూర్జరమహామంత్రిరాజ, వాహుకధవళదేవచాళుక్యులవారు స్వయముగా సంధిపత్రముపై చేవ్రాలు చేయుదురు. పూటకాపుగా ఘూర్జరేశ్వరునకు బదులు తమ

కొనుకొనబడినద్దరిని సంఘము వారిపరము చేయుదురు.'

'మంచిది. ఒడంబడిక చేసుకొనుట సంఘము వారి కంగీకారమే. సంధిపత్రములో మరేమరతులైన ఉండునా ?'

'ఉండును. సంధిజరిగినతరువాత ఆర్యసంఘమువారు గౌడేశ్వరున కెట్టిసాహాయ్యమున్ను చేయఁగూడదు.'

'సరే. ఆషరతుకూడ సంఘము వారికి సమ్మతము. మీదగ్గర సంధిపత్రి మున్నదా ?'

సుస్థేయుఁడు వస్త్రాభ్యంతరమునుండి సంధిపత్రమును తీసి సంఘనాయకున కిచ్చినాఁడు. బుద్ధభద్రుఁడు దానిని చదివి తనకుడిప్రక్కన కూర్చున్నమరొక భిక్షుకున కిచ్చినాఁడు. సంఘనాయకులు ముగ్గురును చదివినతరువాత ఒకసన్యాసి ఆసంధిపత్రమున్ను తీసుకొనిపోయి అరుగుమీద కూర్చున్న పదునొకండుగురుబౌద్ధస్థవిరులకు ఇచ్చినాఁడు. వారు చదివినతరువాత తిరుగ దానిని తీసుకొని మరల సంఘనాయకుని కిచ్చినాఁడు వెంటనే సంఘనాయకుఁడు 'చక్రిరాజగణమంతయు ఈయొడంబడిక కిష్టపడినట్లేనా ?' అని అడిగినాఁడు.

'ఆర్య ! చక్రిరాజవిశ్వానందులవా రిక్కడికి రాలేదు.' అని ఒకస్థవిరుఁ డన్నాఁడు.

'ఒక్కచక్రరాజు రానికారణమున సంఘకార్యము లాపుటకు వీలులేదు. ప్రస్తుత మిక్కడికి వచ్చినచక్రరాజులఅభిప్రాయము అడుగుచున్నాను.'

ఘూర్జరేశ్వరునితో సంధిచేసుకొనుటకు స్థవిరుల కెవ్వరికిని ఏయభ్యంతరము లేదని అందరు చెప్పినారు. వెంటనే అరుగుమీద సిద్ధముగా నున్నకలముసిరాబుడ్డిని తీసుకొని ఆసంధిపత్రముపై ఘూర్జ

శ్వరుని చేవ్రాలుక్రింద సంఘనాయకులందరు చేవ్రాలుచేసినారు. రుద్రేణుఁడా సంధిపత్రమును చేతఁదీసుకొన్నంతనే కాగడాలారిపోయినవి. వెనుకటిబిక్షువే వచ్చి అతనిని తనతోకూడ వచ్చినదారిని గాక వేరుదారిని తీసుకొనివచ్చి రాజమార్గమున వదలిపెట్టినాఁడు. రుద్రేణుఁడు నివ్వెరపాటుతో నలుదిక్కులు తేరిపారఁజూచి తా నప్పుడు విశ్వేశ్వరునిగుడిముందు నిలువఁబడియున్నట్లు తెలిసికొన్నాఁడు.

---

## 3

### ప్రత్యావర్తనము.

మూడవనాటికి ధర్మపాలదేవుఁడు కన్యాకుబ్జప్రాంతమునకు తిరిగివచ్చినాఁడు. వెంటనే ఏ బాధలేకుండ అనాయాసముగ ముట్టడిలోనున్న నగరములోనికి ప్రవేశించినాఁడు.

సింహము మరల తనంతటతానే గుహలో చిక్కుకొనుచున్న దని తలంచి ఘూర్జరసేన అతనిరాక చూచియు చూడనట్లూరకున్నారు. ఏఁబది క్రోసులమేర చెడఁదిరిగినను ఆహారపదార్థములు దొరకలేదు. కష్టపడి ఏకొంచెమో సంపాదించినను అది పదునైదువేలసైన్యమునకు దారిలోనే వ్యయమైనది. తిరిగి వచ్చినవెంటనే ఆతనిముఖవైఖరినిబట్టి, యుద్ధయాత్ర విఫలమైపోయినదని సామంతులందరును తెలిసికొన్నారు. వెంటనే భీష్మదేవుఁ డాలోచనసభను పిలిచి సాధకబాధకములాలోచించి ఆలోచించి చివరకు 'అవకాశము ఉండఁగానే తిరిగిపోవుట మంచిది' అని స్థిరపరచినాఁడు. రెండురోజులతరువాత అందరితోపాటు ధర్మపాలదేవుఁడుకూడ కన్యాకుబ్జనగరమును విడిచిపెట్టక తప్పినదికాదు. సాధ్యమైనంత వేగముగ అతఁడు ప్రతిష్ఠానమువైపు బయలుదేరినాఁడు. ఘూర్జరసేనకూడ వారిని వెంటాడక మానలేదు. తేనిటీఁగలవలె వారు గౌడసేనను చుట్టుముట్టినారు. అప్పటికప్పుడే ఘూర్జరులదౌర్జన్యమువలన మధ్యదేశమంతయు వట్టియెడారిగా మారిపోయినది. గ్రామములు, నగరములు జనశూన్యములైనవి. పంటపొలములన్నిటిని గుఱ్ఱములును, ఏనుఁగులును చెడమడ త్రొక్కి పాడుచేసినవి. అందువలన ప్రజలందఱును ఊళ్లు వదలిపెట్టి కొండప్రక్క

లను నలుసపోయినారు. ఆపాడువడిన దేశములో గౌడసేన పడినయవస్థ
చెప్పనలవికాదు. కడుపునిండ తినుటకు తిండిలేదు. ఉప్పెనలతో ఉప
వాసాలతో వారు నులసులు మాడిపోయినారు.. పైపెచ్చు పాళిగారల
చేత చిక్కుకొని ప్రమాణము! ఏవైపునుండి సాయమువచ్చునను ఆశ
లేదు. ఈస్థితిలో అవకాశము దొరకినప్పుడెల్ల ఘూర్జరులు వారిని
ఆక్రమించి చప్పిచెడి సంపాదించుకొన్న ఆహారపదార్థములు కాసిని
కొల్లగొట్టి తీసుకొనిపోవుచున్నారు. దూరముగా మాటున నక్కి ఎడ
తెరపిలేకుండ, అంపగులు విడిచి, బాణములు, ఈటెలు విసరివేసి సైని
కుల ప్రాణములు తీయుచున్నారు. ఈరీతిగానే ఒకవారము గడచిపో
యినది. ఈవారము రోజులలో యుద్ధము లేకుండనే గౌడసైన్యము సగ
మువరకు క్షీణించినది. చావుదెబ్బలమీద నానాబాధలుపడి తక్కిన
సగము సైన్యముతో ధర్మపాలుడు ప్రతిష్ఠానమునకు వచ్చిచేరినాడు.

ప్రతిష్ఠానదుర్గములోను ఆహారపదార్థము లైపోయినవి. సేన
నిలుచుట కక్కడ ఏమాత్రమాస్కారముకూడ లేదు. అది చూచి
ధర్మపాలుడు భగ్నహృదయుడై పోయినాడు. వెంటనే సామంతు
లందరితో ప్రతిష్ఠానమునుండి ఎకాయెకిని వారణాసికి బయలుదేరినా
డు. ఎక్కడెక్కడనో చిక్కువడిపోయిన సేనలుకూడ వచ్చి కన్యాకుబ్జ
యాత్రకై అంతకుముందే వారణాసిదుర్గమున కూడుకొని యున్నవి.
అందుచేత మహాకుమార వాక్పాలదేవుడు ఆదుర్గమందె కనిపెట్టుకొని
యున్నాడు. చక్రవర్తి తిరిగివచ్చుచున్నాడనికబురు తెలియగానే
నగరము దెస్సిచోట్లనో వేలకొలది కాల్బలమును కాపుబెట్టి హిమ
వత్పర్వతపాదము మొదలుకొని వింధ్యపర్వతమువరకు ముట్టడిగోడ
పెట్టించినాడతడు. అందువలన ఘూర్జరులిక ముందునకు వచ్చు
టకు వీలులేకపోయినది. ప్రతిష్ఠానము నుండి సహస్ర గౌడసైన్యము వార

ణాసికి వచ్చి చేరినది. అప్పుడు ధర్మపాలున కూపిరి తీసుకొనుట కవకాశము దొరకినది. అవసరమునుబట్టి గుర్జరపుదళముమాత్రము తిరుగ ప్రతిష్ఠానమునకు వెళ్లుటకు మొదలుపెట్టినది. ఆసమయమునకు గౌడ నగరమునుండి మహామంత్రిగర్గదేవులవారు 'అదృష్టచక్రము తిరిగి పోయినది' అని చక్రవర్తికి కబురుపంపినారు. ఆవార్తతో చక్రవర్తి నవనాళములు కట్టువడిపోయినవి.

చాలరోజులక్రితమే కన్యాకుబ్జయుద్ధయాత్రకై మణిదత్తునినిక్షేప మంతయు చెల్లిపోయినది. ఘూర్జరయుద్ధయాత్రకై కావలసిన ధనమునంతయు బౌద్ధసంఘము కూడబెట్టిన సొంతధనమునుండి ఖర్చు పెట్టించెద నని బుద్ధభద్రుడు వాగ్దానము చేసినాడు. ఆవాగ్దానము నిరభ్యంతరముగ చెల్లినది. కావలసినధనసాహాయ్యము జరిగినది. ధర్మపాలుడు వారణాసికి తిరిగివచ్చునప్పటికి మొదటిసారి బుద్ధభద్రుడిచ్చినధనమంతయు వ్యయమైపోయినది. రెండవసారి సొమ్మిచ్చెద నని చెప్పినగడువు దాటిపోవచ్చినను బుద్ధభద్రుడింతవరకు కంటి కగుపడలేదు. ఈసంగతు లన్నియు మహామంత్రి ధర్మపాలదేవునకు కబురు పంపినాడు. ఈవార్త వినగానే విశ్వానందుడును, భీష్మదేవుడును నిర్విణ్ణులైనారు. ఆర్యసంఘనాయకులను కలిసికొనుటకు విశ్వానందుడు స్వయముగా ఎంతో ప్రయత్నము చేసినాడు. కాని లాభము లేక పోయినది. ఈనిస్సహాయస్థితిలో యుద్ధము చేయుట ప్రమాదకర మని తలచి ధర్మపాలుడు స్వదేశమునకు తిరిగిపోవుటకు సంకల్పించినాడు. అతనిసెలవుప్రకారము ప్రతిష్ఠానమండలపు పొలిమేరలనుండి అశ్వసైన్యమంతయు వెనుకకు తిరిగివచ్చినది.

ఓడిపోయినఘూర్జరులకు మట్టిగోడ వదలిపెట్టివేసి శోణతీరము నుండి గండకీతీరమునుండి గౌడశాల్మలములు వట్టి వెనుకకు వచ్చివేసి

నది. గౌడసామ్రాజ్యములోని ముద్గగిరి, మండల, గౌడ, కర్ణసువర్ణ మొదలైనదుర్గములన్నియు ముట్టడికి తగినసన్నాహములు చేసుకొన్నవి. కన్యాకుబ్జయుద్ధమున చక్రాయుధునిపక్షమవలంబించిన కన్యాకుబ్జసామంతు లందరు స్వదేశముల విడిచిపెట్టి గౌడచక్రవర్తిని ఆశ్రయించినారు.

గౌడసామ్రాజ్యపుసరిహద్దును కాపాడుటకు వాక్పాలదేవుని నియోగించి ధర్మపాలదేవుఁడు స్వయముగా శోణసంగమమున శిబిరమేర్పరచుకొన్నాఁడు. ఘూర్జరసేనలు దేశమును కొల్లఁగొట్టుటలో మునిఁగిపోయి చాలారోజులవరకు శోణసంగమమును, గండకీతీరమును ముట్టడించుటకు ప్రయత్నించలేదు. మధ్యదేశమును కొల్లఁగొట్టుట ముగియఁగానే గౌడదేశము నాక్రమించుటకు ఘూర్జరులు ముందునకు బయలుదేరినారు. అప్పుడు దూర మాలోచించి గౌడసామంతు లందరును ఆరెండునదులతీరములందు వరుసగా మట్టికోటలు కట్టినారు. అందువలన మగధదేశములోను, తీరభుక్తిలోను, అడుగుపెట్టినప్పుడెల్ల ఘూర్జరు లోడిపోవలసివచ్చినది. సరిగా సమయమున కీపరాజయవార్తలు నాగభటదేవునికి తెలిసినవి. అప్పటి కతఁడు కన్యాకుబ్జమం దున్నాఁడు. కన్యాకుబ్జము స్వాధీనమైనను ఘూర్జరేశ్వరుఁడు ఇంద్రాయుధుని విడుదలచేయలేదు. ఇంద్రాయుధుఁ డిప్పటికిని సామాన్యపుఖైదీవలె భిల్లమాలానగరమున ఇబ్బందిపడుచున్నాఁడు. గౌడరాజ్యమును స్వాధీనపరచుకొనుటకై చేసినప్రయత్నము లన్నియు విఫలమైపోయినవని తెలిసినవెంటనే నాగభటదేవుఁడును, వాహుకధవళదేవుఁడును స్వయముగా సైన్యములతో శోణాతీరమునకు బయలుదేరి వచ్చి యుద్ధ మారంభించినారు. ఘూర్జరేశ్వరుఁడు స్వయముగా సైన్యములను నడపించుచు ముట్టడిసాగించినాఁడు. అయినను మగధ

దేశమున కాలుబెట్టలేక పోయినాఁడు. ఒకనాటియర్ధరాత్రమున కొలఁదిమంది సైనికుల వెంటఁబెట్టుకొని విమలనందియు, చక్రాయుధుఁడును వచ్చి హఠాత్తుగా ఘూర్జరశిబిరమునకు నిప్పుముట్టించినారు. ఆయగ్నిజ్వాలనుండి ఎట్లో తప్పించుకొని నాగభటదేవుఁడు పారిపోయినాఁడు. ఈసమయముననే ఘూర్జరుల జయించుటకై విశ్వానన్దుల వారు మరొకమార్గము తలపెట్టినారు.

గోపాలదేవుఁడు సమ్రాట్టు కాకమునుపు పరరాజు లెందరో చాలాసారులు గౌడదేశముపై దండెత్తివచ్చి ఆక్రమించినారు. కామరూపరాజైనహర్షదేవుఁడు నాగభటదేవునితండ్రియైనవత్సరాజు కలసి గౌడరాజ్యము నంతయు ఒక్కమారు స్వాధీనముచేసుకొన్నారు. ఆసమయముననే గౌడప్రజలభాగ్యవశమున దక్షిణాపథేశ్వరుఁడైనరాష్ట్రకూటవంశీయ ధ్రువధారావర్షదేవుఁడు ఘూర్జరరాజ్యముపై దండెత్తినాఁడు. దానివల్లనే గౌడరాజ్యము ఘూర్జరులబారినుండి బయటఁబడినది. ఈవిషయము జ్ఞాపకమునకు వచ్చి విశ్వానందుఁడు 'ఇక, ఈ గౌడచక్రవర్తిపక్షమున ఘూర్జరులతో యుద్ధముచేయుటకు రాష్ట్రకూటరాజును ప్రేరేపించుట సర్వోత్తమ' మని భావించినాఁడు. ధ్రువధారావర్షదేవుఁ డప్పటికి కీర్తిశేషుఁడైనాఁడు. అతనియనంతరము అతనికుమారుఁడు గోవిందవర్షదేవుఁడు దక్షిణాపథమున [illegible]ఁడైనాఁడు. 'ప్రస్తుత మాతనిసాయము లేకుండ ఘూర్జరులను గెలుచుట అసంభవ' మని విశ్వానందుఁడు సామంతు లందరికి తెలియఁజేసినాఁడు. వెంటనే ఆలోచనసభ కూడినది. వాదోపవాదములు జరిగినతరువాత సాహాయ్యము కోరుచు గోవిందవర్షదేవునిదగ్గరకు రాయబారిని పంపుట స్థిరపడినది. విశ్వానందుఁడు స్వయముగా రాయబారియై రాష్ట్రకూటరాజుదగ్గరికి వెళ్లెదనని ధర్మపాలునితో

చెప్పినాఁడు. అతఁడు సాధకబాధకము లాలోచించి చివరకు విశ్వాసం దునికి తోడుగా ఉద్ధవఘోషునికూడ దక్షిణాపథమునకు పంపుట కేర్పాటు చేసినాఁడు. జరుగవలసినసన్నాహము లన్నియు జరిగి రాయబారులు బయలుదేరినారు.

ఇది జరిగిన పదునైదురోజులకు నాగభటుదేవుఁడు చేసినకుట్ర వలన మరల ధర్మపాలుఁ డోడిపోవలసివచ్చినది. మగధకు దక్షిణము నున్న ప్రదేశమంతయు అరణ్యమయము. ఆయడవులలో బర్బరజాతు లనేకము నివసించుచున్నవి. ధన మిచ్చి వాహులకధవళదేవుఁ డాయరణ్యవాసులను లోఁబరచుకొని ఆమార్గమున గుఱ్ఱపుదళములతోకూడ మగధలోనికి ప్రవేశించినాఁడు. చూచుచుండఁగనే అసంఖ్యాకములైన గుఱ్ఱపుదళములు వచ్చి మగధదేశమున అంగదేశమునకూడ నిండిపోయినవి. ఉద్దండపురదుర్గమున భీష్మదేవుఁడును, ముద్గగిరియందు జయవర్ధనుఁడును, గయయందు వీరదేవుఁడును, మండలాదుర్గమున రణసింహుఁడును, సైన్యములతోఁగూడ ముట్టడిలో చిక్కుకొనిపోయినారు. ప్రమథసింహుని, కమలసింహుని, విమలనందిని వెంటఁబెట్టుకొని ధర్మపాలదేవుఁడు రాఢదేశమును కాపాడుటకు పూనుకొన్నాఁడు. తీరభుక్తిని ప్రవేశించుటకై ఘూర్జరసేన బ్రహ్మప్రయత్నము చేసినది. కాని వాక్పాలదేవుఁడు వారిని ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువులనీళ్లు త్రాగించినాఁడు. ఘూర్జరసేనల ఆట అక్కడ సాగిరాలేదు. ఆసమయముననే మగధదేశమున ఘూర్జరులు చెలరేగినా రని ఆతనికి తెలిసినది. అతఁడు నిర్విణ్ణుఁడైపోయి గౌడరక్షణకోసము విచారింపసాగినాఁడు.

---

## ౪

### గోకర్ణదుర్గము.

ఇంకను అసలుసంజవేళ కాలేదు. గోకర్ణదుర్గము వెలుపల నదీతీరమున ఒకనల్లనిముసలివాఁడు వెదురు కొట్టుచున్నాఁడు. దుర్గతోరణము తెరచియే యున్నది. మనుష్యు లున్న జాడ లేదు. ఈముసలివాఁడు తప్ప. దుర్గముముందరఁగూడ మరెవ్వరును లేరు. కొట్టుచు కొట్టుచు ఆముసలివాఁడు చేతిలోనికత్తి ఆవల పారవేసి లేచి నిలువఁబడినాఁడు. ఈలకోళ్ల గొదవలన మరొకచప్పు డేదియు వినవచ్చుట లేదు. కొంచెము చిరాకుపడుచు ఆముసలివాఁడు దారివైపు వచ్చి నాలుగుదిక్కులు పరకాయించినాఁడు. ఏమియు కనఁబడలేదు గాని దూరమునుండి గుఱ్ఱపుడెక్కలచప్పుడు మాత్రము సన్నసన్నగా వినవచ్చినది. వెంటనే అతఁడు ఆశ్చర్యపడి దగ్గరనున్న మామిడిచెట్టెక్కినాఁడు.

అప్పటి కప్పుడే నాలుగుదిక్కుల మసకచీకటి వ్యాపించుచున్నది. ఆవృద్ధుఁడు చెట్టెక్కి నలువైపుల కలయఁజూచినాఁడు. రణగ్రామము రేవునుండి గోకర్ణదుర్గమువైపు ఒకగుఱ్ఱపురౌతు వచ్చుచున్నట్లాతనికి కనఁబడినది. అది చూచి ఒకనిట్టూర్పు విడచి ఆతఁడు చెట్టు దిగి వచ్చినాఁడు. కొంచెముసేపటిలో ఆగుఱ్ఱపురౌతు దుర్గమున ప్రవేశించినాఁడు. ఆదుర్గపువాకిటిముందు నిలువఁబడి యున్న కేదారుని చూచి 'నీవు ఎవరు? ఈదుర్గమున ఇప్పు డెవ రున్నారు?' అని ఆగుఱ్ఱపురౌతు అడిగినాఁడు.

'నాపేరు కేదారుఁడు. నే నీదుర్గములో ఒకకాల్బంటును. అమాత్యులవా రైన ఉద్ధవఘోషుఁడు గౌడమహారాజుతోకూడ యుద్ధ

న్నాఁడు. ఈకేకవిని అతఁడు గోడనెక్కి 'ఎవరు నీవు?' అని అడిగి నాఁడు.

'నేను గౌడసైనికుఁడను. ఈకోటను కాపాడుటకు వచ్చినాను. మహారాజాధిరాజ ధర్మపాలదేవులవా రిక్కడికి వచ్చినారా?'

'నీవు గౌడసైనికుఁడ వైనట్లు నిదర్శనము?'

'మాతో గోవర్ధనమఠములోని అమృతానందస్వామివారు కూడ వచ్చినారు. మీరు మీదూతను పంపినయెడల ఇప్పటిసంకేత మును వారు చెప్పఁగలరు.'

నవీనసామంతుఁ డమృతానందస్వామిని ఎరుఁగును. కాని ఇప్పటిసంకేతమును ఎరుఁగఁడు. అందువలన అతఁడు 'మీరు కొంచెముసేపు వేచియుండుఁడు. నేను సంకేత మేమో తెలిసికొనివచ్చెదను.' అని గోడ దిగినాఁడు.

'ఇక్కడ ఉన్నట్లు రావలెను. శత్రుసేన మావెనుకనే వచ్చుచున్నది.'

నవీనసామంతుఁడు పరుగెత్తి అంతఃపురములోనికి వెళ్లినాఁడు. అప్పటి కప్పుడే చక్రవర్తి జనానాలోగిటిలోనికి వచ్చి మహాదేవితో మాట్లాడుచున్నాఁడు. వితంతు వైనదుర్గస్వామిని తెల్లనిమేలిముసుఁగు వేసుకొని ముంగిట నిలువఁబడినది. గౌడేశ్వరుఁడు ఆమెకు ప్రణామము చేసి 'అమ్మా! మహోపద్రవము వచ్చినది. ఘూర్జరులు గంగాతీరమును ఆక్రమించుకొన్నారు. ఇప్పుడో ఇంకకొంచెముసేపటికో వారు వచ్చి ఈదుర్గమును ముట్టడింతు రని తెలిసినది.' అని చెప్పి నాఁడు.

'వత్సా! నీవు వచ్చినతరువాత ఇంక మాకు ఆపద ఏమిటి?' ఈసంగతి తెలిసి ఉన్నపాటున నేను ఒంటరిగా కబురుచెప్ప

‘నే నున్నాను. భయము లేదు. రా.’

‘దారి కనబడుట లేదు. అంతయు అగోళముగా ఉన్నది.’

‘ఇదుగో. నాచేయి పట్టుకో.’

కొంచెమునే పటునిటు చూచి తడుముకొనుచు ధర్మపాలుని చేయి పట్టుకొని ఆమె మెల్లమెల్లగా అడుగులు వేయసాగినది. వారుభయులును ఆదారి వదలిపెట్టి ప్రక్కనున్న చెట్లక్రిందికి వచ్చి చేరినారు.

అది కృష్ణపక్షము. మూడుజాములరాత్రి కావచ్చినను గ్రుడ్డివెన్నెలకూడ రాలేదు. ఎటు జూచినను కాటుకసముద్రమువంటి మహాంధకారము. ఆయంధకారములో అనంతమైననీలాకాశముకూడ కలసిపోయినది. వజ్రశకలములవలె తారకలుమాత్ర మాయంధకారమయాకాశమున మినుకుమినుకు మని మెరసిపోవుచున్నవి. భూమిపై మిణుగురులు మిరుమిట్లు గొలుపుచున్నవి. చెవులు బ్రద్దలగునట్లు కంయ్యిమని ఈలకోళ్ళరొద తప్ప ఆయడవిలో మఱొకచప్పుడు లేదు.

చాలాసేపు ఒకచోటనే ఆగినయెడల ఏమైనకీడు మూడవచ్చునని అనుమానించి ధర్మపాలుడు కల్యాణీదేవిచేయి పట్టుకొని ముందుకు నడవసాగినాడు. కొంచెముదూరముకూడ నడువకుండనే ‘ఇస్స్. అబ్బా!’ అని కల్యాణి క్రింద పడబోయినది. వెంటనే ఆమెను పడకుండ పట్టుకొని ‘ఏమిటి?’ అని అడిగినాడతడు.

‘అబ్బా! కాలికి ముల్లు గుచ్చుకొన్నది.’ అని బాధపడుచు చెప్పినదామె.

అప్పుడు ధర్మపాలుడొకచేత ఆమెను పడకుండ పట్టుకొని రెండవచేతితో ముల్లుకోసమామెచరణతలమును తడిమి చూచినాడు. సూదివంటి పొడుగుపాటి సన్నని ముల్లొకటి ఆకోమలపాదతల

మున గ్రుచ్చుకొన్నది. ఎల్లో వానిని బయటికి లాగి దూరముగా పార వేసినాడు. వెంటనే ఆగాయమునుండి ఎడతెగకుండ నెత్తురు కారసా గినది. అయినను ఎల్లో కష్టపడి కొద్దిదూరములో ఉన్న కోనేటిదగ్గరికి ఆమెను తీసుకొని వచ్చినాడు. అక్కడ కొంచెము జాగా బాగుచేసి ఆమెను కూర్చుండబెట్టి కోనేటికి పోయి తనతలగుడ్డను తడిపి తెచ్చి నాడు. ఆగుడ్డనీటితో కాలు శుభ్రముగా కడిగినాడు. ఆగుడ్డలోనే కొంచెము పేలిక చించి గాయమునకు కట్టుకట్టినాడు.

ఆనొప్పివలన బాధపడుచు కొంచెముసేపు అటునిటుపొరలి చివర కామె చేయి తలక్రింద బెట్టుకొని పండుకొన్నది. ఆమె నిద్రపోయి నట్లు గ్రహించి ధర్మపాలుడు ఒరనుండి కత్తిదీసి పట్టుకొని అటునిటు పచారుచేయుట కారంభించినాడు. తెల్లవారువరకామె నట్లే కాచు కొని యుండవలెనని ఆతనితలంపు. అందుచే కూర్చుండదగిన కూర్చుం డలేదతడు. కాని ఊపిరిపుచ్చుకొనుటకు కూడ విశ్రాంతిలేకుండ రోజుగోజంతయు శ్రమపడి యుండుటవలన ఆతని కాళ్ళులింతలు రాసా గినవి. నీరసమువలన కాలికదపుటకైన శక్తి లేకుండ పోయినది. కొం చెముసేపు కూర్చున్నయెడల బడలిక తగ్గునని తలంచి నిద్రపోవుచున్న కల్యాణిపక్కనే చతికిలబడినాడు. వెంటనే కునికిపాట్లు వచ్చినవి. ఇక నిద్ర ఆపుకొనలేక కత్తి నట్లే తలక్రింద బెట్టుకొని పండుకొ న్నాడు. వెంటనే అతనికి గాఢనిద్ర పట్టినది.

తెల్లవారుజాము కావచ్చినది. పక్షులు కూయసాగినవి. తూర్పు దిక్కున చీకటి కొంచెముకొంచెము చెదిరిపోసాగినది. కాని వారికిప్పు డికి నిద్రాభంగము కలుగలేదు. క్రమక్రమముగా తూర్పుదిక్కున ఆకా శమునుండి మబ్బుతునకలు కెంపెక్కసాగినవి. మంచుపడిన చెట్ల చిట్ట చివరకొమ్మలన్నియు తేమెంపబడి బంగారుపూతఁ బూసిన ప్రకా

ట్టకై వచ్చినాను. నావెంట సామంతుఁడు గాని, సేనానాయకుఁడు గాని లేఁడు.'

'దానికోసము నీ వాదుర్దా పడనక్కఱలేదు. మీతండ్రిగారి దయవలన గోకర్ణదుర్గమునకు చెడురోజులు వెళ్లిపోయినవి. ప్రస్తుతము దుర్గములో నున్నవారు పదిరోజులవరకు దుర్గమును కాపాడఁగలరు.'

'అసంఖ్యాక మైన ఘూర్జరులు వచ్చి దుర్గమును ముట్టడించుచున్నప్పుడు యుద్ధము పదిరోజులమాట కాదు.'

'ఇంతలో సైన్యముతోఁగూడ నీసామంతులు వచ్చి కలసికొనరా ?'

'కలసికొనవచ్చును కాని—'

'కాని యేమి? వత్సా ?'

'ఎటుబోయి ఎటువచ్చునో చెప్పుటకు వీలులేని ఈయుద్ధమున—'

మాట ముగించకుండనే ధర్మపాలదేవుఁడు తలవంచుకొన్నాఁడు. ఆతనిమనసు గ్రహించి లోలోపల మహానందపడుచు మహాదేవి 'వత్సా! చెప్పవలసిన దేదో చెప్పక ఆపినావేమి? సాంతముగ చెప్పు మరి?' అని అడిగినది.

'అంతగా చెప్పవలసిన దేమియు లేదు. ఘూర్జరులతో యుద్ధము మాటలతో పనిగాదు. ఎప్పటి కెట్లుండునో చెప్పలేము. అందుచేత ఈసందిగ్ధసమయమున దుర్గములోని కులాంగనల నందరిని మరొకచోటికి పంపుట మంచిదని నే ననుకొనుచున్నాను.'

'ఎక్కడికి పంపుట?'

'డికాఱీనగరమునకు.'

'తీసుకొనిపోవువా రెవరు ?'

'అదే. దానినిగూర్చియే ఏయేర్పాటు చేసిన బాగుండునో యని యోచించుచున్నాను.'

ఆసమయముననే నవీనసామంతుఁ డచటికి గబగబవచ్చినాఁడు. గుమ్మమున నిలువఁబడి మహాదేవికి నమస్కారము చేసి 'అమ్మా! ఏదో గుఱ్ఱపుదళము వచ్చి దుర్గముముందు వేచియున్నది. అది గౌడ సేన యని, గోవర్ధనమఠములోని అమృతానందస్వామి దానివెంట వచ్చినాఁ డని తెలిసినది.' అని మనవిచేసినాఁడు.

'ద్వారము తెరచి వారిని లోనికి ప్రవేశపెట్టు. వెంటనే అమృతానందులవారిని మాత్రము అంతఃపురములోనికి ?యచేయ వలసినదని చెప్పు.'

'అమ్మా!—'

'ఏమి నవీనా!'

'అది గౌడసేనయని గుర్తించుటెట్లు'

'ఇప్పటిసంకేతమును వారి నడుగు.' అని గౌడేశ్వరుఁ డన్నాఁడు.

'ఆసంకేతము నాకుకూడ తెలియదు.'

'ఇప్పటిసంకేతము—'

గౌడేశ్వరున కిఁక పైమాట రాలేదు. సిగ్గుచే కాఁబోలు! అతనిముఖమంతయు ఎఱ్ఱనైపోయినది. తలవంచుకొని నేలచూపు చూచుచు నిలుచున్నాఁ డతఁడు. వెంటనే నవీనసామంతుఁడు 'ప్రభూ!' అనిపిలిచినాఁడు.

గౌడేశ్వరుఁ డప్పుడు తల పైకెత్తినాఁడు. అతనికన్నులు మిల మిల మెరసిపోవుచున్నవి. పెదవి కఱచుకొనుచు మెల్లగా అతఁడు

' ఇప్పటిసంకేతము-కల్యాణి.' అని చెప్పి మరల తలవంచుకొన్నాఁడు.

నవీనసామంతుఁడు నమస్కారము చేసి వెళ్లిపోయినాఁడు. కొంచెము సేపటిలో బట్టకప్పుకొనిన సైనికుని ఒకని వెంటఁబెట్టుకొని అమృతానందుఁ డచటికి వచ్చినాఁడు. వెంటనే గాడేశ్వరుఁ డతనికి నమస్కరించి ' స్వామీ! తమ రిక్కడి కెట్లువచ్చినారు?' అని అడిగినాఁడు.

' నేను మధురాక్షీ తీరమందలి శిబిరములో ఉన్నాను. తమ రె క్కడను కాన్పించకపోవుటవలన కంగారుపడి భీష్మదేవుఁడు న న్నిచటికి పంపినాఁడు.'

' ప్రస్తుతము మీతో ఎంతమంది సైనికులు వచ్చియున్నారు?'

అమృతానందుఁడు తన వెంటవచ్చిన సైనికుని కేసి చూచినాఁడు. వెంటనే ఆ సైనికుఁడు గాడేశ్వరున కభివాదనము చేసి ' మహారాజాధి రాజ! వేయిమందిగుఱ్ఱపురౌతులు ' అని చెప్పినాఁడు.

' ఈదుర్గమును కాపాడుటకు వారు చాలును. కాని ప్రస్తు తము దుర్గములోనికులాంగనలను వేరొకచోటికి చేర్చుటకు నేను ప్రయత్నించుచున్నాను.'

' ఎక్కడికి పంపెదరు ?' అని అమృతానందుఁ డడిగినాఁడు.

' డెక్కారీనగరమునకు.'

' మహాదేవి అంగీకరించినదా ?'

ఆమాట విని మహాదేవి ముసుగు సవరించుకొని దూరమునుం డియే అమృతానందునకు నమస్కరించి ' స్వామీ! ప్రస్తుతము కల్యా ణీదేవిని తప్ప మరెవ్వరిని వేరొకచోటికి పంపవలసినఅవసరము లేదు. చాలాకాలముక్రితమే ఆబిడ్డను నేను గాడేశ్వరునిచేతికి అప్పగించి నాను. కల్యాణి ఆతనిసొత్తు. ఆమెవిషయమై ఏయేర్పాటు చేసినను

గాడేశ్వరునియిష్టము. ఇందులో నాయంగీకారము అవసరము లేదు.'
అని అన్నది.

'అయితే తమమాటో?'

'నే నిప్పుడు గోకర్ణమును విడచిపెట్టి ఎక్కడికి పోఁగలను? పెండ్లినాడే ఈయింట అడుగు పెట్టినాను. మరి వల్లకాటికి పోవునప్పుడే మరల బైట కాలుపెట్టుట. ఆవిషయమున మీరు నన్నేమియు బలవంతపెట్టవద్దు. కల్యాణిదేవికి నలుగురుచెలికత్తె లున్నారు. వారు సత్యాంశజాతలు. ఆమె వెంట వారుమాత్రము వత్తురు.'

'సరే. కానీయండి! మహారాజ! కల్యాణిదేవికి ఎవరిని తోడిచ్చి పంపెదరు? నేను దుర్గరక్షణభార మంతయు వహించెదను.'

గాడేశ్వరుఁడు కొంచెము సేపాలోచించి ఆసైనికుని కేసి చూచి 'నీపే రెవరు?' అని అడిగినాఁడు.

'గురుదత్తుఁడు.'

'నీవు ఢక్కారీనగరమునకు వెళ్లఁగలవా?'

'మహారాజ! నేను సేవకుఁడను. యుద్ధముచేయుట తప్ప నాకు మరొకపని తెలియదు. అపరిచితలైనకులాంగనలను రాత్రివేళ నేను వెంటఁబెట్టుకొని పోలేను.'

'కావలసినసైన్యము సాయమువచ్చును.'

'క్షమించవలెను. మహారాజ!'

'నీ కేమియు భయుము లేదు. ఇష్టమువచ్చినంతమంది యోధులను తోడుతీసుకొని—'

'అది కాదు. మహారాజ! నేను భయమువలన ఆమాట చెప్పుటలేదు—'

అంతలో సైనికునిమాట కడ్డువచ్చి మహాదేవి నెమ్మదిగా

'వత్సా! కల్యాణి యువతి. రాత్రివేళ బయలుదేరునప్పుడు నీ వామె తో ఉండకపోయినయెడల లోకులు పలుగాకులు, నోటికివచ్చినట్లు కూయఁగలరు.' అన్నది.

'సరే నేనే వెళ్ళెదను.' అని గాడేశ్వరుఁడన్నాఁడు.

అరగడియసేపటిలో కల్యాణీదేవియు, ఆమెచెలికత్తెలు నలుగురును పల్లకీ లెక్కినారు. అయిదుపల్లకీలును గోకర్ణదుర్గమునుండి బయలుదేరి పోయినవి. ఆపల్లకీలు వెళ్ళిపోయినగడియసేపటికి దుర్గములో విపరీతమైనగల్లంతు బయలుదేరినది. పల్లకీలవెంట వెళ్ళుచున్న గాడేశ్వరుఁడాగల్లంతు విని శత్రువులు వచ్చి దుర్గముపై పడినారని అనుకొన్నాఁడు.



## ౫

### అర్ధరాత్రమున విపత్తు.

ఒకదానితరువాత ఒకటిగానొప్పున ఆపల్లకీలైదును అంధకారమయమైన ఆరణ్యమార్గమునంబడి పోవుచున్నవి. వాటిముందు పాతికమంది గుఱ్ఱపురౌతు లున్నారు. చుట్టును మరియొకపాతికమంది రౌతులున్నారు. పల్లకీలనడుమ కల్యాణీదేవి ఎక్కినపల్లకీ ఉన్నది. దాని ప్రక్కనే ధర్మపాలుండు గుఱ్ఱమెక్కి వచ్చుచున్నాండు. అప్పటికప్పుడే వారు గోకర్ణదుర్గము దాటి నాల్గుకోసులు పైగా వచ్చినారు. ఏదిగులు లేకుండ రౌతులును, బోయీలును నిశ్శబ్దముగనడచుచున్నారు.

ఆసమయమున అడవిలో నాలుగువైపుల జయఘోష బయలుదేరినది. చీకటి క్రొట్టాడుచున్న ఆయడవిలోనుండి బయటంబడి వందలకొలంది గుఱ్ఱపుదళము పల్లకీలవైపు రాసాగినది. పల్లకీలముందున్న రౌతు లాయుధముల్లను సర్దుకొనులోపలనే ఆగుఱ్ఱపుదళము వచ్చి పైబడినది. వెనుకవైపునుండికూడ వందలకొలంది రౌతులు వచ్చి పల్లకీలను ఆక్రమించినారు. లెక్కలేకుండ వచ్చుచున్న ఆసేనాప్రవాహముముందు గౌడేశ్వరుని కొద్దిపాటి అంగరక్షకసైన్యము గడ్డిపోచవలె కొట్టుకొనిపోయినది. చూచుచుండంగనే వేయిమందికిపైగా సైన్యము వచ్చిపడినది. చిటుకవేసేపటిలో పల్లకీలను దాటి ఆసైన్యము అడవిదారినిబడి ముందుకు వెళ్లిపోయినది. ఈసంఘటన మంతయు నిముసాల మీద జరిగినది. ధర్మపాలుండు ఒరనుండి కత్తిం దీయవలసిన అవసరముకూడ లేకపోయినది. ఈసందడిలో అతనిగుఱ్ఱము అతనిని కల్యాణీదేవిపల్లకీప్రక్కనుండి తప్పించవలెనని ప్రయత్నించినది. వెంటనే

అతఁడు గుఱ్ఱముమీఁదినుండి ఒక్కదుముకు దుమికినాఁడు పైఁబడిన కొంత సైన్యము వెళ్లిపోయినవెంటనే ధర్మపాలుఁడు నల్దువైపుల చూచినాఁడు. బోయీలు లేరు. అంగరక్షకసైన్యము లేదు. నాలుగుపల్లకీలు లేవు. శత్రువులు లేరు. అతనిగుఱ్ఱము లేదు. చీకటి కొట్టుకొనుచున్న ఆయడవిలో ఒక్కవిరిగిపోయినపల్లకీమాత్రముమున్నది. దానిప్రక్కనే అతఁడు నిలువఁబడియున్నాఁడు. ఆపల్లకి కల్యాణి ఎక్కివచ్చినదే. శత్రుసేన మరల వచ్చిపడకమునుపే పరుగెత్తిపోవుట మంచిదని అతఁడనుకొన్నాఁడు. వెంటనే 'దేవీ! కల్యాణీ!' అని వణఁకుగొంతుకతో పిలిచినాఁడు. ఆ విరిగిపోయిన పల్లకీలోపలినుండి 'ఆఁ.' అని బదులు వచ్చినది. చాలాకాలమున కామధురకంఠస్వరము మరల చెవిఁబడుటచే ధర్మపాలున కెక్కడలేని ఆనందము పొంగిపోయినది. ఆతనిశరీరము నిలువున పులకరించినది. ప్రత్యుత్తరము రాఁగానే అతఁడు మరల 'నీకేమియు దెబ్బతగులలేదు గదా?' అని అడిగినాఁడు.

'లేదు.' అని తక్షణమే ప్రత్యుత్తరము వచ్చినది.

అప్పటికి కాతనిమనసు కుదుటఁబడినది. వెంటనే 'అయితే నీవు పల్లకీనుండి బయటికి రా! మరల శత్రువు లిప్పుడే తిరిగి రాఁగలరని తోఁచుచున్నది. మన మిప్పుడే పారిపోవుట మంచిది.' అన్నాఁడతఁడు.

ఆపల్లకీకి కట్టిన తెర తొలగించుకొని నెమ్మదిగా కల్యాణి బయటికి వచ్చినది. కాని ఆకటికిచీకటి చూచి ఆమెకు ముందడుగు సాగలేదు. పల్లకీప్రక్కనే నిలువఁబడిపోయిన దామె. అది చూచి ధర్మపాలుఁడు 'త్వరగా రావలెను!' అని మరల పిలిచినాఁడు. ఆమె కొంచెము కంగారుపడుచు 'కారుచీకటి' అన్నది.

'నే నున్నాను. భయము లేదు. రా.'

'దారి కనఁబడుట లేదు. అంతయు అగోచరముగా ఉన్నది.'

'ఇదుగో. నాచేయి పట్టుకో.'

కొంచెముసే పటునిటు చూచి తడుముకొనుచు ధర్మపాలుని చేయి పట్టుకొని ఆమె మెల్లమెల్లగా అడుగులు వేయసాగినది. వారుభయులును ఆదారి వదలిపెట్టి ప్రక్క నున్నచెట్లక్రిందికి వచ్చి చేరినారు.

అది కృష్ణపక్షము. మూఁడుజాములరాత్రి కావచ్చినను గ్రుడ్డి వెన్నెలకూడ రాలేదు. ఎటు జూచినను కాటుకసముద్రమువంటి మహాంధకారము. ఆయంధకారములో అనంతమైననీలాకాశముకూడ కలసిపోయినది. వజ్రశకలములవలె తారకలుమాత్రి మాయంధకారమయాకాశమున మినుకుమినుకు మని మెరసిపోవుచున్నవి. భూమిపై మిణుఁగురులు మిరుమిట్లు గొలుపుచున్నవి. చెవులు బ్రద్దలగునట్లు కంయ్యిమనిఈలకోళ్లరొద తప్ప అయడవిలో మఱొకచప్పుడు లేదు.

చాలా సేపు ఒకచోటనే ఆగినయెడల ప్రమాదకరము మూడవచ్చునని అనుమానించి ధర్మపాలుఁడు కల్యాణీదేవిచేయి పట్టుకొని ముందుకు నడవసాగినాఁడు. కొంచెముదూరముకూడ నడువకుండనే 'ఇస్స్. అబ్బా!' అని కల్యాణి క్రింద పడఁబోయినది. వెంటనే ఆమెను పడకుండ పట్టుకొని 'ఏమిటి?' అని అడిగినాఁ డతఁడు.

'అబ్బా! కాలికి ముల్లు గుచ్చుకొన్నది.' అని బాధపడుచు చెప్పినదామె.

అప్పుడు ధర్మపాలుఁ డొకచేత ఆమెను పడకుండ పట్టుకొని రెండవచేతితో ముల్లుకొఱ కామెచరణతలమును తడిమి చూచినాఁడు. సూదివంటి పొడుగుపాటి సన్నని ముల్లొకటి ఆకోమలపాదతల

మున గ్రుచ్చుకొన్నది. ఎల్లో వానిని బయటికి లాగి దూరముగా పార వేసినాడు. వెంటనే ఆగాయమునుండి ఎడతెగకుండ నెత్తురు కారసాగినది. అయినను ఎల్లో కష్టపడి కొద్దిదూరములో ఉన్న కోనేటిదగ్గరికి ఆమెను తీసుకొని వచ్చినాడు. అక్కడ కొంచెము జాగా బాగుచేసి ఆమెను కూర్చుండబెట్టి కోనేటికి పోయి తనతలగుడ్డను తడిపి తెచ్చినాడు. ఆగుడ్డనీటితో కాలు శుభ్రముగా కడిగినాడు. ఆగుడ్డలోనే కొంచెము పేలిక చించి గాయమునకు కట్టుగట్టినాడు.

ఆనొప్పివలన బాధపడుచు కొంచెముసేపటునిటుఒరిగి చివర కామె చేయి తలక్రింద బెట్టుకొని పండుకొన్నది. ఆమె నిద్రపోయి నట్లు గ్రహించి ధర్మపాలుడు ఒరనుండి కత్తి దీసి పట్టుకొని అటునిటు పచారుచేయుట కారంభించినాడు. తెల్లవారువరకామె నట్లే కాచుకొని యుండవలెనని ఆతనితలంపు. అందుచే కూర్చుండనైన కూర్చుండలేదతడు. కాని ఊపిరిపుచ్చుకొనుటకు కూడ విశ్రాంతిలేకుండ రోజురోజంతయు శ్రమపడి యుండుటవలన ఆతని కాళ్ళులింతలు లాగసాగినవి. నీరసమువలన కాలుకదపుటకైన శక్తి లేకుండ పోయినది. కొంచెముసేపు కూర్చున్న యెడల బడలిక తగ్గునని తలంచి నిద్రపోవుచున్న కల్యాణిపక్కనే చతికిలబడినాడు. వెంటనే కునికిపాట్లు వచ్చినవి. ఇంక నిద్ర ఆపుకొనలేక కత్తి నట్లే తలక్రింద బెట్టుకొని పండుకొన్నాడు. వెంటనే అతనికి గాఢనిద్ర పట్టినది.

తెల్లవారుజాము కావచ్చినది. పక్షులు కూయసాగినవి. తూర్పు దిక్కున చీకటి కొంచెముకొంచెము చెదరిపోసాగినది. కాని వారిరువురికి నిద్రాభంగము కలుగలేదు. క్రమక్రమముగా తూర్పుదిక్కున ఆకాశమండలి మబ్బుతునకలు కెంపెక్కసాగినవి. మంచుపడిన చెట్ల చిట్టచివరకొమ్మ లన్నియు లేయెండపడి బంగారుపూతబూసిన ట్లున్నవి.

పక్షులకలకలధ్వనులతో అడవియంతయు గోదపెట్టినది. అయినను వారుభయులకు మెలకువ రాలేదు.

కొంచెముసేపటికి ఎండముదిరినది. సూర్యకాంతి ముఖముపైఁ బడినంతనే ధర్మపాలునికిమ్మాత్రము మెలకువ వచ్చినది. తొందరతొందరగా లేచి కూర్చున్నాఁడతఁడు. నిర్మానుష్యమైన ఆకోనేటిగట్టున పచ్చికగడ్డిపై ఆజన్మసుకుమారి యైనకల్యాణీదేవి ఇంకను నిద్రపోవుచునే యున్నది. కల్యాణిని చూచినతోడనే అతఁ డులికిపడి క్రిందనున్న కత్తి తీసుకొని లేచి నిలువఁబడినాఁడు. అతనిచూపులు కల్యాణిముఖమునుండి మరలలేదు. ఆముఖమున లావణ్యమును లేయెండయు పెనఁగులాడుచున్నవి. నిద్రపోవుచున్నను కనుబొమ్మలు కదలుచున్నట్లున్నవి. సౌందర్యలక్ష్మి ఆముఖమున వసంతయౌవనమును, పుష్పసౌందర్యమును, వాసనామనోజ్ఞతను, దాచుకొన్నట్లున్నది. అంతఅందమైనముఖమును ధర్మపాలుఁ డిదివరకెన్నఁడును చూడలేదు. మరొకచోటు కవఁబడవచ్చునని యైన అతనికి తోఁచలేదు.

ఎండవేడి ఎక్కువైనది. దానితాకున కల్యాణికి నిద్రాభంగమైనది. ఆమె కన్నులు నులుముకొనుచు లేచి కూర్చున్నది. ఎంతో ఆత్రముతో రెప్పవేయకుండ ధర్మపాలుఁడు తనముఖముకేసి చూచుచున్నట్లామె గ్రహించినది. వెంటనే ముఖము వంచుకొన్నది. సిగ్గువలన ఆమెముఖము ఎఱ్ఱబారిపోయినది. ముసుగు కొంచెము సర్దుకొని ఆమె ముఖము ప్రక్కకు త్రిప్పుకొన్నది. ధర్మపాలుఁడుకూడ తనయాత్రమును ఆమె కనుపెట్టినదని సిగ్గుపడి ముఖము మరొకవైపునకు త్రిప్పినాఁడు.

ముఖము త్రిప్పఁగానే అతనికి కొంచెము దూరమున ఇటుకలతో కట్టిన రేవు కానవచ్చినది. ఆరేవు ఇప్పుడు వాడుకలో లేనట్లు

తోఁచుచున్నది. దానిమెట్లన్నియు పచ్చగడ్డి పెరిగిపోయినవి. ఆ రేవు ప్రక్కనే పెద్దరావిచెట్టొకటి ఉన్నది. దానిక్రింద ఎండుటాకులు కుప్పవ బడియున్నవి. ఆచెట్టు కంటఁబడఁగానే అతనికి వెనుక ఒకమారు జరిగినసంగతి తటాలున స్ఫురణకు వచ్చినది. చాలారోజులక్రితము ఒక నాఁడిట్లే కల్యాణియు తానును గోకర్ణదుర్గమునుండి పారిపోయివచ్చి ఈకోనేటిగట్టున ఉన్నప్పటిసంగతు లన్నియు ఒకటొకటొక్కటిగా అతని మనసున తోఁచినవి. వెంటనే అతఁడు కల్యాణికేస్తి చూచి 'దేవీ! కాలి నొప్పి తగ్గిపోయినదా ?'' అని అడిగినాఁడు.

'ఆఁ. తగ్గినది.'

'ఇప్పుడు కొంచెముదూరము నడవఁగలవా ?'

'నడవవచ్చును మరి ?'

'అయితే గ్రామములోనికి వెళ్ళుదము. లే. పద !'

కల్యాణి మెల్లగా లేచి నిల్చువఁబడినది. ధర్మపాలుఁడు మరల ఆమెకేసి చూచి 'దేవి ! ఈస్థలము గుర్తుపట్టినావా ?' అని అడిగి నాఁడు.

'ఆ' అని కల్యాణి ముఖమువంచుకొని మెల్లగా జవాబిచ్చి నది.

'అప్పుడొకసారి, ఇప్పుడు మరొకసారి, నీతోఁకూడ ఇచటికి వచ్చినాను.'

కల్యాణి ఆమాటకు ప్రత్యుత్తర మీయలేదు. ముసుగు కొంచెము ముఖముమీఁదికి లాగుకొన్నది. ఆనాటిసంగతులు ఆమెకుకూడ జ్ఞాపకమువచ్చినవి కాబోలు !

మెల్లమెల్లగా ధర్మపాలుఁడు నడవసాగినాఁడు. ఎంతోకష్టపడుచు కల్యాణి అతనిని వెంబడించినది. కొంచెముదూరము వెళ్ళి అతఁడు

తిరిగిపుచ్చినాఁడు. అప్పటికిని ఆమె నడచుటకు చాలాయాతనపడుచున్న ట్లాతఁడు గ్రహించినాఁడు. వెంటనే వెనుకకు వచ్చి ఆమెచేయి పట్టుకొని తీసుకొనిపోసాగినాఁడు. కాఁబోవుభర్త గారిభుజముపై చేయుంచి కల్యాణి మెల్ల మెల్లగా అడుగులువేయుచు కొంతసేపటికి గ్రామమున ప్రవేశించినది.

అప్పటికిని ఆ గ్రామమున మనుష్యు లెవ్వరు లేరు. అరాజకము తగ్గిపోయినను గ్రామవాసులింకను కొండలనుండి తిరిగి రాలే దని ధర్మపాలుఁ డనుకొని చాలావిచారపడినాఁడు. కల్యాణి ఇక్కడికి నడచివచ్చినది గాని ఇంక ముందు నడవఁగలిగినట్లు తోఁచుటలేదు. ఈగ్రామములో ఎవరి యింటనైన ఆమె నుంచి తానొక్కఁడు గాడసేనను వెదకుటకు బయలుదేరవచ్చునని మొదట ధర్మపాలుఁ డనుకొన్నాఁడు. కాని అది అసంభవమని ఇప్పు డతనికి తోఁచినది. కల్యాణి కొంచెము దూరము నడచి ఇంకముందడుగుపెట్టలేక ఆగిపోయినది. ఆమె చాలా నీరసపడిపోయి అడుగు తీసి అడుగు పెట్టలేనిస్థితిలో ఉన్నదని గ్రహించి ధర్మపాలుఁ డచటిపచ్చగడ్డిమీద కొంచెముసేపు కూర్చుండుమని ఆమెను బలవంతపెట్టి తానుగూడ కూర్చున్నాఁడు. అప్పటికి పగలు జాముపొద్దెక్కినది. శేషచైత్రమందలి సూర్యభగవానుఁడు ప్రచండమూర్తియై బ్రహ్మాండమును వెలిగించుచున్నాఁడు. ఎండదెబ్బవలన ధర్మపాలునకు దాహమైనది. అతఁడు లేచి నిలువఁబడి ' దేవీ! తినుటకు పండ్లఫలాదు లేవైన దొరకునేమో చూచివచ్చెదను. మీ రిచ్చటనే ఉండుఁడు. నే నిప్పుడే తిరిగి వచ్చెదను. ' అని అన్నాఁడు.

' నాకు చాల భయము వేయుచున్నది. నే నొంటిగా ఉండలేను. ' అని మెల్లగా అన్నదికల్యాణి.

' నే నీచుట్టుపక్కలనే ఉండెదను. మీ రేమియు భయము

లేదు.'

కల్యాణి బదులుచెప్పక అచటనే కూర్చున్నది. ధర్మపాలుఁడు ఆప్రక్కనున్న అడవిలోనికి తినుట కేమైన దొరకునేమో తేవచ్చునని వెళ్లినాఁడు. చాలావరకు వెదకి చూచినాఁడు. కాని ఏమియు చిక్కలేదు. చివర కతఁడు నిరాశుఁ డైపోయి వచ్చినదారినే మరల కల్యాణిని కూర్చుండు మని చెప్పినచోటికి వచ్చిచూచినాఁడు. అచట కల్యాణి లేదు. అతఁడు గొంతెత్తి పేరుపెట్టి ఆమెను పిలువసాగినాఁడు. కాని ఎవ్వరును బదులు పలుకలేదు. ఆమెను వెదకుకొనుచు కంగారుగా అతఁడు ఆగ్రామపుపొలిమేరవరకు వచ్చినాఁడు. అంతలో వీపున ఏదో గ్రుచ్చుకొన్నట్లు తోఁచి వెనుకకు చూచుకొన్నాఁడు. అతనివీపున పొడుగుపాటిబాణము గ్రుచ్చుకొన్నది. చూచుచుండఁగానే అటునుండి ఇటునుండి రెండుమూఁడుబాణములు వచ్చి మరల తాకినవి. ఆదెబ్బతో అతఁడు తెలివిదప్పి పడిపోయినాఁడు.

---

# ౬

## ధర్మాధికారి బావమఱఁది.

సాయు సమయమున కవచావృతుఁడైన సైనికుఁడొకఁడు గుఱ్ఱము పరుగెత్తించుకొనుచు ఉత్తరదిశనుండి ఢెక్కారీనగరమువైపు వెళ్లుచున్నాఁడు. నగరముదగ్గరికి వచ్చునప్పటికి టంగులు తెగి గుఱ్ఱము పడిపోయినది. అయినను అతఁడు దానికేసి చూడనైన చూడకుండ శరవేగమున నగరతోరణము దగ్గరికి పరుగెత్తి వచ్చినాఁడు. అక్కడి పడిగాపువాండ్రతనిని ఆపి 'నీవు ఎక్కడనుండి వచ్చుచున్నావు?' అని అడిగినారు. ఎగరొజుకొనుచు అతఁడు ఆతురముతో 'మహారాజుగారిక్కడికి వచ్చినారా? నేను గోకర్ణదుర్గమునుండి వచ్చుచున్నాను.' అని అన్నాఁడు.

'మహారాజుగారెవరు?'

'ఓయి బాబూ! మహారాజులెందరున్నారేమిటి? మామహారాజుగారు. పరమేశ్వర, పరమమాహేశ్వర, పరమభట్టారక శ్రీధర్మపాలదేవమహారాజులంగారు.'

'అయితే లేదు. గౌడేశ్వరుఁడిక్కడికి రాలేదు.'

'అయితే ఇప్పుడు నగరములో ఉన్న మహానాయకుఁడెవరు?'

'కమలసింహదేవులవారు.'

'అతఁడిప్పుడెక్కడ ఉండునో నాకు చెప్పవలెను.'

'మేమీతోరణము విడిచిపెట్టి వచ్చుటకు వీలులేదు. నీవు ఈవీధివెంటనే వెళ్లినచో అక్కడికి చేరఁగలవు.'

అంతలో మఱియొక ద్వారికుఁడు లేచి 'నీవు సరియైనవారి

చూపెట్టెదరు. చూడు! నీవు మొదట ఉత్తరముగా వెళ్లవలెను. తరువాత తూర్పుగా, అటుతరువాత దక్షిణముగా, చివరకు పడమరగా మళ్లినయెడల తిరిగి ఇచ్చటికి వచ్చి చేరఁగలవు. ఇదే రాఘవదేశమున సరియైన మార్గము.' అన్నాఁడు.

అతఁడు తన్ను ఎకసక్కెమాడుచున్నాఁడని తెలిసికొని ఆసైనికుఁడు 'నీవేళాకోళము కట్టిపెట్టి ముందుగా నాకు కమలసింహుని డేరాకు గాని, లేక ఇంటికిగాని దారి చూపింపుము. నేను విశేషరాజకార్యముమీద వచ్చినాను. నీవు వేళాకోళమాడుచు కూర్చున్నచో గొప్పచిక్కు వచ్చును.' అని అన్నాఁడు.

ఈమాటలు విని తోరణముప్రక్కనున్న ఇంటినుండి ఒకవృద్ధద్వారికుఁ డక్కడికి వచ్చినాఁడు. అతనిని చూచి తక్కినద్వారికులందరు తప్పుకొన్నారు. ఆవృద్ధుఁడు సైనికునిదగ్గరకు వచ్చి 'ఏమికావలెను నీకు?' అని అడిగినాఁడు.

'నేను గోకర్ణదుర్గమునుండి వచ్చుచున్నాను. అమృతానందస్వాములవారు స్వయముగా నన్నిక్కడికి పంపినారు. తక్షణము నేను కమలసింహుని కలసికొనవలెను. దయచేసి నన్ను మీరచటికి తీసుకొనిపోయినచో చాలామేలు చేసినవారగుదురు.'

'యుద్ధసమయమున మేము పారా వదలిపెట్టి వచ్చుటకు వీలులేదు. లేకున్న మీవెంట ఒకసేవకుని తోడిచ్చియుందును. మహానాయక కమలసింహుఁడు ధర్మాధికారిగృహమున బసచేసియున్నాఁడు. మీరీదారినే ఉత్తరముగా వెళ్లుఁడు. దారిలో ఎవరి నడిగినను మీకు ధర్మాధికారిగృహము చూపించెదరు.'

ఆవృద్ధద్వారికుఁడు చూపించినమార్గమున బడి సైనికుఁడు వెళ్లినాఁడు. కొంతదూరము పోయి దారిలో ఎవరినో అడిగి చివరకు

ధర్మాధికారిగృహము తెలిసికొన్నాఁడు. కాని చీకటిలో దారి తెలి యక అతఁడు ధర్మాధికారియంతఃపురద్వారముకడకు వచ్చి 'ఇంటిలో ఎవరున్నారు ?' అని కేక వేసినాఁడు.

ఆద్వారముముంగిట ఒకపడుచుముత్తైదువ రాత్రిదేవతార్చన కోసము పూజాసామగ్రి సర్దుకొనుచున్నది. ఆమె ఆసైనికునికంఠస్వర ము విని గభాలున ఉలికిపడినది. వెంటనే కంపితకంఠముతో 'ఎవరు మీరు ?' అని అడిగినది.

'నేను పరదేశిని. ధర్మాధికారిగారి ఇల్లు ఇదేనా ?'

రెండవసారి అతనిగొంతు వినఁగానే ఆమెచేతిలోని పళ్ళెము క్రిందఁ బడిపోయినది. గొంతుపికిలి మాట పైకి రాలేదు. ఎట్లో అతి కష్టముమీద 'ఎవరు మీరు—ఎక్కడ మీరు—' అనిమాత్రి మన్నది.

ఆమెకంఠస్వరము విని సైనికుఁడుకూడ మాట తడబడిపోయి నాఁడు. అతనిగొంతుకూడ మూసుకొనిపోయినది. ఎట్లో గొంతు సరాళించుకొని అతఁడు 'నేను నౌడసేనానాయకుఁడను. నాపేరు గురుదత్తుఁడు.' అని చెప్పినాఁడు.

'అయితే మీరు—మీరు ఆస—'

ఆమెమాట ముగియకుండనే గురుదత్తుఁడు మరల 'మహానా యక కమలసింహుఁ డెక్కడ? ఇక్కడ ఉన్నాఁడా?' అని అడిగినాఁడు.

ఇప్పటి కామె గురుదత్తునిగొంతు ఆనవాలుపట్టి కెవ్వున కేక వేసి క్రిందఁ బడిపోయినది. తనకు మాటకు చాలసేపటివరకు ప్రత్యు త్తరము లేకపోవుటవలన గురుదత్తుఁడు మరల వీథిలోనికి వచ్చి ఇం కొకవైపునుండి ఇంటిముంగిటికి వచ్చినాఁడు. అచటనే కమలసింహుఁ డున్నాఁడు.

అతఁడు వాకిటిలో ఒకకుర్చీపై కూర్చుండి విశ్రాంతి తీసుకొనుచున్నాఁడు. గబగబ గురుదత్తుఁడు వచ్చి ఆతని కభివాదనము చేసినాఁడు.

‘ ఎవరు నీవు ? ’ అని కమలసింహుఁ డడిగినాఁడు.

‘ తమరు నన్నిదివర కొకమారు కన్యాకుబ్జదుర్గమున చూచినారు. ’

‘ ఎవరు ? గురుదత్తుఁడా ? ఓహో ? ఏమిటి సంగతి ? ’

‘ మహారాజుకబురు తెలిసికొనుటకు గోకర్ణదుర్గమునుండి అమృతానందులవారు నన్నిచటికి పంపినారు. మహారాజుగా రీనగరమునకు రాలేదా ? ’

‘ మహారాజుగారా ? రాలేదే మరి ? ’

‘ మహాదేవికల్యాణిని వెంటఁబెట్టుకొని మొన్నరాత్రి గోకర్ణదుర్గమునుండి మహారాజుగారు బయలుదేరి వచ్చినారు. నిన్నసాయంకాలమునకే ఇచ్చటికి వచ్చి దూతను పంపెదనని ఆయన చెప్పినారు. ’

‘ అయితే. మహారాజుగా రిక్కడికి రాలేదు మరి ?.

ఈవార్త విని కమలసింహుఁడుకూడ కంగారుపడుచు లేచి నిలువఁబడినాఁడు. ఎదుటనే ఒకప్రతీహారి నిలువఁబడియున్నాఁడు. గుఱ్ఱమును వెంటనే ప్రయాణమునకు సిద్ధముచేసి తీసుకొనిరమ్మని ఆప్రతీహారిని పంపి కమలసింహుఁడు గురుదత్తునికేసి చూచి ‘ నీవు గుఱ్ఱముమీద రాలేదా ? ’ అని అడిగినాఁడు.

‘ చాలాదూరము విపరీతముగా పరుగెత్తించుకొని వచ్చుటవలన నాగుఱ్ఱము దారిలో పడిపోయినది. ’

‘ సరే నీవు ప్రస్తుతము నాగుఱ్ఱమెక్కి పోవచ్చును. సరేకాని మహారాజువెంట అంగరక్షకు లెందరున్నారు. ’

'ఏఁబదిమంది మాత్రమే.'

'నీసైన్య మెక్కడమరి?'

'అజయతీరమున శిబిరములో ఉన్నది.'

'నాసేనలోనుండి అయిదువందలగుఱ్ఱపుదళమును వెంటఁదీసుకొని నీవు వెంటనే మహారాజును వెదకుటకై వెళ్ళవలయును.'

గురుదత్తుఁడు కమలసింహునికి నమస్కరించి సెలవుతీసుకొని ఒకసేవకునివెంట శిబిరముదగ్గరికి బయలుదేరినాఁడు. జయవర్ధనునికి, భీష్మదేవునికి ఈవార్త చెప్పిపంపుటకై కమలసింహుఁ డొకసేవకుని పిలిచినాఁడు. ఆసేవకుఁడు వచ్చి అతనియెదుట చేతులు జోడించుకొని నిలువఁబడినాఁడు. ఇంతలో పైబట్టకూడ లేకుండ వట్టికాళ్లతో ధర్మాధికారి వరాహరాతభట్టాచార్యులవారచటికి గబగబ వచ్చినారు. ఆయనను చూచి కమలసింహుఁడు నమస్కారము చేయఁబోయినాఁడు. కాని భట్టాచార్యులవా రాతనిని అడ్డపెట్టి 'అతఁ డేడీ? అతఁ డేడీ?' అని ఎంతో ఆత్రముతో అడిగినాఁడు.

'మీ రెవరినిగూర్చి ప్రశ్నించుచున్నారు.' అని కమలసింహుఁడు నిర్విణ్ణుఁడై అడిగినాఁడు.

'నాచెల్లెలిపెనిమిటి. ఏడీ ఆతఁడు?'

'మీబావమఱఁదిగారా?'

'అవును. న్యాయాలంకార సర్వానందభట్టాచారి. ఏడీ అతఁడు?'

'ఆయన ఇప్పు డిక్కడికి రాలేదే?'

'ఇప్పుడే అతఁ డీవైపు వచ్చినాఁడని మాచెల్లెలు చెప్పినది?'

‘ రెండుగడియలయీనడుము నాదగ్గరి కేబ్రాహ్మణపండితుఁడును రాలేదు.’

‘ క్రొత్తవా రెవ్వరును రాలేదా ?’

‘ వచ్చినాఁడు. అతఁడు మాసేనానాయకుఁడు గురుదత్తుఁడు.’

‘ అతఁ డేమాదిరిగా ఉన్నాఁడు ?’

‘ అతఁడు కవచము వేసుకొన్నాఁడు. అటువంటప్పుడు అతఁ డేలాటివాఁడని నే నేమిపోలికలు చెప్పఁగలను ?’

‘ పోనీయండి ! అతఁ డిప్పు డెక్కడికి వెళ్లినాఁడు ?’

‘ ఇప్పుడే సేవకునివెంట సైనికశిబిరమునకు వెళ్లినాఁడు.’

నిలుచున్నపాటున వగర్చుకొనుచు ధర్మాధికారి శిబిరమువైపు పరుగెత్తినాఁడు. శిబిరమునకు పోవుచుపోవుచు గురుదత్తుఁడు ధర్మాధికారిఅంతఃపురద్వారముదగ్గర కొంచెముసే పాగి ‘ ఇది ఎవరియిల్లు ?’ అని తనవెంటవచ్చినసేవకుని ప్రశ్నించినాఁడు.

‘ ఇది ధర్మాధికారి జనానా.’

‘ ధర్మాధికారి పేరు?’

‘ వరాహరాతభట్టాచారిగారు కాబోలు !’

ఇక అక్కడ నిలువఁబడక గురుదత్తుఁడు శిబిరమునకు వెళ్లినాఁడు. వెంటనే అయిదువందలగుఱ్ఱపుదళమును వెంటతీసుకొని మహారాజును వెదకుటకై నిలుచున్నపాటున బయలుదేరిపోయినాఁడు.

## ౭

### విడుదల.

తెలివివచ్చి చూచుకొనునప్పటికి ధర్మపాలదేవుఁడు తా నొక చిన్నమేడగదిలో దుమ్ముధూళి కొట్టాడుచున్న కటికనేలమీద పడి యున్నట్లు తెలిసికొన్నాఁడు. ఆగదిలో జన మెవ్వరును లేరు. దాని గుమ్మము శిథిలమైయున్నను గట్టిగా వేసియున్నది. ఒంటిమీది గాయములనుండి నెత్తురు కారి అతనిబట్టలన్నియు తడిసిపోయినవి. లేచి చూచుకొనునప్పటికి ఎవరో తనకత్తినిగూడ అపహరించినట్లు అతనికి బోధపడినది.

ఆమేడ ఎవరిదో ధనవంతులది. కాని చాలకాలమునుండి దానిలో మనుష్యులు వ్యవహరించుచున్నట్లు తోచుటలేదు. కిటికీలన్నియు ఇనుపయూచలతో బందోబస్తై యున్నవి. కాని వాటితలుపులు విరిగిపోయినవి. ఆకిటికీలలోనుండి ప్రక్కనున్నతోట బాగుగా కనఁబడుచున్నది. ఆగదిగోడ నానుకొనియే రావిచెట్లు, మఱ్ఱిచెట్లు ఎన్నో ఉన్నవి. వాటిబరువువల్లనే మేడ పడిపోవుటకు సిద్ధముగా నున్నది.

ధర్మపాలుఁడు చాలసే పాలోచించుచు ఆగదిలో అటునిటు పచారుచేసినాఁడు. ఎట్లైన ఆబందిఖానానుండి తప్పించుకొని పారిపోవలెనని అతనికి దృఢసంకల్పము కలిగినది. వెంటనే కిటికీలదగ్గరికి వచ్చి ఒక్కొక్కఇనుపయూచనే ఊశాడించి చూడసాగినాఁడు. ఆగది కొకవైపున కిటికీకి సరిగా మఱ్ఱిచెట్టొకటి ఉన్నది. దానికొమ్మలబరువున గదిగోడ చాలావరకు బీటలువారిపోయినది. ఆకిటికీకమ్ములు

పమ్మైపోయినవి. ఎట్లైన ఆకమ్ములను ఊడఁదీసివేయవలెనని ధర్మపాలుఁడు ప్రయత్నించినాఁడు. కమ్ము లూఁగులాడుచున్నవే గాని ఊడి రాలేదు. అప్పు డతఁడు కొంచెము వెనుకకు వచ్చి ఒకయూపుతో ముందుకు పోయి కిటికీకమ్ములను ఒకతాపు తన్నినాఁడు. అదెబ్బతో ఒకకమ్మి వంగిపోయి పట్టువదలిపోయినది. ఆతాపువలన ఆగోకలు రెండుమూడు క్రిందపడి చప్పుడైనది. ఆచప్పుడు విని నుండి ఎవరో గట్టిగా "ఎవరురా ?" అని కేక వేసినారు. ధర్మపాలుఁ డేమియు మాటాడకుండ మరల యథాస్థానమున కూర్చునాఁడు. బయటనుండి మరల కేకఏదియు వినరాలేదు. అరగడియసేపు ఊరకుండి మరల ధర్మపాలుఁ డాకిటికీదగ్గరికి వెళ్లి రెండవయినుపకమ్మిని ఊడఁదీయుటకు మొదలుపెట్టినాఁడు. ఇటుకలు పడిపోవుటచే ఇనుపయూచలు పట్టుసడలిపోయినవి. అందువలన రెండవకమ్మి మామూలుగానే వచ్చినది. వెంటనే ఆసందునుండి మెల్లగా శరీరము బైటికి దూర్చి ప్రక్కనున్న రావిచెట్టుకొమ్మను అందుకొని పైకెగిరినాఁడు. ఆమేడగోడపై మొలచినరావిచెట్టుకొమ్మలు ప్రాకి ఉద్యానవనములోని మామిడిచెట్టుకొమ్మలతో కలసిపోయినవి. ధర్మపాలుఁడు చప్పుడుగాకుండ రావిచెట్టుమీదినుండి మామిడిచెట్టుకొమ్మలపైకి ప్రాకిపోయి నెమ్మదిగా అక్కడనుండి క్రిందికి దిగినాఁడు. తరువాత కొంతసేపటివరకు మాట్లాడకుండ అక్కడనే స్థిరముగా నిలుచున్నాఁడు. మనుష్యులున్న అలికిడి ఏమాత్రము లేకపోవుటవలన దిగులుదీరి నెమ్మదిగా ఆమేడచుట్టును తిరిగివచ్చుటకు బయలుదేరినాఁడు.

మేడవెలుపల ఎవరును మనుష్యులు లేరు. నాలుగువైపుల దట్టముగా తీగలు పొదలు పెరిగిపోయినవి. మేడచుట్టును తిరిగి చూచి చివరకు తాను బైటికి వచ్చినకిటికీగుండా మరల అతఁడు మేడలోనికి

ప్రవేశించినాఁడు. అతఁడు ఏగదిలోనికి ప్రవేశించినాఁడో ఆగదిలో జనమెవ్వరు లేరు. కాని నిద్రపోవుచున్నగుఱ్ఱుమాత్రము వినవచ్చుచున్నది. వెంటనే ధర్మపాలుఁ డాగదినుండి బైటికి వచ్చి చూచినాఁడు. ఆప్రక్కగదిగుమ్మములో ఒకసైనికుఁడు గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచున్నట్లు అతనికి కనఁబడినది. ఆసైనికునిప్రక్కనే ధనుర్బాణములు, కత్తి, డాలు నేలపైఁ బడియున్నవి. అతనినోటిమీద ముక్కుపైన విధి విరామములేకుండ ఈఁగలు ముసురుచున్నవి. దానినిబట్టి వాఁడు తెగఁ త్రాగి యున్నాఁడని ధర్మపాలుఁడు గ్రహించినాఁడు. వెంటనే ముని వ్రేళ్లమీద వానిప్రక్కకు వెళ్లి నెమ్మదిగా అక్కడ పడియున్న ఆయుధముల నన్నిటిని లాగివేసినాఁడు. తరువాత వాని ఎదురురొమ్ము మీద ఒక్కదూఁకు దూఁకి ఎక్కి కూర్చున్నాఁడు. ఆదెబ్బతో వాఁడు మేలుకొన్నాఁడు. కాని ఏవిధముగాను తప్పించుకొనుటకు గాని కేక వేయుటకు గాని వీలు చిక్కలేదు. వెంటనే ధర్మపాలుఁడు గొప్పవిలువైన తనతలపాగాతో వాని కాళ్లుసేతులు, నోరు కట్టివేసి మొదట తానున్నగదిలోనే ఒకమూల పడవేసినాఁడు.

సైనికుఁడు నిద్రించుచున్న గదిగుమ్మముతలుపు వేసియున్నది. ధర్మపాలుఁ డాగుమ్మముదగ్గరికి వెళ్లి మెల్లగా "కల్యాణీ!" అని పిలిచినాఁడు. గదిలోపలినుండి "ఆఁ" అని ఆత్రముతో జవాబు వచ్చినది. కల్యాణి తనకంఠస్వరము గుర్తుపట్టినదని ధర్మపాలుఁడు గ్రహించుకొన్నాఁడు. వెంటనే అతఁడు మరల మెల్లమెల్లగా "భయము లేదు. కల్యాణి! నేను ధర్మపాలుఁడను." అని అన్నాఁడు.

వెంటనే కల్యాణి ఆగదిగుమ్మముదగ్గరికి వచ్చి నిలువఁబడినది. కాలిచప్పుడు గ్రహించి "ఇప్పుడు ఏమియు మాటాడవద్దు. గుమ్మమున కాపలా ఉన్నవానిని కట్టి పారవేసినాను. కాని ఇంకను ఒకరిద్ద

రీయింటిలో ఏమూలనో ఉన్నట్లు నే ననుమానించుచున్నాను. ఈ తలుపు బైటిగొళ్లెమును నేను తీసెదను. నీవు లోపలిగడియను కూడ తీసి తలుపుతీయుటకు ప్రయత్నించు.'' అని ధర్మపాలుఁడు చెప్పినాఁడు.

ఉభయులప్రయత్నమువలన తలుపు విడినది. కల్యాణి గది ఈవలికి రాలేదు. లోపలినుండియే "వాళ్లు ఇప్పుడే తిరిగి రాఁగలరు!'' అని అన్నది. ఆమాటకు గౌడేశ్వరుఁ డేమి బదులుచెప్పక ఆమెకేసి ఒకమారు చూచినాఁడు. అతని కెంతో విస్మయము కలిగినది. కల్యాణి ఒంటినిండ గాయములు. కట్టుకొన్నబట్ట చినిఁగి చీలిక లైపోయినది. తలకట్టంతయు చిందరవందరైనది. అసూర్యంపశ్య యైన ఆరాజకు మారిపాటు జూచి ధర్మపాలుఁడు నిలువున నీరైపోయినాఁడు. నెమ్మదిగా కల్యాణి వెలుపలికి వచ్చినది. వెంటనే వా రుభయులు తడబడిపోవు అడుగులతో ఆపాడుమేడనుండి బయలువెడలి అడవిని పడిపోసాగినారు. కల్యాణి గుండెచెదరి ఏడ్పు మొదలుపెట్టినది. ఆమె నూరడించునప్పటికి ధర్మపాలునికి తలప్రాణము తోకకువచ్చినది. చివరకెట్లో ఆమెకు ధైర్యము కలిగించి "నీవు 'వారు రాఁగల' రని అన్నావు. వా రనఁగా ?'' అని అడిగినాఁడు.

'దొంగలు.'

'ఘూర్జరులు కారా ?'

'కారు. గౌడదేశీయులు. కాని వారివెంట ఒకఘూర్జరసైనికుఁడున్నాఁడు.'

'ఆఘూర్జరునిమాట లేమైన నీకు తెలిసినవా ?'

'ఆఁ. వాఁడు ఘూర్జరసేనానాయకునిదూత. "ధన మిచ్చి ఘూర్జరులు దొంగలనందరిని వశముచేసుకొన్నారు. వారిలో దేశ

మును కొల్లఁగొట్టించుచున్నారు. ” అని విన్నాను.

‘ అయితే మనము ఘూర్జరులచేతులలో చిక్కుపడలేదు ? ’

‘ లేదు. కాని సాయంకాలమువరకు మన మాస్థితిలోనే ఉన్న యెడల తప్పక వారిచేతులలో చిక్కుపడిపోయి ఉందుము. ’

‘ ఎందుచేత ? ’

‘ ఘూర్జరసేన ఈసాయంకాలమున కిక్కడికి వచ్చి మకాము చేయునని వారు చెప్పుకొన్నారు ’

‘ నేను పండ్లకోసము వెళ్లినపుడు నీవు ఎక్కడికి వెళ్లినావు కల్యాణీ ? ’

‘ నేను భయపడిపోయి అడవిలో చెట్లచాటున దాగుకొనుటకు వెళ్లినాను. ఆచెట్లచాటుననుండి ఒకదొంగ వచ్చి నన్ను పట్టుకొన్నాఁడు. నేను విడిపించుకొని వెళ్లిపోవుటకు ప్రయత్నించినాను. ఇదుగో అందుకే నా కీలాంఛనాలు జరిగినవి. ’

ఈమాట చెప్పి ఏడ్చుచు కల్యాణి తనయొంటిమీఁదిగాయములను దెబ్బలను చూపించినది. తరువాత కొంచెము తెప్పరిల్లి “ అప్పుడు మీమాట జ్ఞాపకము వచ్చి నా కెక్కడలేని దుఃఖము వచ్చినది. నేనెంతో ఏడ్చినాను. ” అన్నదామె.

‘ నామాట ఎందుకు జ్ఞాపకము వచ్చినది కల్యాణీ ? ’

‘ నాకు తెలియదు. ’

‘ తరువాత ఏమి జరిగినది ? ’

కల్యాణి ముసుగులోనే తలవంచుకొని మెల్లమెల్లగా “ నా మేడ్పు చూచి దొంగలు నానోరు కట్టివేసినారు. ’ అన్నది.

‘ తరువాత ? ’

‘ అప్పుడే మీరు వచ్చినారు. దూరమునుండి మేమ దొంగలు

మిమ్ము బాణముతో వేధించినారు. మీరు తెలివితప్పి పడిపోయినారు. ఇద్దరుదొంగలు మిమ్ము మోసుకొని ఆపాదుమేడకు తీసికొని పోయినారు. అది చూచి నేను తెలివితప్పి పడిపోయినాను. లేచి చూచుకొనునప్పటికి రాత్రిపడినది.'

'అయితే ఇప్పటి కప్పుడే ఒకరోజు గడచిపోయిన దన్నమాట?'

'అవును. మీరు తెలివితప్పిపోయినారు. అందుచే ప్రొద్దు తెలియలేదు.'

'అయితే సరేకాని నీ వింతవరకు ఉపవాసమేనా?'

కల్యాణి ఏమియు మాటాడలేదు. దానినిబట్టి 'రెండురోజులు పూర్తిగా ఆమె కటికియుపవాసము.' అని ధర్మపాలుడు గ్రహించుకొని ఒకనిట్టూర్పు విడిచినాడు. తరువాత వారుభయులు మెల్లమెల్లగా ఆదట్టమైన అడవిలో నడచినడచి కొంతసేపటికి ఒకచెరువుదగ్గరికి వచ్చినారు. ఆచెరువు కనబడగానే వారికి ప్రాణములు లేచివచ్చినవి. చెరువుదగ్గరికి వెళ్ళి వా రుభయులు కడుపునిండ నీరు త్రాగినారు. దాహము తీర్చుకొన్న తరువాత ఆచెరువుగట్టుననే కూర్చుండి విశ్రాంతి తీసుకొన మొదలుపెట్టినారు.

సాయంకాలము కావచ్చుటచూచి ధర్మపాలుడు కర్రపుల్లలు, గడ్డి, తీగలు, తీసుకొనివచ్చి ఒకచెట్టుక్రింద కల్యాణికోస మొకగుడిసె ఏర్పాటుచేయుట కారంభించినాడు. సావధానముగ వారుభయులు కూడ కష్టపడి చిన్నగుడిసెలాగున కట్టుకొనుచున్నసమయమున వెనుకనుండి కాలిచప్పుడు వినిపించినది. వెంటనే ధర్మపాలుడు గుభాలున లేచి వెనుకతిరిగి చూచ [illegible] సముల్లోనే కపటావృత్తులైన మోసగాడొకడు అతనికి కనబడినాడు. ధర్మపాలుడు వెనుకకు తిరుగగానే ఆ మోసగాడు ఒక సందుకర్ర పైకి దీసి సైనికుడు వ్యా

దానుసారముగ అభివాదనము చేసి 'గౌడేశ్వరునకు జయము!' అని కేక వేసినాఁడు.

ధర్మపాలుఁడుకూడ ఒరనుండి కత్తితీసి పట్టుకొని 'ఎవరు నీవు?' అని అడిగినాఁడు.

'మహారాజ! ఈభృత్యునిపేరు గురుదత్తుఁడు.' అని సవినయముగ యోధుఁడు చెప్పినాఁడు.

'ఎవరు నీపేరు?'

'మహారాజ! గురుదత్తుఁడు. గౌడసేనాదళమందు 'మరాగ' అనే నన్ను పిలుచుచుందురు.'

తిండి తిప్పలులేక, గాయములతో బాధపడి, శ్రమపడి నీరసించిపోయియున్న ఆగౌడసామ్రాజ్యాధీశ్వరుఁడు గుభాలున వచ్చి ఆయోధునికంఠమును కౌఁగలించుకొన్నాఁడు. ఆయోధుఁడు మహానందమున వినమ్రుఁడైనాఁడు.

'సోదరా! గురుదత్తా!'

ధర్మపాలునినోట మాటరాలేదు. అతనిగొంతు మూసుకొనిపోయినది. అంతలో ఆనిర్జనారణ్యము కంపించిపోవునట్లు బ్రహ్మాండమైన జయఘోష బయలుదేరినది. అది విని విస్మితుఁడైపోయి ధర్మపాలుఁడు ఆయోధుని కేసి చూచి 'గురుదత్తా! ఏమిటి సంగతి?' అని ఆత్రముతో ప్రశ్నించినాఁడు.

'మహారాజ! మిమ్మనుసంధించుటకై అయిదువందలసైన్యముతో నేను బయలుదేరివచ్చినాను. శత్రువులు కనఁబడిన ట్లున్నది. అందుచే వారు జయఘోష పెట్టుచు శత్రువులను ఆక్రమించుచున్నారనుకొనెదను.'

'ఇప్పుడా సేన ఎక్కడ ఉన్నది?'

'ఈచెరువు ఉత్తరపుగట్టున.'

'నా వెంట కల్యాణీమహాదేవి ఉన్నది!'

'ఆమెకోసము పల్లకి తెచ్చినాను.'

ఆముగ్గురును గబగబ శిబిరాభిముఖులై బయలుదేరినారు.

---

## ౮

### గోవిందుని [illegible]

శీఘ్రముగానే యుద్ధము చల్లారిపోయినది. ఘూర్జరసేనలు దాదాపుగ గంగాతీరమువరకు ఎంత తొందరగా త్రోసుకొని వచ్చినవో అంత తొందరగానే పడమటికి వెనుదిరిగిపోయినవి. రాఢదేశమును బరేంద్రిమండలమును ఏకకాలమున హఠాత్తుగా ముట్టడించిన ఘూర్జరులు ముట్టడి మాని వెనుకకు పారిపోవుచుండుట చూచి గౌడ సేనానాయకులు మహాశ్చర్యపడినారు. కాని గ్రామములను దుర్గములను విడిచిపెట్టి వారిని తరుముటకై సాహసింపలేదు. ఈవిషయమున ప్రమథసింహుని సావధానత ఎవరికిని మనస్కరించలేదు. విమలనంది మాత్రము గుఱ్ఱపుదళమును తీసుకొని వారిని వెంటాడించినాడు. ధర్మపాలదేవుడప్పు డెక్కడ ఉన్నాడో ఎవరికిని తెలియదు.

అడవిలో ఒంటరిగా చిక్కుపడిపోయిన మహారాజును, కాంబోవు పట్టమహాదేవిని తీసుకొని గురుదత్తుడు డెక్కారీనగరమునకు వచ్చునప్పటికి ఘూర్జరసేనలు గౌడమును, మగధను, అంగదేశమును వదలిపెట్టి కరూశదేశమునకు వెళ్ళిపోయినవి. శోణనదము దాటుటకు యత్నించుచుండగా వారితో విమలనందికి యుద్ధము జరిగినది. సరిగా ఆసమయమునకు జయవర్ధనుడు, భీష్మదేవుడు కూడ వచ్చి సహాయపడినారు. ఆయుద్ధమున ఘూర్జరులు పూర్తిగా ఓడిపోయినారు. గౌడ సైనికులు వేలకొలది ఘూర్జరసైనికులను బందీలుగపట్టినారు.

కల్యాణిని తీసుకొని ధర్మపాలదేవుడు వచ్చుటచే డెక్కారీ నగరము రాజధానియైపోయినది. మహారాజదంపతులను చూచుటకై

స్త్రీపురుషభేదము లేకుండ ఆబాలగోపాలము జనము వచ్చి నగర ద్వారమున బాటకిరుప్రక్కల కనుపెట్టుకొని యున్నారు. నూతనదంపతులను ఊరేగించుటకై ఉత్సవపు టేర్పాటు లన్నియు జరిగినవి. ఇంటింటను గుమ్మములముందు అరటిచెట్లను పాతినారు. ద్వారబంధములకు పూలదండలు, మామిడితోరణములు అలంకరించినారు. ముంగిళ్ళయందు పూర్ణకలశము లుంచినారు. ఉత్సవవేషములతో జనులందరును రాజదంపతులకు ఎదుర్కోలు చేయుటకై సంసిద్ధులై యున్నారు. కల్యాణిదేవిని గాండేశ్వరుడు పెండ్లిజేసుకొన్నాడనియే అందరినమ్మకము. కమలసింహునకుకూడ ఆనమ్మకము లేకపోలేదు.

నగరములో సామ్రాజ్యాధీశ్వరు డుండుటకు తగినయిల్లు లేదు. అందువలన నగరమునడుమ పెద్దడేరా వేసినారు. గాండేశ్వరుడు నగరములోనికి వచ్చి ఆడేరాలో ప్రవేశించినాడు. కల్యాణిదేవిమాత్రము ధర్మాధికారి యంతఃపురమునకు వెళ్ళినది. నగరమునకు వచ్చిననాటిమధ్యాహ్నము శిబిరమున కూర్చుండి కమలసింహునితో గాండేశ్వరుడు ఆమాట ఈమాట చెప్పుచున్నాడు. ప్రసంగవశమున కమలసింహుడు నవ్వుచు గాండేశ్వరునితో ' మహారాజ ! మీరు కల్యాణిని ఎప్పుడు వివాహము చేసుకొన్నారో అప్పుడే నాకంటె చిన్నవారైపోయినారు. మన మిప్పుడు దగ్గరిబంధువులము. మీకు కల్యాణి నిచ్చి వివాహముచేసి నాపినతల్లి చనిపోయినది—" అన్నాడు.

ధర్మపాలదేవుడు తుళ్ళిపడి ' ఏమి టది ? గోకర్ణమర్గస్వామిని చనిపోయినదా ? ' అని ఆత్రముతో అడిగినాడు.

' అవును మీ కీకబురు తెలియనే లేదా ? '

' లేదు. తెలియలేదు. '

'అయితే కల్యాణికికూడ తెలియనే తెలియలే దన్నమాట?!'

'తెలిసియుండదు కమలా!' అని ధర్మపాలదేవుఁ డొకని ట్టూర్పు విడిచినాఁడు.

'అయితే గురుదత్తుఁడు మీ కీకబురు అందఁజేయలేదా?'

'లేదు. ఆమె ఎట్లు చనిపోయినది?'

'తనయత్తవారిదుర్గమును కాపాడుటకై కత్తిపట్టుకొని యుద్ధము చేసి వీరస్వర్గమందినది. మహారాజ!'

'అయితే గోకర్ణదుర్గము ఘూర్జరులవశ మైనదా?'

'లేదు. అమృతానందగురుదత్తులతోకూడ నాపినతల్లి కోటగోడ నెక్కి సైనికులను ఘూర్జరులపైకి పురికొల్పసాగినది. ఆసమయమున శత్రువులవైపునుండి ఒకబాణము వచ్చి ఆమెను తాకినది. ఆదెబ్బతో ఆమె చనిపోయినది. ఈకబురు చెప్పుటకై గురుదత్తుఁడు మీదగ్గరికి వచ్చినాఁడు.'

'గురుదత్తుఁ డీమాట నాతో చెప్పలేదు. ఆతఁ డిప్పు డెక్కడ?'

'నగరమున ప్రవేశించునప్పు డతఁడు మీప్రక్కనే ఉన్నాఁడు.'

'ఆతరువాత నాకు ఆతఁడు కాన్పించలేదు.'

'అయితే అతఁ డెక్కడ ఉన్నాఁడో కనుఁగొనవలెనా?'

'వలదు రండు. నేనే కనుఁగొనెదను.'

గారి సెలవుప్రకారము దండధరుఁ డొకఁడు శిబిరములోనికి వచ్చినాఁడు. గురుదత్తుని తీసుకొని రమ్మని ధర్మపాలుఁడు వాని పంపించినాఁడు. వాఁడు సెలవుతీసుకొని వెళ్లిపోయినాఁడు. ధర్మపాలుఁడు కనులనీరు నింపుకొని కేసి చూచి 'మహానాయక! ఇప్పుడు ఆమెకు దిక్కు బంధువు లెవ్వరును లేరు. కాఁబట్టి మీరే ఈకబురు ఆమెకు తెలియఁజేయవలెను.' అని అన్నాఁడు.

'మహారాజ! కల్యాణి ఇప్పుడు ధర్మాధికారియంతఃపురములో ఉన్నది. కావున ధర్మాధికారిభార్యగాని, చెల్లెలుగాని ఈవార్త ఆమెతో చెప్పుట మంచిది. మనము ముందుగా ధర్మాధికారి కీసంగతి తెలియఁ జేయుట ముఖ్యము.'

వెంటనే సేవకుఁ డొకఁడు ధర్మాధికారికోసము వెళ్లినాఁడు.తరువాత ధర్మపాలుఁడు మరల కమలసింహుని "మహానాయక! గోకర్ణదుర్గమున కిప్పుడు ఏర్పాటేమైన చేసినారా?' అని అడిగినాఁడు.

'మహారాజ! నే నేమి ఏర్పాటు చేయఁగలను? గౌడపట్టమహాదేవి కల్యాణియే ఇప్పు డాదుర్గమున కధీశ్వరి. కావున ఆమెయాధిపత్యమును కాపాడుటకు మీరే ఎవరినైన నియోగింపవలెను.'

ధర్మపాలుఁడు బదులుచెప్పకుండ ఆలోచింపసాగినాఁడు. కొంచెముసేపటిలో సేవకుఁడు వచ్చి 'మహారాజాధిరాజగౌడేశ్వరునిసన్నిధానమునకు వర్ధమానమండలధర్మాధికారివంశహారీతభట్టశాస్త్రుల్లు వారు దర్శనార్థము వచ్చినారు.' అని చెప్పినాఁడు.

ధర్మపాలుఁడు శీఘ్రమే వారిని లోనికి ప్రవేశపెట్టుమని ఆజ్ఞాపించినాఁడు. వెంటనే కొబ్బరిబొండమును తీసుకొని ధర్మాధికారి శిబిరములోనికి వచ్చినాఁడు. ధర్మపాలుఁ డాతనికి నమస్కరించి సుఖాసీనుని జేసి 'ధర్మాధికారీ! విశేషమైనపనిమీద మిమ్ము పిలువనంపినాము. మీయింటిలో అందరును కులాసాగా ఉన్నారా?' అని ప్రశ్నించినాఁడు.

'గడచినరెండుసంవత్సరములనుండి నేను తీరనిమనోవ్యధతో కొట్టుకొనుచున్నాను.'

'అంతమనోవ్యధకు కారణము?'

'మహారాజ! ఘూర్జరయుద్ధపుమొదటిరోజులలో నాచెల్లెలి

పెనిమిటి న్యాయాలంకారసర్వానందభట్టాచారి స్వల్పకారణమున ఇల్లు విడిచిపెట్టి పోయినాడు.'

'అయితే ఇంతవరకుగూడ ఆయనసంగతి తెలియనే తెలియలేదా?'

'తనసైన్యమున ప్రవేశించినాడని విన్నాను. ఈకబురు తెలిసినతరువాతనే మహామంత్రులవారిని, మహారాజకుమారవార్తాలదేవుని, ఎట్లైన ఆతనిసంగతి కనుగొనవలసినదని బలవంతపెట్టినాను. కాని ఏసంగతియు తెలియలేదు. తనుకూడ తెలిసికొనుటకై వెనుక ఒకమారు గురుదత్తుండను సేనానాయకుండు గోకర్ణమునుండి ఇచటికి వచ్చినాడు. కమలసింహుని కలిసికొనుటకై ఆయన ముందుగా మాయింటికి వచ్చినాడు. మాటపోలికను ఆనవాలుపట్టి నాచెల్లెలు ఆతండే సర్వానందుండని చెప్పినది. అదిమొదలింతవరకుగూడ గురుదత్తుండును అయిపులేడు. సర్వానందునికబురు అంతకన్న తెలియలేదు.

'కమలసింహా! గురుదత్తుండు బ్రాహ్మణుండా?'

'ఉగ్రవర్మోపాధ్యాయుండొకమారు నాతో అట్లు చెప్పినాడు.'

'అయితే న్యాయాలంకారులవారు న్యాయశాస్త్రము విడిచిపెట్టి కత్తిబట్టినారెందుకు?'

'మహారాజా! మాచెల్లెలన్న ఆతనికి పంచప్రాణములు. ఆమెను విడచిపెట్టి ఉండవలసివచ్చుననియే ఆతండు డబ్బుసంపాదనకుకూడ పోవుట మానుకొన్నాడు. ఒకదుర్ముహూర్తపువేళ మాచెల్లెలు నాభార్యచేతికున్న బంగారుగాజులను చూచి అటువంటిగాజులు తనకుకూడ చేయించిపెట్టుమని అతనిని కోరినది. అనగ చేయించు

కప్పటి కాతనికి పిలుచిక్కలేదు. అప్పుడు నగ చేయించకపోయినను వచ్చుపరిశ్రమాయ మేమియు లేదు. కాని ఈస్వల్పవిషయమునకే సర్వానందుఁడు దుఃఖమున క్షోభించిపోయి ఇల్లు వదలిపెట్టి లేచి పోయినాఁడు.'

'మరి గురుదత్తుని గుర్రపుసవారి, కత్తిసాము, చూచి అతఁడు బ్రాహ్మణుఁ డని చెప్పుట కెవ్వరును సాహసింపరు.'

'మహారాజాధిరాజ! తమతండ్రిగారు సింహాసన మెక్కకపూర్వము దేశ మంతయు అరాజకమువలన మహాక్షోభపడిపోయినది. అప్పుడు గౌడవంగదేశీయు లందరు జాతిమతభేదములు లేకుండ అస్త్రవిద్య నేర్చుకొన్నారు. గుర్రపుసవారిలో సర్వానందుఁడు అందెవేసిన చేయి. విలువిద్యలో మామండలమం దతనికి సరిజోడు లేదు. కత్తిసాములో అతఁ డెన్నోమారులు గౌడసైనికులనుకూడ ఓడించి పార వేసినాఁడు.'

'అతనిపోలిక ఏమైన చెప్పఁగలరా?'

'మహారాజ! అతఁ డెప్పుడును కవచము వేసుకొనియే కనఁబడును. అందువలన అతనిమాదిరి ఇట్టిదని చెప్పుటకు తెలియదు.' అని కమలసింహుఁడు చెప్పినాఁడు.'

'అవును. అతఁ డెప్పుడును ఎక్కువగా మాట్లాడినట్లు కూడ లేదు.'

ఆసమయముననే ఒకసేవకుఁడు లోనికి వచ్చి గౌడేశ్వరుని కభివాదనము చేసి 'మహారాజాధిరాజ! సర్వానందులవారును, ఉద్ధవఘోషనాయకుఁడును, దక్షిణాదినుండి బయలుదేరినారు. గౌడేశ్వరునితో సంధి కొడంబడి రాష్ట్రకూటరాజైన గోవిందవర్షదేవుఁడు ఘూర్జ

రులపై దండెత్తి ముట్టడించినాఁడు.' అని కబురు చెప్పినాఁడు.

'మహారాజ! ఇన్నాళ్ళకు గోవిందుఁడు చక్రధారణము చేసినాఁడు. ఈమారికఁ జయము తప్పదు మనకు.' అని నవ్వుచు కమలసింహుఁ డన్నాఁడు.

మహానాయక! చివర కిట్లో మనకు కాపు దొరకినది. బ్రతికి బైటఁ బడినాము. కాని బౌద్ధసంఘముమాత్రము నా కాజన్మాంతము మరచిపోని నీతిపాఠము నేర్పినది.' అని ధర్మపాలుఁ డొకపెద్ద నిట్టూర్పు విడిచినాఁడు. అతనిముఖము వాడిపోయినది. ఇంతలో సేవకుఁడు ప్రవేశించి 'గురుదత్తసేనానాయకుఁడు శిబిరములో లేడు. ఎంత వెదకినను అతనిజాడ కాన్పించలేదు.' అని కబురు తెలియఁజేసినాఁడు. ఆమాట విని ధర్మపాలదేవుఁడు మెల్లగా 'ధర్మాధికారిమహాశయా! గురుదత్తుఁ డేగనుక నిజముగా సర్వానందులవారై యున్న యెడల రెండు మూఁడురోజులలో నేనే స్వయముగా అతనిని పట్టుకొనెదను. మీరు దయచేసి కొంచె మోపికపట్టవలెను. సరే. ప్రస్తుతవిషయము. మిమ్మొకకార్యార్థమై ఇచ్చటికి పిలువనంపినాము. నే నీనగరమునకు వచ్చినతరువాత శ్రీమతి కల్యాణీమహాదేవిగారి తల్లిగారు స్వర్గస్థురాలైనట్లు మాకు తెలిసినది. పాప మామెకు ఈకల్యాణి ఒక్కతెయే కూఁతురు. ఈకబురు తెలిసి కల్యాణీదేవి గుండె చెదరిపోవునని మేము దిగులుపడుచున్నాము. దయచేసి విలునుబట్టి మీరు మీయాడంగుల ద్వారా ఆమె కీకబురు ప్రమాదమేమియు లేకుండ చెప్పింపవలయును.' అని అన్నాఁడు.

చాలాసేపు వెనుకముందాలోచనలు చేసి చివరకు వరాహశాస్త్రిభట్టాచార్యులవారు మెల్లగా 'కార్యముమాత్రము దుష్కరమై

నదే. కాని ఏలినవారిసెలవైనతరువాత ఎట్టికార్యమైనను చేయక తప్పదు. ' అని సెలవు తీసుకొని వెళ్లిపోయినాఁడు.

' మహానాయక ! గురుదత్తుఁ డెవరు ?' అని కమలసింహుని అడిగినాఁడు.

' అది సమస్యయే. '

' దీనిని ఎవరు పూర్తిచేయఁగలరు ?'

' ప్రేమ. '



## ౯

### పరిచ్ఛేదము.

దారిప్రక్కనున్న మామిడితోపులోని శిబిరమున కాషాయ వస్త్రములు కట్టుకొన్న ఒక సన్యాసియు, వయసు చెల్లిన ఒక యోధుఁడును కూర్చుండి మాట్లాడుకొనుచున్నారు. సంధ్యాసమయ మైనను మిడియెండకాల మగుటచే డేరాలో ఉక్క ఎక్కువగా ఉన్నది. అందువలన ఆ బాటసారులిద్దరును దారిప్రక్క నున్న తియ్యమామిడిచెట్టు నీడను సెజ్జవేసుకొని విశ్రమించుచున్నారు. కొంచెము దూరములో చెట్లక్రింద పొయ్యిపెట్టి వందమందికిపైగా సైనికులు వంటచేసుకొనుచున్నారు. డేరా నాలుగునైపుల నల్గురుసైనికులు కత్తి బుజముపైఁ బెట్టుకొని పారా ఇచ్చుచున్నారు.

‘ స్వామీ ! ఈజీవితములో చేయవలసినపను లన్నిటిని ముగించుకొని వచ్చినాను. కాని ఒక్కటిమాత్రమే ఇంకను మిగిలియున్నది’ అని ఆవృద్ధయోధుఁ డన్నాఁడు.

‘ ఏమిటది ? ’ అని ఆసన్యాసి అడిగినాఁడు.

‘ కల్యాణిపెండ్లి. గౌడేశ్వరునిచేతి కామెను అప్పగింతపెట్టినచో ఇఁక నేను నిర్విచారముగా చచ్చిపోవచ్చును. ’

‘ ఈమారు తప్పక యుద్ధము ముగిసిపోవును. ఏవిధముగానైనను ఇఁక కల్యాణీదేవివివాహమునకు అట్టే ఆలస్యము లేదు. ’

‘ జ్యోతిశ్శాస్త్రమందు తమ కసాధారణప్రజ్ఞ ఉన్నదని నేను విన్నాను. కల్యాణిదేవివివాహ మెప్పుడగునో నామనస్సునకు ప్రశాంతి ఎప్పుడు కలుగునో దయచేసి కొంచెము చెప్పవలెను స్వామీ ! నా

మనసు చాలారోజులనుండి ఆదుర్దాపడుచున్నది.'

'కల్యాణిని చూడకుండ ఆమెజాతకము చెప్పుటకు వీలులేదు. దేశమునకు తిరిగిపోయిన తరువాత ఆమెను చూచి భాగ్యగణనము చేసి చెప్పెదను.'

'పోనీయండి. నామనసు కుదుటబడి యెప్పుడు నాకు ముక్తి కలుగునో చెప్పుటకుకూడ వీలులేదా?'

'చెప్పవచ్చును. అయితే కొంచెము దగ్గరసా రా.'

వృద్ధుడు సన్యాసిదగ్గరికి వచ్చి కూర్చున్నాడు. సన్యాసి ఆతనిచేతిని చాలాసేపు పరీక్షచేసి 'అయితే ఉద్ధవా! కల్యాణి ఎప్పుడు పుట్టినదో నీ కేమైన జ్ఞాపకమున్నదా?' అని అడిగినాడు.

'ఉన్నది. ఒకయేడు ఆశ్వయుజమాసములో పెద్దగాలివాన వచ్చి భూకంపము పుట్టినది. సరిగా భూకంపము పుట్టిన అరగడియకు కల్యాణి పుట్టినది. నాకు బాగుగా జ్ఞాపక మున్నది.'

ఆమాట విని సన్యాసి ఆతనిచేయి వదలిపెట్టి వెదురుపుడకతో నేలపై ఏవో అంకెలువేసి గణింపమొదలుపెట్టినాడు. కొంచెము సేపటికి వెదురుపుడక ఆవల పారవేసి 'ఉద్ధవా! ఇదివరకే కల్యాణికి వివాహ మైపోయినది.' అని అన్నాడు.

'స్వామీ! నేనులేకుండ కల్యాణిపెండ్లి జరగుట అసంభవము.'

'పెండ్లికావలసినసమయము దాటిపోయినది. అయితే ఇదివరకే అయియుండవలెను. లేనియెడల ఇక పెండ్లిఘటన లేదు.'

ఆసమయమున మామిడితోపు మారుమ్రోగిపోవునట్లు సంగీతము బయలుదేరినది. కరుణకోమల మైన ఆకంఠస్వరము విని సన్యాసి తదేకదీక్షతో చెవియొగ్గి ఆసంగీతము వినసాగినాడు. క్రమక్రమముగా సంగీతము దగ్గరికి వచ్చుచున్నట్లు తోచి ఉద్ధవఘోషుడు లేచి

చూచినాడు. ఒక బాలకుడు పాడుకొనుచు ఆదారినిబడి ఉత్తరముగా వచ్చుచున్నాడు. బాలకుడు నల్లనివాడు. అతనిబట్ట లన్ని మాసి చినిగిపోయినవి. శరీరమంతయు శుష్కించిపోయినది.

ఆబాలకుడు వచ్చుచున్నదారి సరిగా గౌడదేశమునకు పోవును. సన్యాసి విశ్వానందుడును ఉద్ధవఘోషుడును ఆదారినే గౌడదేశమునకు తిరిగి పోవుచున్నారు. ఆదారిని దరిద్రబిక్షుకులు కావలసినంత మంది ఎప్పుడును కనుపట్టుకొని యుందురు. బిక్షుకు లందరును పాటలు పాడుచుందురు. ఏవేళను ఆదారిని సంగీతమునకు లోటుండదు. కాని యింతటిసున్నితమైన చక్కనిగాత్ర మిదివర కెన్నడును వినిపించలేదు. ఆమధురకోమలకంఠస్వరము విని విశ్వానందుడును, ఉద్ధవఘోషుడును తన్మయులైపోయినారు. బిక్షుకులలో ఇట్టిసుశిక్షితగాయకునిని, ఇట్టిగమనికగల గాత్రమును ఇట్టి అందమైనపాటను వారెన్నడు చూచియుండలేదు. అందుచే వారి కెక్కడలేని ఆశ్చర్యము కలిగినది.

దారివదలిపెట్టి ఆబాలకుడు డేరావైపు రాసాగినాడు. డేరా దగ్గరకు వచ్చి నిలువబడి మరొకచక్కనిపాట పాడినాడు. పాట చాలించినతరువాత భిక్షాపాత్ర చూపి 'బిచ్చము పెట్టండి' అని ఆబాలకు డన్నాడు.

'అబ్బాయీ! ఈవైపునకు రా' అని విశ్వానందు డాబాలకుని పిలిచినాడు. ఆబాలకుడు గొంతుసవ్వడి గుర్తుపట్టుకొని ఆమామిడిచెట్టుక్రిందికి వచ్చి నిలువబడినాడు.

'అబ్బాయీ! నీ వెవరు?' అని విశ్వానందు డడిగినాడు.

'నేను బికారిని'

'నీపేరు?'

'నా పేరు గుర్తిడివాడు'

‘నీ కింకొక పే రేదియు లేదా ?’

‘లేదు. అందరును ‘గ్రుడ్డి’ అని పిలచెదరు’

‘నీ కాపుర మెక్కడ ?’

‘ఇప్పుడు వీథులలో’

‘ఇంతకు మునుపో ?’

‘ఎక్కడనో ఉన్నదని మాయమ్మ చెప్పినది’

‘మీయమ్మ ఇప్పుడు ఎక్కడ ఉన్నది ?’

‘నాకు తెలియదు’

‘మరి నీ వెక్కడికి వెళ్లుచున్నావు ?’

‘గౌడనగరమునకు’

‘నీమాటవైఖరినిబట్టి గౌడ వని నేను మొదటనే అనుకొన్నాను. అక్కడ నీకు ఇల్లున్నదా ?’

‘తెలియదు. గౌడనగరముపేరు జెప్పిన మాయమ్మ అదేపనిగ ఏడ్చును’

‘మీయమ్మ కెందుకు బిచ్చమెత్తుకొనవలసివచ్చినది ?’

‘మా నాయన చచ్చిపోయినాడు. అందుచే తిండి లేక’

‘అయితే కావలసినవా రెవ్వరు లేరా మరి ?’

‘అదికూడ తెలియదు నాకు. బిచ్చముపెట్టించండి త్వరగా?’

‘బిచ్చము పెట్టెదము. అంత తొందరపడుచున్నా వెందుకు?’

‘బాబూ ! ప్రాణము విసుగెత్తునట్లు ప్రశ్నలువేసి చంపి చివరకు ఎంతమందో తన్ని తగిలివేయుట మామూలు”

‘మే మాలాగున చేయము. సరే కాని నీతండ్రి కేమిపనో నీ వెరుగుదువా ?’

'రాజుగారి సేనలో కొలువు. యుద్ధానికి పోయి మాతండ్రి చచ్చిపోయినాఁడు.'

'తరువాత ?'

'తరువాత తినుటకు తిండిలేక నన్ను చంకకెత్తుకొని మా యమ్మ వీథులలో బిచ్చమునకు బయలుదేరినది. కొన్నాళ్ళ కాగ్రామములో బిచ్చము దొరకలేదు. అందుచే బిచ్చముకోసము దేశదేశాలకు పోవలసివచ్చినది'

ఆమాటలకు ఉద్ధవఘోషునికన్నులనుండి రెండుకన్నీటిబొట్లు పొలిపోయి ముడుతలుపడినచెక్కులపై జారిపడినవి. విశ్వానందుఁడు కూడ మాటాడలేదు. అతనిగొంతు బిగిసికొనిపోయినది. చివరకు ఒక నిట్టూర్పువిడిచి అతఁడు మరల 'మరి రాజుగారు మీకు జీవనోపాధి ఏమియు చూపించలేదా ?'

'ఎవరికోసము మానాయన యుద్ధముచేసినాఁడో ఆరాజు ఓడిపోయినాఁడు'

'అయితే నీకు కాలక్షేపమో ?'

'ఇట్లె బిచ్చమెత్తుకొనుచు కాలక్షేపము చేయుచున్నాను. బిచ్చముకూడ దొరకినరోజున దొరకును. లేనిరోజున లేదు. కాని ఎవరో నాకోజులు వెళ్లించుచున్నాఁడు. ఎవరో ఎక్కడనుంచియో వచ్చి నాకు బిచ్చము దొరకనిరోజున అన్నము తెచ్చిపెట్టును. దాహమైనపుడు నన్నే చెరువునకైన తీసుకొనిపోవును. నేను దారి తప్పిపోయినప్పు డెల్ల మరల దారికి తీసుకొనివచ్చి విడచిపెట్టును. అతఁడెవరో నే నెరుఁగను. అతనినీడమాత్రమే నాకు కనఁబడుచుండును. అతఁ డెప్పుడును నాదగ్గరికి రాక దూరదూరముగ పరుగెత్తి పోవుచుండును. ఆయనను పట్టుకొనవలె నని నే నెన్నాళ్ళనుండియో తిరు

గుచున్నాను. కాని కనఁబడుటలేదు. ఏమి చేయుదు ?'

ఆమాటలు విని విశ్వానందుఁడు డేప్పుచు ఆగ్రుడ్డిపిల్లవానిని రొమ్మున కదుముకొన్నాఁడు. ఆబాలకుఁడు విస్మితుఁడైపోయి చూపు లేని కన్నులను అతనిముఖముకేసి త్రిప్పినాఁడు. కొంచెముసేపైన తరువాత విశ్వానందుఁడు మనసు దిటవుచేసుకొని 'బిడ్డా! నేను కూడ గౌడుఁడనే. సన్యాసినికూడ. ముక్కుపచ్చలారనియీయీడున నే నీవు పడరానిపాట్లు పడినావు. నీవు నావెంట గౌడనగరమునకు రా. వచ్చినట్లయిన నీ కేమియు లోటురాకుండ నేను కనుపెట్టెదను. ఏమి? వచ్చెదవా ?'

'అంత ఎందుకు బాబూ ? ఎందరో నన్ను ప్రశ్నలు వేసినారు. ఈమాట ఎందరితోనో చెప్పినాను. కొంతమంది బిచ్చముపెట్టి నారు. కొందరు తన్ని తగిలివేసినారు. కాని ఎవ్వరుకూడ మీలాగున జాలిపడలేదు.'

మరల విశ్వానందుఁడా బాలుని సందిట అదుముకొని 'నీవు నావెంట గౌడదేశమునకు రా! ఏమి? వచ్చెదవా? అని అడిగినాఁడు. ఆగ్రుడ్డిపిల్లవాఁడు కొంచెము సేపు యోచించుకొని 'వచ్చెదను. కాని ప్రస్తుతము ఉన్నపాటున రాలేను.' అన్నాఁడు.

ఆగ్రుడ్డిపిల్లవాని అవస్థ వినుచు ఉద్ధవుఁ డింతవరకు ముఖము వంచుకొని కంట నీరుపెట్టుకొనుచు కూర్చున్నాఁడు. ఇప్పుడు రాలేనను మాట వినఁగానే అతఁడు తల పైకెత్తి కన్నులు తుడుచుకొనుచు 'ఎందుకు రాలేవు బాబూ ?' అని అడిగినాఁడు.

'ఒకముసలివాఁడుకూడ నావెంట గౌడదేశమునకు వచ్చుచు న్నాఁడు. నేనే అతనికి దారిచూపించుచు తీసుకొనిపోవుచున్నాను.

నేనే గనుక మీతో వచ్చినయెడల ఆముసలివాఁడు అన్నమునీళ్లులేక మలమలమాడి చచ్చిపోవును.'

'నీ వొక కన్నులులేని కపోతివి. దారిచూపించుచు నీ వింకొకనిని తీసుకొనివచ్చుచున్నావా ?' అని విశ్వానందుఁడు చిరునవ్వు నవ్వుచు అడిగినాఁడు.

'అతఁడు చాలా వయసుచెల్లినవాఁడు. అడుగుతీసి అడుగు పెట్టలేఁడు. ప్రాయశ్చిత్తముకొఱకు అతఁడు గౌడనగరయాత్ర చేయుచున్నాఁడఁట. ఆసంగతి నాతో చెప్పినాఁడు. నాకు దారిచూపెట్టుచున్నమహానుభావుఁ డతనికి ఎందుచేత దారి చూపెట్టుటలేదో నేను తెలిసికొనలేకున్నాను.'

'ఎందుచేత ?'

'అతఁడు నాతో 'నేను మహాపాపిని. నాప్రాణముల కొఱకు సూరుమని లక్షలకొలఁదిజనులు ప్రాణములు విడిచినారు' అని అన్నాఁడు.

'సరే. అయితే అతనినికూడ నీవెంట తీసుకొనిరా. మనమందరము కలిసి పోవచ్చును.'

ఆగుడ్డిపిల్లవాఁడు వెంటనే విశ్వానందుని సందిలి విడిపించుకొని రహదారికి చేరుటకై వెనుకకు తిరిగినాఁడు. అది చూచి ఉద్ధవఘోషుఁడు 'నేను నిన్ను రాజమార్గ మెక్కించి వచ్చెదను. పద.' అని అన్నాఁడు.

'అవసరము లేదు. నీవలె ఎవరో నాముందు నడచుచు నాకు దారి చూపించుచున్నారు. అతనిని చూచి నేను దారి గుర్తించఁగలను.'

పాట పాడుకొనుచు ఆగ్రుడ్డిపిల్లవాఁడు రహదారిసబడి వెళ్లిపోయినాఁడు. ఆపాట విని ఉద్ధవుఁడు 'ఎంత మంచిపాట!' అని అన్నాఁ

డు. కాని విశ్వానందుఁ డామాట వినిపించుకొనక తదేకదీక్షతో వారి కేసి చూడసాగినాఁడు. కొంచెముసేపటిలో చిక్కి శల్యములు కనఁబడు చున్న ఒకముసలివానిని చేయిపట్టుకొని నడపించుకొనుచు ఆగ్రుడ్డివిల్లి వాఁడు మరల డేరాదగ్గరికి రాసాగినాఁడు. విశ్వానందుఁడు రెప్ప వేయకుండ ఆవచ్చుచున్న ముసలివానివంక చూడసాగినాఁడు. వారి ద్దరు దగ్గరికి వచ్చినతరువాత విశ్వానందుఁడు లేచి నిలువఁబడ అది చూచి ఉద్ధవుఁడుకూడ లేచి నిలువఁబడినాఁడు.

ఆవృద్ధుఁడు వచ్చి నిలువున వణఁకిపోవుచు 'నన్ను రక్షించు. విశ్వానందా! నన్ను రక్షించు.' అని విశ్వానందుని కాళ్ళమీఁద పడి ఏడువసాగినాఁడు.

విశ్వానందుఁ డావృద్ధుని చేయి పట్టుకొని లేవఁదీసి 'ఎవరు! సంఘస్థవిరా! మీ రిక్కడి కేందుకు వచ్చినారు?' అని నిర్వ్యాపాటు తో అడిగినాఁడు.

'నీపాదము లాశ్రయించుటకు.'

'అదేమి మాట! బుద్ధభద్రా! మీరు ఉత్తరాపథమునకు సంఘస్థవిరులు. నేను మామూలుచక్రరాజును. నాపాదము లాశ్ర యించుట ఎంతతప్పు!'

'నన్ను చెప్పిపొడిచి వేళాకోళము చేయకు. విశ్వానందా! నాయహంకారము మాసిపోయినది. నామూలముననే సద్ధర్మ మడు గంటిపోయినది. నాప్రాణముల కుసూరుమని లెక్కలేనంతమంది జనము పెండ్లాముబిడ్డల బాసిపోయినారు. వారిఉసురు నాకు తగిలినది. నాకర్మ మిట్లు కాలినది. నీవు నాకాశ్రయ మిచ్చి రక్షించవలెను. నాపాపమునకు పరిహారము చెప్పవలెను.'

ఆవృద్ధస్థవిరుఁడు మరల విశ్వానందునికాళ్ళు పట్టుకొనఁబోయి

నాఁడు. కాని విశ్వానందుఁ డాతని చేతులు పట్టుకొని అడ్డుపెట్టినాఁడు. ఆవృద్ధుఁడు మరల 'నేను సువర్ణవర్తకుని పుత్రుఁడను. వయసు చెల్లిన తరువాత సంఘమున ప్రవేశించినాను. కాని బంగారముపైని ఆశ నన్ను వదలిపెట్టలేదు. గౌడేశ్వరునివలన అనవసరముగా ధనవ్యయ మగుచున్నదనియు, ఘూర్జరరాజుతో సంధిచేసుకొన్నయెడల ఈఖర్చు తగ్గిపోవుననియు దానివలన సంఘకార్యములుకూడ నెరవేరు ననియు వెఱ్ఱిపడి దురాశకు లోనై నేను నమ్మినవారిని మోసగించినాను. దానికి నాకు ప్రాయశ్చిత్త మైనది. అనుభవింపవలసినదంతయు అనుభవించినాను. నాకు కర్మప్రాయశ్చిత్త మైనది. కార్యము గట్టెక్కఁగానే ఘూర్జరులు నిజరూపము వెల్లడించినారు. నిరపరాధు లైన స్త్రీపురుషుల నెత్తుటివరదలతో ఉత్తరాపథమంతయు పంకిల మైపోయినది. నాకు కావలసినశిక్ష అయినది. సద్ధర్మమునకు గౌడేశ్వరుకంటె మఱొకదిక్కు లేదు. ఉత్తరాపథమున కంతకన్న గతిలేదు. క్షమించి నన్ను మరల గౌడేశ్వరుని సన్నిధికి తీసుకొని వెళ్లు.'

ఈమాటలతో విశ్వానందుని ముఖము ఉజ్జ్వల మైపోయినది. అతఁడు చిరునవ్వునవ్వుచు 'సరేకాని స్వామీ! ఈగ్రుడ్డిపిల్లవానిని దొరకించుకొన్నా రెందుకు?' అని అడిగినాఁడు.

'విధి! విశ్వానంద! మనయదృష్టములతో ఈబాలకునియదృష్టమునకు ఎడతెగనిసంబంధ మున్నది. ఎంతకాలమువరకీపిల్లవాఁడు నాకుఁ దొరకఁడో అంతవరకు నేను నిన్ను కలసికొనలేను. ఈపిల్లవాఁడు దొరకిననాఁడే చక్రము వేసి చూచినాను. ఈతనితోఁగూడ గౌడమునకు బయలుదేరినయెడల దారిలో నిన్ను తప్పక కలసికొనఁగల నని తేలినది. ఇది గ్రహచారము.'

ఈమాట విని విశ్వానందుడు చిరునవ్వు నవ్వినాఁడు.

---

# పంచమ ఖండము.

## ౧

### దేవాలయము.

జెకార్రీనగరముప్రక్కనుండియే గంగానది ప్రవహించుచున్నది. ఆనదీతీరమున బహుపురాతనమైన శాతిదేవాలయమొకటున్నది. ఆదేవాలయముచుట్టును కాలక్రమేణ రావి జువ్వి మఱ్ఱి మొదలైనవృక్షములు పెరిగిపోయినవి. దేవాలయముముందే ఒకపెద్దరావిచెట్టున్నది. దానికొమ్మలు దేవాలయముమీదికి ప్రాకిపోయినవి. ఆబరువువలన దేవాలయశిఖరము కూలిపోయినది. గుడిలోనిలింగము పానవట్టము దేవాలయముకన్న బహుపురాతనమైనవి. ప్రతిష్ఠచేసిన యూతఁడు మొదట ఆదేవున కేమిపేరుపెట్టినాఁడో తెలియదు. కాని ప్రస్తుతము జనులందఱా దేవుని 'వృద్ధమహాదేవుఁ' డని పిల్చుచున్నారు.

అది వైశాఖమాసము. పగలు నాలుగుజాములుకూడ ఎండ నిప్పులుచెరిగి లోకమును మలమల మాడ్చుచున్నది. అసలుసంజవేళ మాత్రము కొంచెము కొండగాలితగిలి ప్రాణములు కుదుటఁబడుచున్నవి. ఆప్రొద్దుమాపువేళ ఒకబాటసారి నదీతీరమువెంట [illegible] పడమటినుండి తూర్పునకు వచ్చుచున్నాఁడు. అతనిబట్టలు [illegible] పోయినవి. ఒంటినిండ దుమ్ము చీదరలాడుచున్నది. అతఁడు మెల్లమెల్లగా కాళ్లీడ్చుకొనుచు ఆదేవాలయమువఱకు వచ్చినాఁడు. ఇఁకను అడుగుపెట్టుట కాతనికి సాధ్యముకాలేదు. బడలికవలన అతనిశరీరమే

అతనికి బాగునైపోయినది. అతఁడు జాపసోపాయపడుచు ఆదేవాలయము దగ్గఱి చెట్టునీడను కూలఁబడినాఁడు.

ఆసమయముననే నగరములోనిస్త్రీలు కొందఱు బిందెలు చంకఁబెట్టుకొని నవ్వుచు కేరింతాలాడుచు రేవులోనికి వచ్చినారు. వారిని చూచి కొంచెము విసుఁగుకొనుచు ఆబాటసారి గుడిప్రక్కనున్న మఱొకచెట్టునీడకు వెళ్లి కూర్చున్నాఁడు. ఆస్త్రీలందరు వేళాకోళము లాడుకొనుచు స్నానముచేయుటకు నీటిలో దిగినారు.

'విన్నావటో! ఓవిడా? ధర్మాధికారి బావమఱఁది రాలేదఁట గానా?' అని ఒకయామె అడిగినది.

'ఏమో మరి? వారింటికి వెళ్లినాను గాని నాకెవ్వరును కనఁబడలేదు' అని మఱొకతె అన్నది.

'అయ్యో! వచ్చినాఁడటమ్మా! రాకరాక అత్తవారింట కాలుబెట్టుటచేత నలుగురిలోనికి వచ్చి మొగము చూపించుటకు సిగ్గుపడినాఁడు కాబోలు!' అని ఇంకొకతె అన్నది.

'సిగ్గేమిటమ్మా మొగవానికి? నే నింకొకమాదిరిగా విన్నాను. మఱేమో ప్రొద్దుక్రుంకినప్పటికి వచ్చి మరల తెల్లవారకుండనే వెళ్లిపోవుచున్నాఁడటమ్మా?' అని మాటజాణతనముగల మగువ ఒకతె అన్నది.

'అయితే నీ వెఱుఁగవా యేమిటోనే? అకస్మాత్తుగా ధర్మాధికారిచెల్లెలు మూర్ఛపోయినది. ఇది తెలిసి చూచివత్తుమని సందెవేళ నేను వారింటికి వెళ్లినాను.' అన్న దొకవనిత.

'ఎన్నాళ్లయినది?' అని ముసలియామె అడిగినది.

'దగ్గరదగ్గర వారమురోజులు కావచ్చినది. సరే చూడు! చిత్రము! నేను వెళ్లిచూతును గదా మూర్ఛలేదు గీర్ఛలేదు.

మొద్దులాగున్నదానవు. పనిచేయవలసివచ్చునని ఈబద్ధమొత్తు ఎత్తినది. అన్యాయ్యా పాపమని నలుగురు చూచుటకు వచ్చినప్పటికి మూర్ఛపడినట్లు నటించి నడవలో పండుకొన్నది. ఆమె పడినెగాతు అక్కడనే ఉన్నది. అసలు చిదంబరరహస్యము మన కేమి తెలియును ! నలుగురు చెప్పుకొనుచుండగా నేనుకూడ విన్నాను.'

'ఏమని విన్నావో మాకుకూడ కొంచెము చెప్పావా ?'

'ముంగిట కూర్చుండి ఆయిల్లాలు పూజకోసము వత్తిపత్తి చేసుకొనుచున్నదట ! ఇంతలో అయిబులేకుండపోయిన మగనిగొంతు వినవచ్చినదట ! వెంటనే ఆవిడ తెలివితప్పి పడిపోయినదట ! ఏమి పోకళ్లమారిపుంతే అమ్మా ! మొదటినుంచి చివరవరకు సర్వము అబద్ధమేనట ! ఎంతకైన తగునే ఆయిల్లాలు !'

ఆబట్టక్రింద బాటసారి ఈమాటలన్నియు ఆశ్యానకి తూచా తప్పకుండ విన్నాడు. ఉక్కపోసి శరీరము చిటచిటలాడిపోవుచుండుటవలన స్నానము చేయవలెనని అతడుకూడ రేవుప్రక్కగా నీటిలోనికి దిగినాడు. ఆస్త్రీలందరు అతనిని చూచినారు. అతనివీపుమీద పెద్ద నల్లనిమచ్చ ఒకటి ఉన్నది. అది చూచి మొదటియామె 'చూచినావటే ! ఆమచ్చ ' అన్నది.

'పుట్టుమచ్చ కాబోలు ?' అని రెండవయామె అన్నది.

ఈమాటలు వినీవిననట్లు నటించి ఆబాటసారి స్నానము చేసి మరల ఎప్పటిచెట్టునీడకు వెళ్లిపోయి కూర్చున్నాడు. ఇంతలో నలుగురైదుగురు పాకీస్త్రీలు చీపురులతో దారిలోని చెత్తా చెదరూ బాగుచేయుచు నగరమునుండి నదీతీరమునకు వచ్చినారు. వారివెనుకనే నలుగురు సేవకులు దుమ్ము రేగకుండ దారివెంట నీళ్లు చల్లుచు వచ్చినారు. నీలాటిరేవులోని స్త్రీలు అది చూచి వారిలోవారు 'ఈయుట్టహాస

మంత ఎందుకోసమో ?' అని నోరునొక్కుకొనుచు గుసగుసలాడ సాగినారు.

'వాళ్లనే ఎందుకు కనుగూడదూ ?' అన్నదొకావిడ.

'ఈగందరగోళ మంతా ఎవరికోసము ?' అని సాహసించి ఒకతరుణి ఆసేవకులను అడిగినది.

'గౌడచక్రవర్తి పట్టమహాదేవిగారు దేవతాదర్శనానికి ఇక్కడకు వత్తురని' అని ఆసేవకుఁడు కొంచెము ఠీమాకీగా చెప్పినాఁడు. ఆజవాబు విని మొదటియామె తలపంకించుచు 'ఏమి విరుగబాటమ్మా! ఒక్కమాటే కొండచిల్లుపడ్డట్లు మాట్లాడుచున్నాఁడు. అయ్యో! ఆపొగరుబోతుతనము, ఆవెఱ్ఱిచూపు చూచినావా? నౌకరువానికింత తలదిరుగుతన మెందుకో? ఏ మెగిరిపడుచున్నాఁడే అమ్మా!' అని అన్నది. ఆమాటలు వినిపించుకొనక రెండవయామె ఆచారకుని కేసి చూచి 'ఒక్కపట్టపుదేవియేనా మరెవ్వరైన వచ్చుచున్నారా ?' అని అడిగినది. 'మహాదేవివెంట ధర్మాధికారిచెల్లెలు అమలాదేవిగారు, ఆమె వదినెగారు, చిత్రిమతికాదేవిగారు మరికొందరు రాజకాంతలు వచ్చుచున్నారు.'

అది విని రెండవయామె 'అయితే అక్కా ? మన మీవేళ ఇంకొకగడియసేపిక్కడనే ఆగి పట్టపుదేవి వచ్చినతరువాత ఆమెరూపురేఖలు చూచి వీలున్నయెడల రెండుముక్కలు మాట్లాడికూడ వెళ్ళవలెను' అని అన్నది.

'కన్నులు మీఁదికి వచ్చి మాట్లాడుచున్నావేమే ? రేపుంటో పట్టపుదేవిని కలసికొనుటే గాక పైపెచ్చు మాటలుకూడ మాట్లాడెదవేమి ? ఏమి తెలివాలితనమే తల్లీ !' అని మొదటియామె ముఖము చిట్లించుచు కోపపడినది.

'అదేమిటే! మహాదేవి ఆకాశముమీదినుండి ఊడిపడినదా?'

'నీకు గుండెలుండే ఆమాట అనుచున్నావా? ఏమి సాహసమే తల్లీ! తినుటకు తిండి లేకపోయినను ధిమాకీకి తక్కువ లేదు. పారావాండ్రు వచ్చి మనల నందరిని అవతలికి వెళ్ళఁగొట్టినప్పుడుగాని మహాదేవిసంగతి నీకు తెలియరాదు!'

ఆమాటలు విని సేవకులు నవ్వుచు 'మామహాదేవి మామాములు అమ్మలక్కలలాంటిది కాదు. మీతో మనసిచ్చి మాట్లాడి మర్యాదచేయును. మిమ్మెవ్వరును వెళ్ళిపొమ్మనరు. మీయిష్టమువచ్చినంతసేపిక్కడ ఉండవచ్చును. సరదాగా మహాదేవితో మాట్లాడవచ్చును. ఏమియు మాటరాదు' అని చెప్పినారు.

'మంచిమాట! నీవు నచ్చినమాట అన్నావు. మాయక్కగారు చూడు! దెబ్బకొట్టినట్లు ఈలాగున నూటిపోటిమాటలనుచున్నదో?' అని ముఖమాడించుచు రెండవయామె గుసగుసినది.

ఇంతలో పదెనిమిదిపల్లకీలు వచ్చి గుడిదగ్గర ఆగినవి. పల్లకీలను అక్కడ దింపి. బోయీలు, కాపలావాండ్రును, సేవకులు తప్పుకొన్నారు. వెంటనే పట్టపుదేవి, చిత్రమతికాదేవి, అమలాదేవి, మంజరీదేవి మొదలైన రాజకాంతలు చెలికత్తెలతోకూడ రేవులోనికి వచ్చి స్నానమునకు నీటిలో దిగినారు. పేరుపేరువరుసల వచ్చినయిల్లాండ్ర నందరిని మంజరీదేవి పట్టమహాదేవికి ఎరుకపరచినది. పట్టపుదేవిగారి యపరూపమైన చక్కదనము, మాట మంచితనము, అణకువ, చూచి నగరస్త్రీలందరును దవడలు నొక్కుకొన్నారు. అమలదేవి మాత్రము అందరితోబాటు కాక ముందుగా స్నానముచేసి పూజ చేయ మొదలుపెట్టినది. ఆమె ఎవరితోను నోరువిప్పి మాటాడినపాపము పోలేదు. స్నానము కాఁగానే పట్టపుదేవి మొదలైన కాంతలు

గూడ తడిబట్టలతో నే వృద్ధశివుని కోవిలలోనికి వెళ్ళినారు. నగరస్త్రీ లందరు బిందెలతో నీళ్లు ముంచుకొని ఎవరింటికి వారు వెళ్లిపోసాగి నారు. దారిలో నడచుచునడచుచు రెండవయామె మొదటియా మెతో ' దాని పొగరు పొడిచివేయ ధర్మాధికారి చెల్లెలి నంగనాచి తనము చూచినావటే ! మనతో పల్లెత్తుమాటకూడ మాట్లాడలేదు. ఏమి చూచుకొన్న పొగరో అది ? ' అని అన్నది.

' పుష్పదేవి ఎంతమంచియిల్లాలే. చూచినావా ? అటువంటి కలుపుగోలు ఇల్లాలిని నేనిదివరకు చూడలేదు. ఏమిచక్కగా, ఎంత వినయముగా మాట్లాడినదే ' అని మొదటియామె అన్నది.

' ఊఁహూఁ. పోదు ! ' అని రెండవయామె ముఖము త్రిప్పు కొనుచు కసురుకొన్నది.

పుష్పదేవియు తక్కినముత్తైదువులును దేవతాదర్శనము చేసి గుడివాకిటికి వచ్చినారు. కాని అమలమాత్రము అప్పటికిని గర్భగు డిలోనే ఉన్నది. కల్యాణీదేవి గుడిగుమ్మమున నిలువబడి ' అక్కా ! అమలా ! స్వామిమోల్ల ఇనదినము ఇంతసేపు ప్రార్థన చేయుచు న్నావు నీవు ఎందుకోసము ? అని అడిగినది.

' దేవి ! నాప్రార్థన నీవు తెలిసికోలేవు. నాలుగుకాలముల పాటు భగవంతుడుకూడ నాప్రార్థనను నీకు తెలియకుండ ఉంచవలె ననే నేను కోరుదును. '

' పోపో ! నాతో కొంచెము చెప్పఁగూడదా నీవు ? '

' దేవి ! నీ వింకను ముక్కుపచ్చలారనిదానవు. సంసారము లోని కష్టసుఖముల నీ వింకను తెలియలేదు. నాబ్రదుకు ప్రొద్దుదిరి గిపోయినది. జరుగవలసినలాంఛనాలు, అనుభవించవలసినసుఖము లన్ని యు తీరిపోయినవి. ఇంక నేను భగవంతుని కోరుకొనవ

లసిన దేమున్నది ? 'నేను చేసుకొన్నకర్మమునకు ప్రాయశ్చిత్త మైపో
యినది. నాయహంకారము, నాదుర్మోహము వదలిపోయినవి. నేను
పూర్వ మెట్లున్నానో అట్లుండిన చాలును. నాకంతకన్న మరే
మియు అక్కరలేదు. స్వామీ ? నాకు నగ అక్కరలేదు. నాకెవరు
లక్కరలేదు. నాసౌభాగ్యము, నానుదుటికుంకుమపుబొట్టు——'

అమల మరి మాటాడలేకపోయినది. ఆమెగొంతు బిగిసికొని
పోయినది. ఆమాటలు విని కల్యాణికూడ నిర్విణ్ణురాలైపోయి వెను
కకు తిరిగినది. పూజాపురస్కారములు ముగించుకొని అమలకూడ
దేవాలయము వెడలి వచ్చినది. అందరును పల్లకీ లెక్కినారు. బోయీ
లహుంకారములతో పల్లకీలు నగరములోనికి బయలుదేరిపోయినవి.

ఇంతవరకు వెనుకటిబాటసారి గుడిముందున్న రావిచెట్టెక్కి
కూర్చున్నాడు. స్త్రీలందరు వెళ్ళిపోవుట చూచి చెట్టుదిగి కోవెల
లోనికి వచ్చినాడు. చెట్టుమీదనుండి ఆబాటసారి అమలకు కల్యాణికి
జరిగినమాటలు విన్నాడు. అమల ప్రార్థనలుకూడ విన్నాడు. గబ
గబ కోవెలలోనికి వెళ్ళి దేవునిముందు సాష్టాంగపడి 'స్వామీ! నేను
అమలముఖము చూచి దుఃఖము పట్టలేకున్నాను. నామనసు పరిపరివి
ధాల బాధపడుచున్నది. స్వామికార్యమున నాజీవితము నర్పింపవ
లయు నని నేను స్థిరపరచుకొన్నాను. స్వామీ! నాకు ధైర్య మిమ్ము.
మాట చెల్లించుకొనకుండ నేను ఇంటికి తిరిగి పోలేను. నామహారా
జుకోసము, నాదేశముకోసము, నాప్రాణములు ధారపోసెదను. నా
కదృష్టపురోజు లింకను రాలేదు. నాగ్రహచార మెప్పుడు బాగుం
డునో చెప్పలేకున్నాను. నేను వట్టి దుర్బలహృదయుడను. దేవాది
దేవా! మహాదేవా! శంభో! అంతర్యామి! నాహృదయదౌర్బల్య
మును పోగొట్టుము. చిన్ననగకోసము నేను పండుమంటిని సారెము

పాపుఁ జేసుకొన్నాను. అనఁగ తీసుకొనిపోకుండ నేను అమల మొగము చూడలేను. మాటఁ దాఁగిపోలేను. ప్రభూ! నామనసు చెదరనీయకుము. మనోధైర్య మిమ్ము.' అని వేడుకొన్నాఁడు.

అతని ప్రార్థన పూర్తిగాకమునుపే ఎవరో ఆమసకచీకటిలో అతని భుజముపై చేయి వేసినారు. బాటసారి ఉలికిపడి వెనుకకు చూచినాఁడు. ఆవచ్చినవా రెవరు ?

'గురుదత్తా! నీనగలు నే నిచ్చెదను. నీ వింటికి తిరిగి వెళ్ళు'

గుడినిండను కాగడాలు వెలుగుచున్నవి. కాపలావాండ్రు, సేవకులు, దండధరులు, పరిచారకులు, సైనికులు, తీరి నిలుచున్నారు. ఇది యంతయు చూచి గురుదత్తునిగుండె గుభాలు మన్నది. సాక్షాత్తు పరమభట్టారక సర్వగౌడసామ్రాజ్యాధీశ్వర ధర్మపాలదేవమహారాజాధిరాజు గురుదత్తునిభుజముపై తట్టి 'లెమ్ము. నీనగ నే నిచ్చెదను. నీ వింటికి తిరిగి పొమ్ము గురుదత్తా!' అన్నాఁడు.

గురుదత్తుఁడు గడగడ వణఁకుచు గౌడేశ్వరుని కభివాదము చేసి ప్రక్కకు తప్పుకొని తలవంచుకొని నిలువఁబడినాఁడు. గౌడేశ్వరుని చేయి ఇంకను గురుదత్తునిభుజముమీఁదనే ఉన్నది.

---

## అదృష్టహేతు.

రాష్ట్రకూటరాజైన గోవిందవర్షదేవుఁడు గౌడుని పక్ష మవలంబించి ఘూర్జరరాజ్య మాక్రమించినాఁడు. గౌడరాజ్యమును వదలిపెట్టి ఘూర్జరులు చేజిక్కిన కన్యాకుబ్జరాజ్యమును సంరక్షించుటకై పూనుకొన్నారు. భీష్మదేవుఁడును, విమలనందియు, జయవర్ధనుఁడు, రణసింహుఁడు తమతమ సైన్యములతో తిరిగి వారణాసీదుర్గమును ముట్టడించినారు. గౌడసామ్రాజ్యమును రక్షించుటకై శోణతీరమున ఒకమట్టికోటను కట్టి ప్రమథసింహుఁడు సైన్యముతో సహా ఆకోటలో సావధానముగ కాచుకొనియున్నాఁడు. మండలదుర్గమున మహాకుమారవాక్పాలదేవుఁడు ససైన్యముగ కనుపెట్టుకొనియున్నాఁడు. గౌడేశ్వరుఁడు నూతనపట్టమహిషితోఁగూడ చాలారోజులకు మరల జక్కారీనగరమునుండి గౌడనగరమునకు బయలుదేరినాఁడు. గురుదత్తుఁ డని మారుపేరుపెట్టుకొన్న సర్వానందభట్టాచారి, ఉద్ధవఘోషుఁడు, కమలసింహుఁడు కూడ ఆయనవెంట బయలుదేరినారు.

గౌడేశ్వరుఁడు పట్టపుదేవితోఁకూడ రాజధానికి తిరిగి వెళ్ళుచున్నాఁడని విని రాఢదేశమందును, బరేంద్రమండలమందును ప్రజలు మహోత్సవముతో వారి నభ్యర్థించుటకై సన్నాహము చేసినారు. ప్రతినగరమందు ప్రతిగ్రామమందు మహారాజదంపతులు వచ్చినదినమున మంగళవాద్యములతో, ఆటపాటలతో ఉత్సవములు చేసినారు. క్రొత్తమహాదేవితో గౌడేశ్వరుఁడు వచ్చుచున్నాఁడన్నవార్త గౌడనగరమునగూడ వ్యాపించినది. రాజదంపతుల కో[illegible]లు చేసి గౌరవించు

టకై గౌడనగరప్రజలు ఎపుడులేనిసన్నాహము చేసినారు. నగరము మనోహరముగ అలంకరించినారు. రాజవీధులం దంతట పందిళ్ళు వేసి తోరణములు కట్టినారు. ప్రజలందరు తమతమయిండ్లకు వెల్ల వేసుకొని గుమ్మములందు అరటిచెట్లు పాతి, ఘూర్జరలకు మామిడాకులు కట్టి, ద్వారబంధములకు పూలదండలు మామిడితోరణములు కట్టి కొ్రొత్తబట్టలు కట్టుకొని ఎక్కడలేని సంతోషముతో ఉత్సవమున పాల్గొన్నారు. రాజదంపతుల దర్శనార్థము వచ్చు జనులకు విధవిరామము లేదు. ప్రజలసంతసమునకు పట్టపగ్గములు లేవు. ఈసంతోషసమయమున బీదల కన్నదానము చేయవలెనని రాజమాత పెద్దదేవి మహామంత్రికి ఆజ్ఞాపించినది. అతఁడు సంతర్పణసమారాధనలకు కావలసిన ఏర్పాట్లన్నియు చేసినాఁడు. బీదసాదల సాధువాదములతో గౌడనగరము పిక్కటిల్లిపోయినది.

ఈమహోత్సవసమయమున బానకడుపు పొట్టిబ్రాహ్మణుఁడొకఁడు ముఖము వేలవేసుకొని గంగాస్నానమునకు వెళ్ళుచున్నాఁడు. పూజాసామగ్రి తీసుకొని కోటలోనుండి దేవాలయమునకు వెళ్ళుచున్న దాసి ఒకతె దారిలో అతనికి కాన్పించినది. ఆమెను చూడఁగానే ఆబ్రాహ్మణున కెక్కడలేని తొందర పుట్టి 'మాధవీ! ఓమాధవీ!' అని గొంతెత్తి పిలువసాగినాఁడు. ఆకేకలను వినుపించుకొనక ఆదాసి గబగబ వెళ్ళిపో మొదలుపెట్టినది. కేకలు వేసి వేసి ప్రాణము విసిగి ఆబ్రాహ్మణుఁ డామెను కలసికొనుటకై చివరకు పరుగు మొదలుపెట్టినాఁడు. ఇతని పరుగు చూచి ఆదాసి మరింత గబగబ నడువసాగినది. పొట్టివాఁడు, బొజ్జకడుపువాఁడే కాక ఊబశరీరముగల ఆబ్రాహ్మణుఁడు పరుగెత్తి పరుగెత్తి చావుదెబ్బలమీద ఆమెను కలసికొన్నాఁడు. అతని వెర్రిపరుగు చూచి ఆమెకు నవ్వు

నవ్వాపుకొనలేకపోయినది. వెనుకకు తిరిగి చూచి నవ్వుచు ఆగిపోయినది.

ఎగరోజుకొనుచు దాసిదగ్గరికి వచ్చి నిలువఁబడినాఁడు గాని పాప మా బ్రాహ్మణునకు నోరువిప్పి మాటాడుట కూపిరి సలుపలేదు. అతనిశరీరము నిలువు చెమటలు పోసినది. అతనిఅవస్థ చూచి ఆమె లేనికోపము తెచ్చుకొని కనులెఱ్ఱఁజేసి ‘ ఎవరు నీవు ? నే నెవతెనో ఎరుఁగుదువా ? కోటలోనిదాసిని భయపెట్టి నీ వీమోస్తరు తఱిమినందుకు నీపని పట్టెదను. ఉండు. నాసంగతి నీకు తెలియదు. నీపళ్లు పీకించకున్న నాపేరు మాధవి కాదు ’ అన్నది.

ఆమాట విని బ్రాహ్మణుఁడు కొయ్యబారిపోయినాఁడు. ఉన్న ఓపిక కొంచెముకూడ మాసిపోయినది. అతనికంగారు చూచి మాధవి అదేపనిగా నవ్వ మొదలుపెట్టినది. ఆనవ్వుచూచి బ్రాహ్మణునిమనసు కొంచెము కుదురుపడినది. అతఁడు వగర్చుచు ‘ మాధవీ ! నా రోజులు బాగుగ లేవు. నాపని నానాటికి తీసికట్టగుచున్నది. దానికితోడు నీవుగూడ నన్ను మరచిపోయినావు. గ్రహచార మెట్లున్నదో తెలిసికొనుటకు బయలుదేరినాను. ’ అన్నాఁడు.

‘ నీపని ఎట్లున్న దేమిటి ? ’

‘ కన్యాకుబ్జరా జంతగొప్పవానిని ఇక్కడికి తీసుకొనివచ్చినాను. అతఁడు రాజైనతరువాత నాదారిద్ర్యము తీరునట్లు పాతిక వేలో ముప్పదివేలో ముట్టఁజెప్పునని అనుకొన్నాను. నారోజులు బాగుండక ఆరాజుస్థితి మరల మొదటికి వచ్చినది. చేజిక్కినరాజ్యము పోయి అతఁడు యుద్ధములో మునిఁగి దేవులాడుచున్నాఁడు. చూచినావా ? నాకర్మ మెట్లు కాలిపోయినదో ? ’

‘ అవును. ఆమాట నిజమే. ’

'నాదుర్దశ అంతలో తీరిపోలేదు. యుద్ధము ముగియఁగానే మహారాజు పెండ్లి జరుగు నని అందరము అనుకొన్నాము గదా. నా కర్మముకాలి! ఇదివరకే వివాహ మైపోయినదని ఇప్పుడు తెలిసినది నాకు. దక్షిణ లేదు. తాంబూలము లేదు. దానము లేదు. ధర్మము లేదు. చివరకు ఫలాహారము లేదు. బందలు లేదు. పుట్టెడాశకూడ బుగ్గిని గలసినది.'

'ఒకరోజు ఫలాహారమునకు నీ కిప్పటికిని లోటులేదు.'

'అయ్యో! వెఱ్ఱిదానా! ఇం కేమి ఫలాహారము! నాపిండము! ఇఁక నాపని సున్నకు సున్న. హళ్లికి హళ్లి.'

'ఫరవాలే దయ్యా బ్రాహ్మణుఁడా?'

'లేదు మాధవీ! నీవు వేయి చెప్పు. లక్ష చెప్పు. నారోజులు మంచివికావు. అందరిని విడిచిపెట్టి ఈశనిగాఁడు నన్ను పట్టుకొన్నాఁడు. ఈగ్రహచార మెప్పుడు వదలునో తెలిసికొనుటకే నేను జ్యోతిష్కుని దగ్గరికి వెళ్ళుచున్నాను. జాతకము చూపించి ఏదో గ్రహశాంతి చేయించక తప్పదు. అవునుగాని నీ వెక్కడికి ఇప్పుడు?''

'దేవాలయమునకు.'

'సరే. పద. నేనుకూడ ఆవైపునకే వచ్చుచున్నాను.'

వా రుభయులు రాజవీథినిబడి దక్షిణముగా పోసాగినారు. కొంతదూరము పోయినతరువాత దారిలో వారి కొకసన్యాసి కలసినాఁడు. మాధవి అతనిదగ్గరికి వెళ్ళి నమస్కరించి 'అయ్యా! ఈయన నాస్వామి. ప్రస్తుతము చాలా చిక్కులో ఉన్నాఁడు. మంచిరోజు ఎప్పుడు వచ్చునో దయచేసి కొంచెము తమరు చెప్పవలెను.' అని అడిగినది.

ఆసన్యాసి పురుషోత్తమశర్మను ముఖము కేసి రెప్పవేయక చూచి

'నీ కింతఆలోచన ఎందుకు? గౌడేశ్వరున కింకను వివాహ మైనట్లు కాదు. ఇప్పటి కైనది గాంధర్వవివాహము. ముందుముందు రాష్ట్ర కూటరాజకన్యతో శాస్త్రీయ మైనవివాహము కాఁగలదు. అప్పుడు నీకోరిక తీరును. అంతగా విచారపడకు.' అని నవ్వుచు చెప్పినాఁడు.

'నిజమేనా? స్వామీ!' అని పురుషోత్తమశర్మ ఆత్రముగా అడిగినాఁడు.

'మనసు స్థిమితపరచుకో! మరల నీకు రాజపురోహితపదవి తప్పదు.'

ఆమాట చెప్పి సన్యాసి గబగబ వెళ్ళిపోయినాఁడు. మాధవీ పురుషోత్తమశర్మలు నివ్వెరపోయి రాజవీధిలో కొయ్యబొమ్మలవలె అట్లే నిలువఁబడిపోయినారు. ఇంతలో గుఱ్ఱపుడెక్కలచప్పుడు విన వచ్చినది. పురుషోత్తమునకు జ్ఞానము కలిగినది. అతఁడును మాధవియు కలిసి ఆసన్యాసికోసము వెదకినారు. కాని సన్యాసి కాన్పించలేదు.

---

# 3

## మైత్రికి విలువ.

ఘూర్జరసేన మెరుపువలె వచ్చి మెరుపువలెనే పోయినది. స్వరక్షణకై నాగభటదేవుఁడు సమస్త సైన్యములను తీసుకొనివెళ్లినాఁడు. విమలనంది, జయవర్ధనుఁడు, తిరిగి అవలీలగా వారణాసిని ప్రతిష్ఠానమును వశపరచుకొన్నారు. క్రమక్రమముగా చక్రాయుధునిరాజ్యమంతయు గౌడసామంతులవిక్రమమువలన తిరిగి అతనియధికారముక్రిందికి వచ్చినది. వెంటనే గౌడేశ్వరుఁడు సామంతగణముతో గూడ గౌడనగరమునకు తిరిగి వచ్చినాఁడు.

గౌడేశ్వరుని వివాహము. గౌడనగరమున వివాహమహోత్సవమునకు తగినసన్నాహములు జరిగినవి. రాఢవంగమగధగౌడదేశములందలి ప్రజలు ముహూర్తసమయమునకై ఎదురుచూచుచున్నారు. గౌడేశ్వరునితో గూడ ఉద్ధవఘోషుఁడు కల్యాణిని వెంటఁదీసుకొని గౌడనగరమునకు వచ్చినాఁడు. ప్రమథసింహ, రణసింహ, కమలసింహ ప్రభృతిరాఢసామంతు లందరు ఈశుభకార్యమునకై రాజధానికి వచ్చినారు. వివాహము జరుగఁగానే వారందరు మహాకుమారవాక్పాలదేవునివెంట ఘూర్జరరాజ్యమును ఆక్రమించుటకై వెళ్లఁగలరు. కళింగమునుండి, ఓఢ్రమునుండి, కామరూపమునుండి ప్రతిదినము నజరానాలతోకూడ గౌడరాజసభకు దూతలు వచ్చుచున్నారు.

నేఁడు రాష్ట్రకూటరాజైన గోవిందదేవునిదగ్గరనుండి యుద్ధసమాచారము తీసుకొని రాయబారి వచ్చినాఁడు. అందువలన ఆతని గౌరవార్థ ముత్సవ మేర్పాటైనది. గౌడేశ్వరుఁడు స్వయముగా కొలు

వ్రకూటమున ఆతని గౌరవించును. అందువలన గౌడరాజసభ నేఁడు జనులతో కిటకిటలాడిపోవుచున్నది. పాత్రులు, మిత్రులు, రాజో ద్యోగులు, రాజబంధువులు, సేనానాయకులు, మహానాయకులు, సైని కులు మొదలైనవారందరు ప్రభాతముననే రాజసభకు వచ్చినారు. జనులు గుంపులుగుంపులుగా రాజవీథులందు నిలువఁబడినారు. ముత్తై దువలు చల్లుచున్న పేలాలతో, తెల్లనిపూవులతో, అక్షతలతో, రాజ వీథి కప్పంబడిపోయినది.

నగరతోరణమున మొదటిజాముననగారా మ్రోగినది. వెంటనే నగరప్రాంతమందలిశిబిరమునుండి పదునేనుగురుగుఱ్ఱపురౌతులు నగర ద్వారమున ప్రవేశించినారు. అందరికన్నముందుగా గౌడమహాప్రతీ హారుఁడు నడచుచున్నాఁడు. అతనివెనుక పన్నెండుగురుదండధరులు సువర్ణదండహస్తులై బయలుదేరినారు. వారివెనుక తెల్లనివనాయుజా శ్వము నెక్కి శుభవర్మావృతుఁడైనరాష్ట్రకూటరాజదూతయు, ఆతని వెనుక తెల్లగుఱ్ఱము లెక్కి శుభ్రకవచావృతులైనరాష్ట్రకూటరాజ యోధులు పదునారుగురును, వారివెనుక బారులుదీర్చి గౌడదేశపు గుఱ్ఱపుసైనికులును బయలుదేరినారు. గౌడమహాప్రతీహారుఁడు నగర మున కాలుపెట్టఁగానే ఒక్కమారుగా వేలకొలఁదిశంఖము లూది నారు. మేడలపైన, మిద్దెలపైన, కిటికీలలో నిలచి నగరములోని ముత్తై దువ లెడతెరపిలేకుండ పూలవర్షము కురిసినారు.

ఆయూరేగింపుటుత్సవము రాజప్రాసాదముకడకు రాఁగానే యోధులందరుః గుఱ్ఱములు దిగినారు. మహానాయకప్రమథసింహుఁ డును, మహామంత్రిగర్గదేవులవారును ప్రాసాదతోరణముదగ్గఱికి వారి కెదురుగా వచ్చి అభ్యర్థనము చేసినారు.

ప్రాసాదతోరణముమొదలుకొని రాజసభవరకును చాందినీలు

కట్టినారు. ఆచాందినీలకు పుష్పహారములు, ముత్యాలజాలరులు అలంకరించినారు. రాష్ట్రకూటరాజదూత గౌడమహాప్రతీహారుని వెంట ఆచాందినీలకిందుగా బయలుదేరినాఁడు. అతని వెనుక అంగరక్షకసైన్యము బయలుదేరినది. వారందరు సభాద్వారముకడకు వచ్చినారు. అక్కడ కన్యాకుబ్జరాజైన మహారాజాధిరాజచక్రాయుధదేవుఁడును, మహాకుమార, పరమభట్టారక మహారాజ శ్రీమద్వాక్పాలదేవులవారును వారికోసఁ ఎదురుచూచుచు నిలువఁబడియున్నారు.

రాయబారిని నడుమనుంచుకొని చక్రాయుధుఁడును, వాక్పాలదేవుఁడును రాజసభామంటపమున ప్రవేశించినారు. వారిని చూడఁగానే పరమేశ్వరపరమభట్టారకపరమసౌగతమహారాజాధిరాజధర్మపాలదేవుఁడు సింహాసనమునుండి లేచి నిలువఁబడినాఁడు. సేనానులు, సైనికులు ఒరలనుండి కత్తులు తీసి అభివాదనము చేసినారు. వేలకొలఁదిగ తూర్యములు, శంఖములు మ్రోగినవి.

రాష్ట్రకూటరాజదూత సవినయముగ సింహాసనమున్న అరుగు దగ్గరికి వచ్చి ఒరనుండి ఖడ్గము దీసి గౌడేశ్వరధర్మపాలదేవుని కాళ్ల దగ్గర ఉంచినాఁడు. వాక్పాలదేవుఁడును, చక్రాయుధుఁడును తమ తమఖడ్గములు తీసి నుదుటి కద్దుకొనినారు. ధర్మపాలదేవుఁడు రాజదూతకత్తిని తననుదుటికద్దుకొని తిరిగి అతని కిచ్చివేసినాఁడు. వెంటనే ఒరనుండి తనఖడ్గమును తీసి వారిముగ్గురికిని అభివాదనము చేసినాఁడు. గౌడేశ్వరునిఖడ్గము పితృదత్తము. అది మొన్నటిఘూర్జరయుద్ధమున విరిగిపోయినది. అయినను అతఁడు దానిని విడిచిపెట్టలేదు. ఇప్పుడాకత్తితోనే అభివాదనము చేసినాఁడు. అది చూచి గౌడసైనికు లందరు కోలాహలముగ జయనాదము చేసినారు. సామరికమర్యాదననుసరించి అభివాదనముకై ఒక్కసారిగా వేలకొలఁదిఖడ్గములు

సూర్యకాంతిలో మిలమిల మెరసిపోయినవి. అనంతరము గాంగేశ్వరుని యాదేశమునననుసరించి అందరును ఆసనములపై కూర్చున్నారు.

సింహాసనవేదికదగ్గర నిలువఁబడి రాష్ట్రకూటరాయబారి 'గాంగేశ్వరా! ధ్రువధారావర్షదేవునిపుత్రుఁడైన గోవిందధారావర్షదేవుఁడే భగవానునికృపవలన ప్రస్తుతము దక్షిణాపథము కంతటికిని అధీశ్వరుఁడు. అతఁడు ఘూర్జరమహాసముద్రమును మథించినాఁడు. ఇప్పుడు తమకు కొంచెము కానుక పంపినాఁడు.' అని మనవిచేసినాఁడు.

వెంటనే మహాప్రతీహారుఁడు సభామంటపము వెలుపటికి వెళ్ళి కానుకలు మోసుకొనివచ్చిన రాష్ట్రకూటపరిచారకులను పిలుచుకొని వచ్చినాఁడు. ఆపరిచారకులు నలుగురు బరువైన నాలుగుపెట్టెలను మోసుకొనివచ్చి వేదికదగ్గర దింపినారు. రాష్ట్రకూటరాజదూత స్వహస్తములతో ఆపెట్టెల మూతలు తీసినాఁడు. ఆనాలుగుపెట్టెలనిండ విరిగిపోయినకత్తులు, శిరస్త్రాణములు లెక్కలేనన్ని ఉన్నవి. అది చూచి గాంగేశ్వరుఁడును సభాసదులునువిస్మృతులైనారు.

వెంటనే భీష్మదేవుఁడు లేచి నిలువఁబడి అభివాదనముచేసి దూతప్రవరా! గాంగసమ్రాట్టునకు తగినసన్మానము నేఁడు జరిగినది. ఇదే వీరులకు తగిన కానుక. మహారాజాధిరాజ గోవిందధారావర్షదేవుఁడు ఘూర్జరసముద్రమథనమున లభించిన రత్నములను మాగాంగేశ్వరునకు కానుకపెట్టినాఁడు.' అని అన్నాఁడు.

గాంగేశ్వరుఁడు వెంటనే సింహాసనమునుండి లేచి మరల అభివాదనము చేసినాఁడు. రాష్ట్రకూటరాజు పంపిన ఆయుష్పూర్వోపహారమునకు జనసంఘమంతయు అభివాదనము చేసినది. గాంగేశ్వరుఁడు తిరిగి సింహాసనముపై కూర్చుండఁగానే రాష్ట్రకూటరాయబారి లేచి 'ధ్రువధారావర్షదేవుని పుత్రుఁడైన గోవిందధారావర్షదేవుఁడు దాసా

నుచానుఁడ నైననాముఖమున ఏలినవారికి కబురుపంపినాఁడు. నాగ భటదేవుని రాజ్యమంతయు స్వాధీనమైనది. భిల్లమాలానగరముకూడ వశమైనవెంటనే తమకడకు మరల దూత రాఁగలఁడు.' అని మనవి చేసినాఁడు.

'మంచిది. దక్షిణాపథేశ్వరునకు మే మెంతో ఋణపడియు న్నాము. అది ఎన్నటికి తీర్చుకొనలేము.'

'మహారాజాధిరాజ గౌడేశ్వరుల మహాసేనానులైన విమల నందియు, జయవర్ధనుఁడును యమునానదికి చర్మణ్వతీనదికినడుమ ఎన్ని మారులో ఘూర్జరసేనలను ఓడించినారు. వారిబాహుబలమువలననే పంచనదమందలి ఘూర్జరనాయకగణము నాగభటదేవునితో సంబం ధము వదలుకొన్నది. రాష్ట్రకూటసైన్యములు నాగభటదేవుని సమస్త రాజ్యమును ఆక్రమించినవి. పంచనదమునకు నూతనసైన్యములను పంపవలసిన దని మామహారాజాధిరాజు ఏలినవారి ననురోధించుచు న్నాఁడు. గాంధారము మొదలుకొని కీరదేశమువరకు జయించినయెడల ఘూర్జరరాజచక్రము వెంటనే గడ్డిగఱచుకొనును.'

'దూతప్రవరా! లక్షకుపైగా సైన్యమును తీసుకొని మావా ణ్ణాలెప్పుడు శీఘ్రమే పంచనద మాక్రమించుటకు వెళ్ళఁగలఁడు.'

'మహారాజాధిరాజ! జయ మగుఁగాక. మామహారాజు ఏలి నవారికడ ఒకప్రార్థన విన్నవించుకొనుచున్నాఁడు. మీరు మామహా రాజునకు మిత్రవరేణ్యులు. ఆతఁడు మీ మ్మొకకోరిక కోరుచు న్నాఁడు.'

'దూతప్రవరా! మీమహారాజు మమ్ము పరిహాసించుచున్నాఁ డని తోఁచుచున్నది. అతనియనుగ్రహమువల్లనే మే మిప్పు డుత్తరాప థమున కర్ణేశ్వరుల మై యుండఁగలిగినాము. అతనియనుగ్రహముచే

తనే భండివంశీయుఁడు నేఁడు కన్యాకుబ్జసింహాసన మెక్కఁగలిగి నాఁడు. అతనిదయవల్లనే ఈసుందరగౌడసామ్రాజ్యము శ్మశానమై పోకుండ నిలచినది. అటువంటిమీమహారాజు నన్ను ప్రార్థింపవల యునా ? '

'మహారాజాధిరాజ ! ఈదాసుఁడు దూతమాత్రుఁడే. ఒక రాజ్యాధీశ్వరుఁడు మరొకరాజ్యాధీశ్వరుని పరిహసించియున్నచో దానిని ఊహించుటకుకూడ మేము తగము. మామహారాజు నిజముగానే ఏలి నవారిని ఒకకోరిక కోరుచున్నాఁడు. '

గౌడేశ్వరుఁడు వెంటనే సింహాసనమునుండి లేచి తలనుండి కిరీటమును, ఒరనుండిఖడ్గమును తీసి రాష్ట్రకూటరాజదూత చేతి కిచ్చుచు 'దూతప్రవరా ! రాజునకు కిరీటముకంటె విలువ గలవస్తువు మరొకటిలేదు. క్షత్రియునకు ఖడ్గముకంటె విలువమైనవస్తువు లేదు. మీమహారాజున కవసరమైనయెడల పితృదత్తమైనఈకిరీటమును, ఘూర్జరయుద్ధమున భగ్నమైనఈఖడ్గమునుకూడ దక్షిణాపథ సింహాసనముముందు సమర్పించఁగలను.'

సభాసదులందరు విస్మితులైపోయి గౌడేశ్వరునిమాటలను, చేతలను లక్ష్యముంచి కనుపెట్టుచున్నారు. అతఁడు కిరీటమును ఖడ్గమును రాజదూతచేతి కిచ్చుట చూచి వారందరు మిన్నగిలిపోవునట్లు జయధ్వనిచేసినారు. రాజదూత కిరీటమును ఖడ్గమును మరల ధర్మపాలదేవునికి సమర్పించి అభివాదనము చేసినాఁడు. తరువాత వినయవి ధేయతలతో చేతులుజోడించి 'మహారాజాధిరాజ ! మామహారాజు కోరిక చాలా సామాన్యమైనది—' అన్నాఁడు.

రాజదూతవాక్యము పూర్తికాకమునుపే సభామంటపద్వార మున పెద్దగోల బయలుదేరినది. సభాసదులుకూడ గల్లంతుపడినారు.

ఒకవంక అల్లరి సద్దుమణఁగకుండనే ధర్మపాలదేవుఁడు రాయబారికేసి చూచి ‘ మీమహారాజుకోరిక ఎట్టిది కానిమ్ము. దానిని మేము తప్పక శిరసావహించి నెరవేర్తుము. ’ అన్నాఁడు.

ఇంతలో ఒకసన్నని ముసలిసన్యాసి సభలోనికి పరుగెత్తుకొని వచ్చి బిగ్గరగా ‘ మహారాజ ! తొందరపడి సర్వనాశము చేయవద్దు. సర్వనాశము చేయవద్దు. ’ అని అరచినాఁడు.

ఆకేక విని ధర్మపాలదేవుఁడు విస్మితుఁడై ‘ ఎవరు నీవు ? ఏమిటి చెప్పుచున్నావు ? ’ అని అడిగినాఁడు.

ఆవృద్ధసన్యాసి సింహాసనవేదికదగ్గరికి వచ్చి తలవంచుకొని ‘ మహారాజాధిరాజ ! నేను విశ్వాసఘాతుకుఁడను. నరఘాతుకుఁడను. బుద్ధభద్రుఁడను. ’ అని అన్నాఁడు.

‘ ఎవరు ? సంఘస్థవిరులా ? ’ అని ధర్మపాలదేవుఁడు చిరునవ్వు నవ్వుచు అడిగినాఁడు.

బుద్ధభద్రుఁడు తలవంచుకొన్నాఁడు. ధర్మపాలదేవుఁడు మరల ‘ మహాశయా ! తమరు గౌడరాజ్యమునకు వచ్చినా రేమి ? ఘూర్జరరాజేమైన దూతగా పంపినాఁడా మిమ్ము ? ’ అని అన్నాఁడు.

ఆవృద్ధుఁడు తలపైకెత్తి ‘ గౌడేశ్వరా ! నీవు బాలుఁడవు. ఈవృద్ధసన్యాసిని వేళాకోళమాడుట నీ కంతమంచిపనిగాదు. నే నిప్పుడు సంఘస్థవిరుఁడను కాను. నరఘాతుకుఁడను. పిశాచమును. భగవానుఁడైనబుద్ధదేవుఁడు నాకు తగినశాస్తి చేసినాఁడు. భవిష్యత్తును నేను తెలిసికొనలేకపోయినాను. ధనాశచే నేను గ్రుడ్డివాఁడనై పోయినాను. అందుచేతనే ఘూర్జరరాజును ఆశ్రయించినాను. వేలకొలఁది నిరపరాధులరక్తప్రవాహములతో ఈయార్యావర్తమును పంకిలము చేసి నాపాపమునకు ప్రాయశ్చిత్త మనుభవించినాను. ఇంకను నన్ను

పరిహసించి లాభమేమున్నది ? మహారాజాధిరాజు వైనను నీవుకూడ సామాన్యునివలె కాలచక్రమునకు దాసుఁడవే. నీయంతటనీవు ముప్పు కొని తెచ్చుకొనకుము. దక్షిణాపథేశ్వరునికోరిక మన్నింపకుము. ఆకో రిక చెల్లించెదనని నీవు వాగ్దానము చేసినయెడల బ్రతికియున్నంతకా లము నీకు శాంతి ఉండదు. ఇది విధిలిపి. ' అని చెప్పినాఁడు.

ఆసమయమున విశ్వానందుఁడు సభలోనుండి లేచి సింహాసన ముదగ్గరికి వచ్చి బుద్ధభద్రునికేసి తిరిగి ' ఏమి చెప్పుచున్నారు సంఘ స్థవిరా ? ' అని అడిగినాఁడు.

బుద్ధభద్రుఁడు విశ్వానందునికేసి కన్నెత్తి చూడనైనచూడక మరల ' నిజముచెప్పుచున్నాను. జ్యోతిష మబద్ధము కాదు. నీ విశ్వాసఘు రాష్ట్రకూటరాజుమాట చెవిఁబెట్టినయెడల నీకు సర్వనాశము జరు గును. ' అని అన్నాఁడు.

గౌడేశ్వరుఁ డతనికేసి చూచి మెల్లమెల్లగా ' సంఘస్థవిరా ! గౌడరాజ్యమునకు శత్రులెవరో మిత్రులెవరో మీరెరుఁగరు. దక్షి ణాపథేశ్వరుఁడు గౌడరాజ్యమునకే గాకు ఆర్యావర్తమున కంతటికిని పరిత్రాత. అతని కియ్యరాని దేమియు లేదు. అతఁ డేదికోరినను తప్పక చెల్లించెద నని నే నిప్పుడే మాట ఇచ్చుచున్నాను. ' అని అన్నాఁడు.

' ధర్మపాలదేవా ! విధి తప్పదు. నే నొకక్షుద్రకీటకమును. కాలగతిని తప్పించుట నాతరమా ! ' అని అశ్రుధనన్యాసి సభామంట పమునుండి మెల్లమెల్లగా వెళ్లిపోయినాఁడు.

కొంచెమునసేపైనతరువాత గౌడేశ్వరుఁడు రాజదూతను ' దూతప్రవరా ! మీమహారాజు ఏమి కోరుచున్నాఁడు ? ' అని అడి గినాఁడు.

'గాఁడేశ్వరా! తమరు రాష్ట్రకూటరాజకన్యను పెండ్లాడి ఆమెను గౌడసామ్రాజ్యపట్టపుదేవిగా చేయవలసిన దని మామహారాజుప్రార్థన.'

పరమేశ్వర, పరమమాహేశ్వర, పరమభట్టారక, పరమసౌగత, మహారాజాధిరాజధర్మపాలదేవుఁ డామాట చెవిసోకఁగానే గాలి తాకున అరఁటిచెట్టువలె నిలువున సింహాసనముమీఁద పడిపోయినాఁడు.

## ౪

### మోక్షమార్గము

ధర్మపాలదేవుఁడు రాష్ట్రకూటరాజదూతను కొలువుకూటమునకు రప్పించి సన్మానించుసమయముననే అంతఃపురమున రాజమాత పెద్దదేవియు, మహాదేవి కల్యాణియు, అమలదేవియు, లోకనాథాలయముముం దున్నమంటపమున కూర్చుండి పౌరాంగనలతో లోకాభిరామాయణము మాట్లాడుచున్నారు. అంతలో ఒకకాపలావాఁడు వచ్చి రాజమాతకు అభివాదనము చేసి 'దేవీ! దేవతాదర్శనార్థము ఒకబౌద్ధసన్యాసి వచ్చి వాకిట వేచియున్నాఁడు. దేవిగారు మంటపమందున్నసంగతి తెలిసి భటు లాతని లోనికి రానీయలేదు. తాను వచ్చినసంగతి దేవిగారితో మనవిచేయవలసిన దని అతఁడు మఱిమఱి చెప్పినాఁడు.' అని మనవిచేసినాఁడు.

'భిక్షువు దేవతాదర్శనమునకు వచ్చుట కభ్యంతర మే మున్నది? అతనిని లోనికి రానీయవలసిన దని నీవు నామాటగా కాపలావాండ్రతో చెప్పు.'

కాపలావాఁడు తిరుగ అభివాదనము చేసి వెళ్లిపోయినాఁడు. రాజమాత మరల పౌరాంగనలతో సంభాషణ మొదలుపెట్టినది. ఆసంభాషణ మంతయు యుద్ధమును గూర్చి. యుద్ధమున గౌడవీరులెందరో చచ్చిపోయినారు. భర్తలు చనిపోయి, పుత్రులు చనిపోయి, బంధువులు చనిపోయి, ఎందరోస్త్రీలు గ్రుడ్లనీరు గుక్కుకొనుచు తమతమ దుర్దశలను రాజమాతతో చెప్పుకొనుచున్నారు. ఆమె కూడ మహాకుమార వాక్పాలదేవుఁడు ఘూర్జరరాజ్యమును ఆక్రమిం

మసంగతులను చెప్పుచున్నది. ఈమారు గౌడసేన కన్యాకుబ్జమును దాటి చాలాదూరము వెళ్ళును. పురాణేతిహాసములలో పేర్కొన్న శతద్రు, విపాశ, ఇరావతి మొదలైన నదులను దాటి సింధుతీరపర్యంతము యుద్ధయాత్ర జరుగును. ఇప్పుడు యుద్ధమునకు వెళ్లువారిలో మరల ఎంతమంది తిరిగి ఇంటిమొగము చూడఁగలరు? చక్రాయుధుని రాజ్యమును ఉద్ధరించుటకై ధర్మపాలదేవుని వెంట వెళ్లినసైన్యములో సగముమందికూడ తిరిగి రాలేదు. తిరిగివచ్చినవారు మగధ గౌడరాఢ దేశముల రక్షణకై ప్రాణముల సమర్పించినారు. రాష్ట్రకూటరాజుతో ఒప్పుటవలన ఆయుద్ధమందు జయము కలిగినది. కాని దేశమందంతట ఏడ్పులు మొత్తుకోళ్ళు తప్ప మరొకటి వినరాలేదు. ఇప్పుడు వాక్పాలదేవుని వెంట పంచనదయుద్ధయాత్రకై వెళ్లినవారందరు తల్లిదండ్రులవద్దను. పెండ్లాముబిడ్డలవద్దను సెలవు తీసుకొని మరి వెళ్ళినారు. ఒకవితంతువు తననలుగురుకొడుకులను యుద్ధమునకు పంపినది. ఘూర్జరయుద్ధమున ఆనలుగురుకూడ చచ్చిపోయినారు. మిగిలియున్న చిన్న కొడుకొక్కఁడుకూడ మహాకుమారుని వెంట యుద్ధమునకు వెళ్ళుటకై తల్లిదగ్గర సెలవుపుచ్చుకొన్నాఁడు. నిర్భాగ్యురాలైన ఆతల్లి ఇల్లు వాకిలి విడిచిపెట్టి రాజమాతకడకు వచ్చి ఉన్నది.

ఆసమయముననే బౌద్ధసన్యాసి లోకనాథాలయమున ప్రవేశించినాఁడు. కొంచెముసేపైనతరువాత కోవెలలోనుండి గంభీరకంఠముతో లోకనాథస్తోత్రము పఠింపమొదలుపెట్టినాఁడు:—

లోకనాథం శశిప్రభం

హ్రీంకారాక్షరసంభూతం, జటామకుటమండితం
వజ్రధర్మ జటాంతస్థం సర్వరోగవినాశకం

వరదం దక్షిణే హస్తే వామే పద్మధరంతథా
లలితాక్షేప సంస్థంతు, మహాసౌమ్యం ప్రభాస్వరం
వరదోత్పలకా సౌమ్యా తారా దక్షిణతఃస్థితా
నందనా దండహస్తంతు, హయగ్రీవోఽధవామతః
రక్తవర్ణో మహాకాదో(?) వ్యాఘ్రచర్మాంబరప్రియః
ఓం, హ్రీం, స్వాహా.

ఈస్తోత్రము వినవచ్చినమాత్రాన ఆడంగులసంభాషణ మాని పోయినది. ఇద్దరుముగ్గురుస్త్రీలు మందిరములోనికి వచ్చి స్తంభముల చాటున నిలువఁబడి ఆసన్యాసి చేయుచున్నపూజను చూడసాగినారు. పూజ సాంతము కాఁగానే సన్యాసి కోవెలబయటికి వచ్చి తలవంచుకొని వెళ్లిపోసాగినాఁడు. ఇంతలో నలుగురుకొడుకులను యుద్ధరంగమునకు సమర్పించిన వితంతువు గబగబ ఆసన్యాసిముందుకు వచ్చి ప్రణామము చేసినది. సన్యాసి నిలువఁబడిపోయి ' అమ్మా ! నీ కేమి కావలె ? ' అని అడిగినాఁడు.

' స్వామీ ! ఈనిర్భాగ్యురాలి నలుగురుకొడుకులు యుద్ధమున మరణించినారు. ఇంక మిగిలిన అయిదవకుమారుఁడుకూడ ఇప్పుడు మహాకుమారునివెంట యుద్ధమునకు వెళ్లుటకై సైన్యములో చేరినాఁడు. ఆకొడు కొక్కఁడైన తిరిగి వచ్చి నాకంటఁబడునా ? '

' ఆసంగతి నే నెట్లు చెప్పఁగలను ? '

' స్వామీ ! మీరు సర్వజ్ఞులు. నేను అనాథను. ఈయుద్ధములతో నాసంసారము చట్టుబండలైపోయినది. నాకొంప నేలమట్టముగ కూలిపోయినది. తలచెడిన ముగ్గురుకోడండ్రు మూఁడుకాళ్లముదుసలినైననేను పదునాలేండ్లబాలుఁడు మాత్రము ఇంటిలో మిగిలియు

నాము. రాజుగారి సెలవుప్రకారము ఆఉన్న ఒక్కకొడుకుగూడ ఇప్పుడు సైన్యములో చేరినాఁడు. నేనాకొడుకును కడుపులో పెట్టుకొని పెంచుకొన్నాను. నాపంచప్రాణములు వానిమీదనే ఉన్నవి. స్వామీ! నాబిడ్డఁడు తిరిగి వచ్చునా? ఒక్కమాట చెప్పండి. మీమాట ఎన్నటికి తప్పదు.' అని ఆవితంతువు సన్యాసిరెండుకాళ్లు పట్టుకొని ఆగుడిచపటారాళ్లకు తలవసి కొట్టుకొనసాగినది. సన్యాసి తొందరతొందరగా ఆమెను చేతులతో లేవనెత్తి 'అమ్మా! అనవసరముగా గుండె చెదరిపోకు.' అన్నాఁడు.

ఆవితంతువు లేచినది. రాతికేసికొట్టుకొనుటవలన ఆమెనుదుటికి పెద్దదెబ్బ తగిలినది. ఆగాయమునుండి నెత్తురు వరదగట్టుచున్నది. ఆమె కట్టుకొన్న తెల్లనికోక ఆనెత్తుటివలన ఎఱ్ఱనైపోయినది. అది చూచి సన్యాసి చాలానొచ్చుకొనుచు 'ఎందు కంతబాధ కొనితెచ్చుకొనెదవు తల్లీ! ఏదీ నీచేయి ఒకమారు చూపు.' అని అడిగినాఁడు.

ఆవితంతువు తనయెడమచేతిని జాపినది. ఆకోవెలమంటపము ముందరిచపటారాళ్లపై కూర్చుండి సన్యాసి ఆమెనుగూడ కూర్చుండుమని చెప్పి చేతిని పరీక్షించ మొదలుపెట్టినాఁడు. ఈవిచిత్రము చూచి కోవెలవెలుపట నున్నస్త్రీ లందరు వచ్చి వారిచుట్టు మూగినారు. అందరును తమచేతులు చూపించుకొనుటకు తొందరపడుచున్నారు. కొంచెముసే పావితంతువు చేతిని పరీక్షించి తరువాత రాతిపై ఏమో అంకెలువేసి లెక్కజూడ మొదలుపెట్టినాఁడాసన్యాసి. అంకగణనము పూర్తికాఁగానే ఒకనిట్టూర్పు విడిచి 'అమ్మా! భయము లేదు. నీ కొడుకు తప్పక తిరిగి వచ్చును.' అని చెప్పినాఁడు.

వెంటనే ఆముసలిది ఆతనికాళ్లమీద పడినది. అక్కడ మూగినస్త్రీ లందఱొక్కరొక్కరుగా వచ్చి ఆసన్యాసికి తమచేతులు చూ

పింప మొదలుపెట్టినారు. రెండుగడియలసేపు ఊపిరిసలుపకుండ వా రందరికి సాముద్రికము చెప్పినాఁడాసన్యాసి. తరువాత అమలదేవి కల్యాణీదేవి చేయిపట్టుకొని సన్యాసిదగ్గరికి లాగుకొనివచ్చి 'స్వామీ! ఈపిల్లయదృష్ట మెట్లున్నదో దయచేసి కొంచెము చెప్పవలెను.' అని అడిగినది.

సన్యాసి కల్యాణీదేవి వామహస్తమందలి రేఖలను పరీక్షించి 'జయము మహాదేవి! తమరు పట్టపుదేవులు.' అని అన్నాఁడు.

'ఈమె కింకను పెండ్లి కాలేదు స్వామీ?' అని నవ్వుచు అమల చెప్పినది.

'అయినప్పటికిని ఈమె పట్టపుదేవియే. తప్పదు. ఈగౌడసింహాసనము మీది. తల్లీ! మీకు సామ్రాజ్యపట్టాభిషేకము జరుగును.'

'దాని కేమిగాని స్వామీ! ముందుముందు ఈమెయదృష్ట మెట్లున్నది?' అని అమల అడిగినది.

'ముందుసంగతి అగోచరముగా ఉన్నది. ఇదమిత్థమని నిశ్చయించి చెప్పలేను. కాని వర్తమానముమాత్రము మహాయోగముగ ఉన్నది. దేవీ! పూర్వజన్మసుకృతమువలన మీ రీబంగారుపుట్టుక పుట్టినారు. మీది కారణజన్మము కాని మరొకటి కాదు. నే నిదివరకు లెక్కలేనన్ని చేతులు చూచినాను. కాని నాజన్మమధ్యమున ఇంతవరకు ఇటువంటిభాగ్యరేఖలు గలహస్తము చూడలేదు. చూడలేను కూడ. ఇట్టిభాగ్యహస్తము మానవదుర్లభము. మీజీవితముకూడ అలౌకికము. అసాధారణము. మీవలన ఈ సామ్రాజ్యవర్గము నిత్యకల్యాణము పచ్చతోరణ మై పోఁగలదు. ఇటువంటిభాగ్యరేఖలు గలవారిదివర కొక్కరే ఈలోకమున అవతరించినారు. అది పదునైదువందల యేండ్లక్రిందటి సంగతి. ఆశాక్యసింహబోధిసత్త్వునిహస్తము పరీక్షించి

ద్ధాభాగ్యగణ మేలక్షణములు చెప్పినారో ఆలక్షణము లన్నియు మీయందు కనఁబడుచున్నవి. ఆగౌతమబుద్ధుఁడు దరిద్రులు, ఆర్తులు, విపన్నులు మొదలైనఅనాథులకొఱకు తనజీవనమును త్యాగముచేసి మహాపరినిర్వాణలాభమును పొందినాఁడు. ఈప్రపంచమునకు మోక్ష మార్గము చూపించినాఁడు. దేవి! ఆనిర్వాణపథము మీది. మీ రిం కను బాల్యమం దున్నారు. కాని జరామరణజన్మరహిత మైనపదవి మీకొఱకు ఎదురుచూచుచున్నది. ఈమాయాజాలమును మీరు దాటిపోఁగలరు. నిర్వాణమార్గమును ఉద్దేశించినపుడుమాత్రము ఈవృ ద్ధభిక్షువును మఱచిపోలేరు.' అని చెప్పుచు చెప్పుచు సన్న్యాసి కల్యాణి రెండుకాళ్లను పట్టుకొన్నాఁడు. అది చూచి అమలదేవి తొం దరపాటున 'అదేమిటి? స్వామీ! అదేమిటి? అయ్యయ్యో! మా బిడ్డకు అశుభము కాదా? ఎంత అఘాయిత్య మైనపని! అభము శుభ మెఱుఁగనిపిల్లదానికాళ్లు పట్టుకొనెద రేమి?' అన్నది.

'ఈ బాలిక సామాన్యురాలు కాదు. ఒకానొకరోజున వందల కొలఁదివృద్ధులు, భిక్షువులు, స్థవిరులు, మహాస్థవిరులు అర్హతులు కూడ ఈమెపాదపద్మములకు నమస్కరింపఁగలరు. తల్లీ! ఇం కెంత లోనో లేదు. సమయము వచ్చుచున్నది. మీమనసు దిట్టపరచు కొనండి. నేను చాలాదూరము నాలోచించి చెప్పుచున్నాను. మీ రిప్పుడు అనంతశూన్యద్వారమునొద్దకు వచ్చినారు. లక్షయోజనముల దూరమం దున్నప్పటికిని నా కాద్వారము కన్నులకు కట్టినట్లు కను పట్టుచున్నది. దేవీ! ఆద్వారము చిరకాలమునుండి మూసియున్నది. ఆత్మత్యాగమే ఆద్వారమును తెఱువఁగలదు. అంతకన్న మఱొకటి లేదు. మీకు పరీక్ష వచ్చినది. మనసు చెదరనీయకండి. బయలు దేరండి. సర్వజ్ఞసిద్ధి పొందిన తరువాత ఈవృద్ధునిమాట మనసులో

ఉంచుకొనండి. జన్మజన్మములకు నేను మీపాదకమలములను దర్శిం చఁగలను.' అని సన్న్యాసి కల్యాణీదేవిపాదములకు ప్రణామముచేసి వెనుకకు తిరిగి చూడకుండ గబగబ వెళ్లిపోయినాఁడు.

అమలయు, కల్యాణియు ఆసన్న్యాసి వెళ్లుచున్న దారికేసి నివ్వెర పడి చూచుచు బొమ్మలవలె నిలువఁబడిపోయినారు. ఇంతలో రాజ మాత అక్కడికి వచ్చి 'ఏమి జరిగినది? అమలా! ఏమిటి సంగతి?' అని అడిగినది.

'దేవీ! ఒకవృద్ధభిక్షువు కల్యాణీదేవికాళ్లకు రెండుమారులు నమస్కరించి ఏవేవో మాటలు చెప్పినాఁడు. మా కేమియు బోధ పడలేదు.' అన్నది.

'ఏమి మాటలు?'

'ఎంతసేపు చెప్పినను మోక్షము. నిర్వాణము. ఇవేమాటలు.'

'ఓఘాయిత్యపుమాట లేమియు అనలేదు గదా?'

'ఏమో? అసలు మా కామాటలు బోధపడలేదు. శుభమో అశుభమో ఏమి చెప్పఁగలము?'

'ఏడి ఆసన్న్యాసి?'

'అదుగో ఆదారినే వెళ్లిపోయినాఁడు.'

అందరును సన్న్యాసికోసము వెదకినారు. కాని ఆతఁడు కానిపిం చలేదు.



౫

మంత్రగృహము.

గౌడనగర రాజప్రాసాదము గంగాతీరమందున్నది. ఆప్రాసాదమందొక గదిలో సంధ్యాసమయమున మహారాజాధిరాజ గౌడేశ్వరుఁడు మంత్రిసామంతాదులతో కూర్చుండియున్నాఁడు. దూరముగా మహాస్థవిరుఁడైన బుద్ధభద్రుఁడొక ప్రత్యేకాసనమున కూర్చున్నాఁడు. అతనిప్రక్కనే చక్రరాజ విశ్వానందుఁడుకూడ కూర్చున్నాఁడు. అందరిముఖములు విచారమువలన వాడిపోయి ఉన్నవి. ఎవ్వరును నోరువిప్పి మాటాడుటలేదు.

గౌడేశ్వరుఁడు చెంపన చేయిపెట్టుకొని సామాన్యమైనకొయ్యకుర్చీపై కూర్చున్నాఁడు. అతనిప్రక్కనే మహాకుమార వాక్పాలదేవుఁడు ఒకస్తంభమును పట్టుకొని నిలువఁబడినాఁడు. గౌడేశ్వరుని కెదురుగా మహామంత్రి గర్గదేవులవారు తలవంచుకొని కూర్చున్నారు. సామంతుల కెదురుగా రాష్ట్రసేనానాయకులైన రణసింహుఁడు, కమలసింహుఁడు, ప్రమథసింహుఁడు కూర్చున్నారు. వారందరివెనుక వృద్ధుఁడైన ఉద్ధవఘోషుఁడున్నాఁడు.

చాలసేపైనతరువాత విశ్వానందుఁడు గౌడేశ్వరునితో 'మహారాజ! ఏదో ఒకటి స్థిరపరచవలెను. ఊరక ఆలోచించుచు కూర్చుండుటకు సమయములేదు. మీప్రత్యుత్తరము వినుటకై ఇప్పుడే రాష్ట్రకూటరాజదూత సభకు రాఁగలఁడు. అతఁడు వచ్చులోపల ఏదో ఒకటి తేలవలెను.' అని అన్నాఁడు.

గౌడేశ్వరుఁడు మెల్లమెల్లఁగా తలపైకెత్తి 'నేనేమి ప్రత్యు

త్తర మీయఁగలరు. నాతల తిరిగిపోవుచున్నది.' అన్నాఁడు.

'రెండే మార్గములు కనఁబడుచున్నవి. ఒకమార్గము సరళమైనది. అనఁగా కల్యాణిని తోడ్కొనివచ్చి రాష్ట్రకూటరాజు కోరికను చెల్లించుట. రెండవమార్గము చిక్కయినది. అనఁగా రాష్ట్రకూటరాజుతో కూడ యుద్ధము. ఘూర్జరులతో యుద్ధము. దానికి ఫలము చక్రాయుధుని రాజ్యనాశనము, ఇన్నేండ్లు పడినశ్రమ నిష్ఫలమైపోవుట. ఇఁక మూఁడవమార్గము లేదు.'

అనుమాట విని సుమతిసింహుఁడు 'మహారాజ! ఈరెండుమార్గములు కాక వేఱొకమార్గము లేదు. విజ్ఞానందులవారిమాట నిజము. రాష్ట్రకూటరాజదూత వచ్చువేళ కావచ్చినది. ఏదో త్వరగా స్థిరపఱచవలెను.' అని అన్నాఁడు.

గౌడేశ్వరుఁడు భీష్మదేవునివైపు ముఖము త్రిప్పి 'తాతగారు! మీరు నాకు తండ్రివంటివారు. ఈవిపత్కాలమున మీరే నన్ను రక్షించవలెను. మొదటినుండి చివరవరకు సంగతిసందర్భములన్నియు మీ రెఱుఁగుదురు. ఏరాత్రి నాతండ్రిగారు గోకర్ణదుర్గమును రక్షించుటకు సిద్ధపడినారో ఆరాత్రియే కల్యాణిని ఆతల్లి నాచేతి కప్పగించినది. నేనే ఆమెను దుర్గమునుండి తప్పించి తీసుకొని పోయినాను. నిర్మానుష్యమైనమహారణ్యమున ఆమెయు, నేనును రెండురోజులు తిరిగినాము. మరలఘూర్జరసేన వచ్చిగోకర్ణదుర్గమును ముట్టడించినప్పుడు కూడ నేనే కల్యాణిని ఆమెతల్లి సెలవుప్రకారము దుర్గమునుండి తప్పించి తీసుకొనిపోయినాను. ఆసమయమున దారిలో శత్రువులు ముట్టడించినారు. ఏమైననేమి దైవయోగమున మే మిరువురము ఆయాపదనుండి బయటఁబడినాము. అప్పుడు కూడ రెండురోజులవరకు ఆమెను నావెంటఁబెట్టుకొని వనమునందు తిరిగినాను. ఆమెగారు పట్టుకొని

బాధించినపుడుకూడ నే నొంటరిగానే ఆమెను రక్షించినాను. చివరకు గురుదత్తుఁడు మమ్ము జెక్కారీనగరమునకు తీసుకొని వచ్చినాఁడు. ఆనగరములోనివా రందరు మ మిద్దరిని దంపతు లనియే అనుకొన్నారు. మంత్రము లుచ్చరించి నే నామెమెడలో మంగళసూత్రము కట్టనిమాట నిజమే. కాని దైవదృష్టికి, ప్రపంచదృష్టికి ఆమె నాధర్మపత్నియే. గౌడసామ్రాజ్యపు పట్టమహాదేవిగానే ఆమెను లోకు లెరుఁగుదురు. నిజముగా తెగని ప్రేమపాశముతో ధర్మదేవత మాయిద్దరిహృదయములను కలిపికట్టినది. ఆ ప్రేమగ్రంథిని లోక మాశీర్వదించినది. దానినిగూర్చి నేను మీ కంతగా చెప్పనక్కరలేదు.

ఇఁక రెండవవిషయమునుగూర్చి పర్యాలోచన చేయవలెను. చక్రాయుధుఁడు భండివంశీయుఁడు. హర్షవర్ధనుని మేనల్లుఁడు. న్యాయరీత్యా అతఁడే కన్యాకుబ్జసింహాసనమున కధికారి. కాని దైవఘటన వలన మహారాజాధిరాజు కావలసినఅతనికి ఎన్నో కారానికష్టములు వచ్చినవి. చివర కతఁడు నాయాశ్రయము కోరినాఁడు. నాతండ్రిగారి దినవారములలోనే నే నాతనికి అభయ మిచ్చినాను. ఆసంగతి మీకు తెలిసినదే. ఆవాగ్దానము నెరవేర్చుటకే వేలకొలఁది గౌడసైనికులప్రాణములను ధారపోసినాను. నిజమునకు ఆకార్యమువలన గౌడదేశమున కెంతో ప్రతిష్ఠవచ్చినది. ధర్మబలమువల్లనే ఘూర్జరు లోడిపోయినారు. కాని బౌద్ధసంఘము చేసినద్రోహమువలన మరల అనుకొనని చిక్కులు వచ్చినవి. చేఁజిక్కినకన్యాకుబ్జరాజ్యము తిరుగ ఘూర్జరుల వశ మైనది. వర్ధమాన, పౌండ్ర, వర్ధనమండలములను లోఁబరుచుకొని ఘూర్జరులు మనలను తరిమివేయుచున్నపుడు దేవునివలె రాష్ట్రకూటరాజు ఆపద కడ్డుపడినాఁడు. అతఁడు చేసినసాయము సామాన్యమైనదికాదు. సరిగా సమయమున కాతఁడు మనలను, మనదేశగౌర

వములను కాపాడినాఁడు. అవి గౌడసామ్రాజ్యమునకు శనిగ్రహాలో జులు. ఆయిబ్బందిలో రాష్ట్రకూటరాజే వచ్చి సాయపడకపోయిన తిం డల సర్వనాశనము జరిగియుండును. కాని భగవత్సంకల్ప మాలాగున లేదు. మనకోసము రాష్ట్రకూటరాజు ఘూర్జరులతోఁడి యుద్ధమునకు దిగినాఁడు. ఆదెబ్బతో, ఘూర్జరులు తిరుగుమొగము పెట్టినారు. ఎదిరించినచోటనెల్ల వారు పరాజితులై పోయినారు. మనసేనలు వారిని వారిరాజ్యపుపొలిమేరలు దాటిపోవువరకు తరిమికొట్టినవి. చాలాకాలమువరకు ఘూర్జరులా దెబ్బ కూడఁదీసుకొనలేరు. మనల మరచిపోలేరు. ఇది యంతయు రాష్ట్రకూటరాజు చేసినసాయము నకు ఫలమే. అతనికి మన మెంతో ఋణపడియున్నాము. అతఁ డేది కోరినను మనము చేతులు కట్టుకొని చేయవలసినదే. దానికి తప్పిన యెడల మనము కృతఘ్నులమై పోదుము. ప్రస్తుతము రాష్ట్రకూట రాజు కోరినకోరిక మరొకస్థితిలో అయినచో నేను తలవంచుకొని శిర వేర్చియుందును. నిజమునకు అతనికోరిక చాలా సామాన్యమైనది. కాని ఇప్పట్లమాత్రి మది అసామాన్యము. ఆకోరిక చెల్లించుటవలన ఉభయరాజ్యములక్షేమమునకు, స్నేహాబంధమునకు చాలామేలు కలుఁ గఁగలదు. కాని ఒక్కటిమాత్ర మాలోచించవలెను. కల్యాణీదేవికి నాకు మంత్రములతో పెండ్లి జరుగకున్నను, మంత్రములకు మంత్ర మైన ప్రేమదేవత మాకు పాణిగ్రహణము చేయించినది. కల్యాణికి తల్లిదండ్రులు లేరు. కావలసినవా రంతకన్న లేరు. ఆదిక్కుమాలిన పక్షివంటిబాలికను నే నిప్పుడు త్రోసిపుచ్చినయెడల ఆమెగతి యేమ గును ? మీ రాలోచించి చూడుఁడు. ఏక్షత్రియుఁడైన ఆమెను పెండ్లా డునా ? మనవిషయమున మన మెట్లు యోజింతుమో ఇతరులవిషయ మునఁగూడ అట్లే యోజింపవలెను. తనకోరికను త్రోసిపుచ్చినా మని

రాష్ట్రకూటరాజు మనకు విరోధి యైపోవును. కాని కల్యాణిని త్రోసి పుచ్చినచో దైవమే మనకు విరుద్ధమైపోవును. ఇది విన్నవారెల్ల మనల నిందింతురు. కల్యాణి కిప్పుడు నాకన్న వేరుదిక్కు లేదు. నే నిప్పు డామెను చేయి విడిచినచో ఆమెపాట్లింక చెప్పనక్కరలేదు. ఏ దెట్లైనను ఆమె నాధర్మపత్ని. నే నామెభర్తను. ఇంతకన్న నేను చెప్పవలసినది లేదు. ఏది కర్తవ్యమో ఇదమిద్ధమని మీరు నిర్ణయించవలెను.' అని చెప్పినాఁడు.

భీష్మదేవుఁ డేమియు మాటాడలేదు. తలవంచుకొని కూర్చున్నాఁడు. అది చూచి సంఘస్థవిరుఁడు లేచి నిలువఁబడి 'మహారాజ! జీవనమున కొక్కటే మార్గము—అది ధర్మమార్గము. మరొకదారి లేదు. రాజుగాదు, ప్రజలుగాదు సర్వజనులు దానికి సమానులు.' అన్నాఁడు.

'స్వామీ! ఆధర్మమార్గ మేదో చెప్పండి. నేను గుర్తెరుఁగ లేకున్నాను.'

'ఆర్తరక్షణమే సర్వోత్కృష్టధర్మ మని సౌగతమతము. కల్యాణి దిక్కులేనిపక్షి. ధర్మానుసారముగ ఆమె నీపత్ని. చక్రాయుధుఁడు నీ కాశ్రితుఁ డనుమాటకూడ నిజమే. కాని అతఁడు పురుషుఁడు. అదిగాక రాజుకూడ. అతఁడు మారినచో ఆరాజ్యమున కింకొకరాజు వచ్చును. అప్పుడు చక్రాయుధునిలోటు కాన్పించదు. అదిగాక అతనికి సహాయపడుట కింకెవ్వరైన సిద్ధపడవచ్చును. ఇంత యెందుకు? ఆరాష్ట్రకూటరాజే తోడుపడవచ్చును. అది సంభవముకూడ. అప్పుడు చక్రాయుధున కట్టిలో టుండదు. కాని కల్యాణివిషయ మటువంటిది కాదు. నీవు త్రోసిపుచ్చినచో ఆమె కింక ప్రపంచమున నిలువనీడ దొరకదు. నీ వామెభర్తవు. నీవు గాక ఆమెకు మ రెవరు దిక్కు?

నీపాదతలమున దప్ప ఆమె కీప్రపంచమున చోటు లేదు. ఆమె తల్లి దండ్రులు లేనిపిల్ల. అనాథ. అసహాయ. అస్వతంత్ర. గౌడేశ్వరా! ఏది ధర్మమో నీ కిప్పుడు తెలియుట లేదా?'

ఆమాట విని భీష్మదేవుఁడు ఆసనమునుండి ఒక్కగంతు వేసి లేచి నిలువఁబడి 'మేలు మహాస్థవిరా! మేలు. నీవు చెప్పినదే సత్యమైనధర్మమార్గము. మహారాజ! ఆధర్మమే క్షత్రియోచిత మైనది. మహాస్థవిరుఁడు జ్ఞానవయోవృద్ధుఁడు. ఆధర్మ మాతనినోటినుండి వచ్చినది. 'పెద్దలమాట పెరుమాళ్లమాట' అనుసామెత మరచిపోకుఁడు. గౌడసామ్రాజ్యమునకు చక్రాయుధునకు ముం దెప్పుడో రానున్న కష్టములను మనసునందు కల్పించుకొని ప్రస్తుతధర్మమును పరిత్యజింపకుఁడు.' అని అన్నాఁడు.

అప్పుడు గౌడేశ్వరుఁడు లేచి నిలువఁబడి 'సామంతులారా! పెద్దలంద రేది ధర్మపథమని చెప్పుచున్నారో నేను ఆమార్గముననే పోవఁదలఁచినాను. నిండుసభలో నిలువఁబడి నే నీమాటనే చెప్పెదను. సభలోని నాయకవర్గమునకు నామాట నచ్చక తప్పక కల్యాణీదేవిని వదలిపెట్టవలసినదని వారు చెప్పినయెడల నేను సామ్రాజ్యక్షేమమునకై గౌడసింహాసనమును పరిత్యజించెదను. కాని నాధర్మపత్నిని నాకల్యాణీదేవిని ఎన్నటికిని పరిత్యజింపఁజాలను. ఆకల్పనముగూడ నా మనసున రానీయను.' అని గంభీరముగ చెప్పినాఁడు.

సభలోనివా రందరు సావధానులై ఆమాటలు విన్నారు. కమలసింహుఁడు గభాలున లేచి సంతోషము పట్టలేక గౌడేశ్వరుని కౌగలించుకొన్నాఁడు. ఒక్కరొక్కరుగా సామంతు లందరు లేచి గౌడేశ్వరుని చుట్టును మూగినారు. ఆమంత్రగృహము కంపించిపోవునట్లు ఒక్కమారుగా జయజయరావము బయలుదేరినది. ఈకోలాహలము

విని 'గౌడేశ్వరుఁడు యుద్ధయాత్ర కనుమతించినాఁ డనుకొని మంత్రగృహముపెలుపట గుమిగూడియున్న సేనాపతులు, సేనానాయకులు కూడ జయనాదములు చేయసాగినారు. కొంచెముసే పైనతరువాత గర్గదేవులవారు లేచి 'మహారాజ! ఇప్పు డీక సభామంటపమునకు వెళ్లవలసిన అవసరము లేదు. రాష్ట్రకూటరాజదూతను ఇక్కడికే పిలువనంపవచ్చును.ఇక్కడనే తమప్రత్యుత్తర మతఁడు వినఁగలఁడు.' అని చెప్పినాఁడు.

గౌడేశ్వరుఁ డందుకు సమ్మతించినాఁడు. మహామంత్రులవారి సెలవుప్రకారము రాష్ట్రకూటరాజదూతను పిలుచుకొనివచ్చుట కొక భటుఁడు వెళ్ళినాఁడు. ఒకగడియసేపటికి రాజదూత మంత్రగృహము నకు వచ్చినాఁడు. సభయంతయు నిస్తబ్ధమై నీరవమై ఉన్నది. గౌడేశ్వరుఁడు సభనడుమ కూర్చున్నాఁడు. అతని కొకప్రక్క మహామంత్రియు, మరొకప్రక్క భీష్మదేవుఁడును ఉన్నారు. రాజదూత వచ్చి కూర్చున్నతరువాత భీష్మదేవుఁ డాతని ఉద్దేశించి 'దూతప్రవరా! పరమేశ్వర, పరమమాహేశ్వర, పరమభట్టారక, పరమసౌగత, మహారాజాధిరాజ సర్వగౌడసామ్రాజ్యాధీశ్వర శ్రీమద్ధర్మపాలదేవుల వారియాజ్ఞానుసారముగ సమ్రాట్సమక్షమున, ఈగౌడసామంతుల సమక్షమున, నేను తమప్రార్థనకు ప్రత్యుత్తర మిచ్చుచున్నాను. మా మహారాజునకుగోకర్ణదుర్గాధ్యక్షునికుమార్తె యైనకల్యాణీదేవితో వివాహము రహితమైనది. యథావిధి కల్యాణముహూర్తము జరుగకున్నను గాంధర్వవిధిని ఆమెను మామహారాజు పరిగ్రహించినాఁడు. క్షత్రియుల లోనవారి కావివాహమే ప్రధానము. మొదట పెండ్లియాడినకన్యయే పట్టమహాదేవి యగుట ఆనూచానముగ వచ్చుచున్నది. ఆయాచారము నతిక్రమించుట మామహారాజున కిష్టము లేదు. రాష్ట్రకూటరాజు

కోరికను చెల్లించలేకపోయినందులకు మామహారాజు చాలా విచారించుచున్నాఁడు. రాష్ట్రకూటరాజు మాకు ప్రాణమిత్రుఁడు. కష్టసమయమున ఆదుకొన్నవాఁడు. అటువంటివాని కల్లుఁడై సన్మానమొందు భాగ్యము మామహారాజునకు లేకపోయినది. అతని ప్రార్థన తిరస్కరించవలసివచ్చినందుకు మా కెంతో బాధగా ఉన్నది. అయినను భగవత్సంకల్పముముందు మానవమాత్రు లెంతవారు! ఏ దెట్లున్నను అధర్మము చేయుట మామహారాజున కిష్టము లేదు. క్షత్రియధర్మము మీమహారాజుగారికికూడ తెలియనిది గాదు. కావున దయచేసి మీరు మీమహారాజుగారితో రాష్ట్రకూటరాజకన్యను పెండ్లాడుట తప్ప మరేది చేయుమనినను గౌడేశ్వరుఁడు చేతులు కట్టుకొని ఆ యాదేశము నిర్వహించగలఁడు.' అని మనవిచేయవలసినది.' అని చెప్పినాఁడు.

సభాసదు లెవ్వరు కిక్కురు మనలేదు. ప్రత్యుత్తరము వినఁగానే రాజదూత గౌడేశ్వరున కభివాదనము చేసి సభ విడిచి వెళ్ళిపోయినాఁడు.



౬

## భీష్మదేవుఁడు.

అనుకొన్నట్లు యథాసమయమున గౌడేశ్వరునివివాహము సలక్షణముగ జరిగినది. కల్యాణీదేవి గౌడసామ్రాజ్యపట్టమహాదేవిగా అభిషిక్తురాలైనది. శుభకార్యము జరిగినవెంటనే లక్షాధికసైన్యము తీసుకొని మహాకుమారవాక్పాలదేవుఁడు పంచనదమునకు యుద్ధయాత్ర చేసినాఁడు. ఇవన్నియు జరిగి ఆరునెలలు కావచ్చినది.

ఈలోపున గౌడసైన్యము గంగాయమునానదులను దాటి శతద్రూవిపాశానదులనడుమ నున్నదేశమును ఆక్రమించినది. శీతకాలము నడచుచుండగా కన్యాకుబ్జమునుండి 'దక్షిణాపథేశ్వరుఁడును, జయవర్ధనుఁడును పూర్తిగా ఘూర్జరులను ఓడించినారు. భిల్లమాలానగరముకూడ వశమైనది. నాగభటదేవుఁడు సామంతుఁడైయుండుట కొప్పుకొని సంధికై దేవులాడుచున్నాఁడు.' అని కబురు వచ్చినది.

వాక్పాలదేవుని బాహుబలమువలన శతద్రూవిపాశాతీరములందు ఘూర్జరులప్రభుత్వము పూర్తిగా విలుప్తమైపోయినది. వందలకొలఁది యేండ్లనుండి పరాధీనులైయున్న కౌరవయాదవవంశీయులైన రాజులు మరల ఈనాటికి తమప్రాచీనాధికారమును పొందినారు. ఆర్యావర్తమార్యావర్తమంతయు గౌడసైనికులయశోగానముతో మారుమ్రోగినది. సైన్యముతోఁగూడ వాక్పాలదేవుఁడు విపాశానదిని దాటి విశాలమైన ఇరావతీతీరమును చేరినాఁడు.

సరిగా ఆసమయమునకు జయవర్ధనునివద్దనుండి గౌడనగరమునకు 'అసంఖ్యాకసైన్యములతో దక్షిణాపథేశ్వరుఁడు కన్యాకుబ్జము

నకు వచ్చినాఁడు. ఉత్తరమున యమునానది, దక్షిణమున నర్మదా నది హద్దుజేసుకొని ఆనడుమనున్న రాజ్యమునుమాత్రము ఘూర్జరు లేలుకొనుటకు నాగభటదేవుఁ డొప్పుకొన్నాఁడు. శీఘ్రముగా సంధి జరుగవలెనని అతనితలంపు. సంధిపత్రముపై సంతకము చేయుటకు వెంటనే గౌడరాజప్రతినిధిని రావింపవలసినదని గోవిందదేవుఁడు తొందరపెట్టుచున్నాఁడు.' అని వార్త వచ్చినది.

భోజ, మత్స్య, కురు, యదు, యవన, గాంధార, కేరదేశములను వాక్పాలదేవుఁడు స్వాధీనము చేసుకొని ప్రాచీనక్షత్రివంశీయులైనరాజులను మరల సింహాసన మెక్కించినాఁడు. గౌడసేనల బాహుబలమున క్షత్రియరాజ్యములు పునఃప్రతిష్ఠితము లైనవి. సంధిపత్రముపై చేవ్రాలుచేయుటకు గౌడరాజప్రతినిధిగా మహామంత్రి గర్గదేవులవారు కన్యాకుబ్జమునకు బయలుదేరి వెళ్లినారు. సరిగా వసంతకాలము వచ్చునప్పటికి ఏండ్లతరబడి జరిగిన ఘూర్జరయుద్ధము ముగిసిపోవు నని జనులందరు భావించినారు.

భీష్మదేవుఁడు మగధకు తిరిగివచ్చినాఁ డనియు, గౌడేశ్వరుని కలసికొనుట కాతఁడు గౌడనగరమునకు వచ్చుచున్నాఁ డనియు హఠాత్తుగా ఒకరోజున కబురు వచ్చినది. ఆవార్త విని ధర్మపాలదేవుఁ డాశ్చర్యపడినాఁడు. వాక్పాలదేవునికి కాపుగా నియమించి పంచనదమునకు పంపినభీష్మదేవుఁ డొంటరిగా తిరిగివచ్చుట కేదో ప్రబలకారణముండియుండు నని అతఁడు శంకించినాఁడు. అతని కేమియు తోఁచలేదు.

ఒకరోజుమట్టమధ్యాహ్నము భీష్మదేవుఁడు రాజప్రాసాదతోరణముదగ్గరికి వచ్చి గౌడేశ్వరుని త్వరగా కలసికొనవలసి యున్నదని కోరినాఁడు. వెంటనే ప్రతీహారు లాతని గౌడేశ్వరుని సన్నిధికి తీసు

కొనివెళ్లినారు. అతనిని చూడఁగానే ధర్మపాలుఁడు లేచి నిలువఁబడి కంపితకంఠముతో ' తాతగారూ ! ఏమిటి సంగతి ? ' అని ఆత్రముగా అడిగినాఁడు.

వృద్ధమహానాయకుఁడు ఆసీనుఁడై నుదుటిచెమట తుడుచుకొనుచు ' వత్స ! మహావిపత్తు దాపురించినది. నాలుగుకాలములపాటు గౌడసామ్రాజ్యము స్థిరపడియుండుట భగవంతుని కిష్టము లేనట్లు తోఁచుచున్నది. ' అని చెప్పినాఁడు.

'ఏమి? ఏమి జరిగినది? మీ రొక్కరే తిరిగివచ్చినా రెందుకు?'

' రాష్ట్రకూటసేన యమునాతీరమందలి తీర్థక్షేత్రములను వశపరచుకొనుచున్నట్లు నా కిరావతీతీరమం దుండఁగా తెలిసినది. లక్షకుపైగా రాష్ట్రకూటసైన్యము స్థాణేశ్వరపృథూదకదుర్గములను ఆక్రమించుకొనియున్నది. అంతకన్న ఎక్కువసైన్యముతో రాష్ట్రకూటరాజ మహారుఁడైన శక్కదేవుఁడు మధురయందు దండువిడిసియున్నాఁడు. కన్యాకుబ్జమందలి రాష్ట్రకూటసైన్యముకూడ యుద్ధసన్నాహముమీద ఉన్నది. పంచనదమందలియుద్ధయాత్ర ఇంకను ముగియలేదు. అక్కడ నుండి వాక్పాలదేవుఁడు తిరిగివచ్చుట కుపాయము లేదు. జయవర్ధనుఁడును, విమలనందియు భిల్లమాలానగరమం దుండిపోయినారు. ఘూర్జరరాజు సెలవులేకుండ వా రక్కడనుండి మరలివచ్చుటకు వీలులేదు. ఇఁక గౌడనగరమున నీ వొంటరివాఁడవు. అందుచేతనే ప్రమథసింహుఁడును, కమలసింహుఁడును న న్నిక్కడికి పంపినారు. రాష్ట్రకూటుల కిప్పు డీయుద్ధసన్నాహ మెందుకు ? ఉత్తరాపథమున గాని, దక్షిణాపథమునఁ గాని శత్రు వన్నమాట మరి లేదు. కోరలు తీసిన పామువలె నాగభటదేవుఁడు కట్టువడిపోయినాఁడు. చక్రాయుధుఁడు కూడ గోవిందదేవుని చేతిలో జిక్కియున్నాఁడు. ఇఁక రాష్ట్రకూటుల

కిప్పు డీయుద్ధసన్నాహమంతయు ఎందుకోసమో తెలిసికొనుట యంత కష్టమైనపని గాదు. వత్సా! ఎట్టిచిక్కు దాపురించినదో చూచి నావా? గౌడసైన్యము యావత్తు మాళవమందు, పంచనదమందు ఉండిపోయినది. ఇప్పుడు రాష్ట్రకూటరాజు దండెత్తి వచ్చి గౌడదేశ మును ఆక్రమించినయెడల ఈసామ్రాజ్యమును రక్షించువా రెవరు?'

'గోవిందదేవుఁ డింతలో ఇంతగా మారిపోవుటకు కారణము?'

'రాష్ట్రకూటరాజకన్యను పెండ్లియాడుటకు నీవు తిరస్కరించి నమాట అప్పుడే మరచిపోయినావా?'

'లేదు. మరచిపోలేదు.'

'రాష్ట్రకూటరాజకన్యను పెండ్లిచేసుకొనవలసిన దని గోవింద దేవుఁడు తనంతటతాను నోరువిడిచి నిన్ను కోరినాఁడు. నీ వాకోరి కను త్రోసిపుచ్చినావు. ఈసంగతి ఉత్తరాపథమున, దక్షిణాపథమున ఊరూర వ్యాపించినది. ఈపరాభవమును రాష్ట్రకూటరాజు మరచి పోలేదు. గోవిందదేవుఁడు సామాన్యుఁడు కాడు. అతఁడు కూటనీతి కుశలుఁడు. ఘూర్జరులయొత్తిడి ఉన్నంతకాలము అతఁడు మనతో విరోధము పెట్టుకొనలేదు. స్నేహముగా నున్నట్లే నటించినాఁడు. ఘూర్జరయుద్ధ మిప్పుడు ముగిసిపోయినది. అదిగాక గౌడసైన్యమం తయు ఇప్పుడు దేశాంతరమం దుండిపోయినది. నీదుర్బలస్థితి చూచి రాష్ట్రకూటరా జిప్పుడు తనకసితీర్చుకొనుటకు పూనుకొన్నాఁడు. వత్సా! ఇది మనకు విషమపరీక్ష. ఈపరీక్షలో మనభవిష్య త్తున్నది. ఈమాటు బాలకులను వృద్ధులను వెంటబెట్టుకొని సామ్రాజ్యమును రక్షించుటకై యుద్ధము చేయవలెను. అందుకోసమే ఈవృద్ధుఁ డిప్పు డిక్కడికి వచ్చినాఁడు.'

'తాతగారూ! నిరర్థకముగ బలక్షయము చేసుకొని ప్రయో

జనము లేదు. నేను సింహాసనమును విడిచిపెట్టెదను. వాక్పాలదే వుఁడు సింహాసన మెక్కవచ్చును. అతఁ డవివాహితుఁడు. నిరభ్యం తరముగ రాష్ట్రకూటరాజకన్యను పెండ్లాడి అతఁ డామెను పట్టమహా దేవిగా గౌడసింహాసనమున కూర్చుండఁబెట్టవచ్చును.'

'నాయనా! అంతమాత్రాన ఈచిక్కు వదలిపోదు. రాష్ట్ర కూటరాజకన్యను పట్టమహాదేవిగా చేసినయెడల గోవిందదేవునకు ఆగ్ర హము తీరునా? తీరదు. కన్యాకుబ్జమం దంతట రాష్ట్రకూటులు ధీరాలు తీయుచు పరవళ్ళు త్రొక్కుచున్నారు. 'ధర్మపాలునిపాగ రణఁచవలెను. ఆరాధసామంతకన్యను గౌడసింహాసనమునుండి లాగి పారవేయవలెను.' అని వారు పంతాలాడుచున్నారు. రాష్ట్రకూట రాజకన్యను పెండ్లిజేసుకొననందులకు గౌడేశ్వరునకు తగినప్రాయ శ్చిత్తము జరుగవద్దా మరి?'

'అయితే యుద్ధమే మరి.'

'అవును. వత్సా! యుద్ధము తప్పదు. అంతుపొంతులేని రాష్ట్రకూటసైన్యములతో ఈమారు బాలకులు, వృద్ధులు యుద్ధము చేయవలెను. వృద్ధులు యుద్ధము చేయుచున్నప్పుడు వృద్ధుఁడుగాక మ రెవ్వరుసేనలను నడపఁగలరు? అందుకే పంచనదమునుండి ఈవృ ద్ధుఁడు పరుగెత్తుకొని వచ్చినాఁడు. చూడు! వత్సా! నేను కాలము చెల్లినవాఁడను. ఇప్పుడు ప్రభుసేవయం దాత్మార్పణము చేసెదను.'

ఈమాటలు చెప్పునప్పు డావృద్ధునికన్నులనుండి రెం డశ్రుబిం దువులు పాలిపోయినచెక్కులమీదుగా జారి మంచుగడ్డవంటి తెల్లని మీసకట్టుపైఁ బడినవి. ధర్మపాలదేవుఁ డేమియు మాటాడలేకపోయి నాఁడు. గుభాలున ఆభీష్మదేవుని కాళ్ళపైఁ బడినాఁడు. భీష్మదేవుఁడు రెండు చేతులతో పట్టుకొని ఆతని లేవనెత్తి 'విచార మెందుకు నాయ

నా ! రోజు వచ్చినది. ఈయవసానకాలమందు గోపాలదేవునిపుత్రుఁడ
వైనసీకోసము ప్రాణము లర్పించుటకన్న నాకు మరొకగౌరవ మేము
న్నది ? ఆలస్యము చేయుటకు వీలులేదు. బయలుదేరవలెను. అయి
దువేలసైన్యముతో లక్షలసైన్యము నెదుర్కొని నిలుపవలెను. శోణ
తీరమున మండలాదుర్గపుకొండలోయకన్న గౌడసామ్రాజ్యమునకు
మరొక వీలైనయుద్ధరంగము లేదు. ఘూర్జరయుద్ధమం దెన్నిసారులో
నేను దానిని పరీక్షించి చూచినాను! స్వల్పసైన్యముతో శోణతీర
మును కాపాడుట అసంభవము. నేను మగధసైన్యమును యావత్తు
కూడఁగొట్టి మండలదుర్గమం దుంచివచ్చినాను. గౌడరాష్ట్రమం దెవ
రెవ రున్నారో, మాతృభూమిని రక్షించుట కెవరెవరు ప్రాణము
లర్పించుటకు సంసిద్ధులో, వారినందరిని నావెంట పంపించు. వత్సా !
ఇప్పుడు రాష్ట్రకూటసైన్యము వారణాసియం దున్నది. వారణాసికి
మండలాదుర్గమున కెంతో దూరము లేదు. నేను రేపే బయలుదేరి
పోవలెను. ఆలస్య మెంతమాత్రమును కూడదు. '

' తాతగారూ ! మీ రిదివరకే పంచనదమండలియుద్ధయాత్రవ
లన పూర్తిగా శ్రమపడియున్నారు. ఇప్పుడు మరల వెంటనే మిమ్ము
యుద్ధమునకు పంపినయెడల లోక మేమనుకొనును ? నేను పదుఁడు
వాఁడను. నేను జీవించి యుండి మి మ్మొక్కరిని యుద్ధమునకు పంపి
నానని ఆర్యావర్తమంతయు చిరకాలమువరకు నాదుష్కీర్తిని ఘోషిం
చును. '

' చూడు ! వత్సా ! ఈవృద్ధుఁడు సిద్ధపడి వచ్చినాఁడు. నీవును
నేనును తప్ప గౌడదేశమున ఇప్పుడు మరొకనాయకుఁడు లేడు. మన
యిరువురిలో ఒకరు ద్వారమును రక్షించవలెను. మరొకరు గౌడదేశ
మును రక్షించవలెను. నేను మగధదేశనాయకుఁడను. ఎక్కడనను

మగధను రక్షించుట నాపని. నీవే మండలాదుర్గమును రక్షించుటకు సిద్ధపడినయెడల ముప్పు రావచ్చును. నీకు ముప్పువచ్చినచో గౌడసామ్రాజ్యమున కిఁక నీళ్ళు విడువవలసివచ్చును. కావున తోరణరక్షణార్థమై మండలాదుర్గమునకు నేనే పోవలెను. నే నొకవేళ చనిపోయినను నీ వుండఁగలవు. అనవసరముగా మాటలతో కాలక్షేపము చేయవద్దు. శీఘ్రముగ బయలుదేరవలెను. తిరిగివచ్చుట కాశించని వారి నందరిని నాతో పంపు.'

భీష్మదేవుఁడు మరి మాటాడలేదు. సెలవుతీసుకొని గబగబ వెళ్ళిపోయినాఁడు. ధర్మపాలుఁడు విషణ్ణవదనముతో ఆగడికిటికీదగ్గర నిలువఁబడిపోయినాఁడు.

చూచుచుండఁగానే ఈయుద్ధవార్త గౌడనగరమందంతట వ్యాపించిపోయినది. ప్రజలందరు విషాదమగ్నులైనారు. అప్పటికిని గౌడులలో జీవము చావలేదు. చావు తప్పదని ఎరిగియుండియు వందలకొలఁది వృద్ధులు, వికలాంగులు, వచ్చి రాజప్రాసాదముముందు గుమిగూడినారు. వృద్ధమహానాయకునిపిలుపు వినియే వారందరు సైన్యములో చేరినారు. వారికి ప్రాణములపై తీపిలేదు. తిరిగి ఇంటికి వత్తుమను ఆశ అంతకన్న లేదు. మరణమునకు వెరువక వారందరు భీష్మదేవుని వెంట సామ్రాజ్యతోరణమును రక్షించుటకై బయలుదేరినారు. భీష్మదేవుఁడు మహోత్సాహముతో వారిముందు నడచినాఁడు.

# ౭

## ఆహ్వానము

గౌడసామ్రాజ్యమునకు పట్టాభిషిక్తురాలైనను కల్యాణికి సంతోషము లేదు. తనమూలముననే ధర్మపాలుడు మరల రాష్ట్రకూటులతో యుద్ధమునకు దిగినాడని ఆమె తలంచినది. ఎవరెవరు యుద్ధమునకు వెళ్లినారో, ఇంకను ముందు వెళ్లనున్నారో, వారివారి స్వజనులు, ఆత్మీయులు పైకేమియు వెల్లడింపకున్నను లోలోపలమాత్రము తన్నాడిపోసుకొనుచుందురని ఆమె యనుకొన్నది. ఈయూహలు తోచినమాత్రాన ఆమె లోలోపల కుమిలికుమిలిపోసాగినది. తలచెడినపడుచులు, గర్భశోకాతురలైనతల్లులు, దిక్కులేనిపిల్లలు, ప్రతిదినము తనపై తిట్లవర్షము కురియుచున్నారని తెలిసినతరువాత ఆమె కింక సంతోష మెక్కడిది?

చావు తప్పదని నిశ్చయపరచుకొన్న వారందరు గౌడమండల ద్వారమును రక్షించుటకు భీష్మదేవుని వెంట మండలదుర్గమునకు వెళ్లినారు. వారందరు దాదాపుగ అయిదువేలమందికన్న ఎక్కువ లేరు. మిగిలినసైన్యముతో ధర్మపాలదేవుడు గౌడనగరము కాపాడుటకు సన్నాహము చేయసాగినాడు. యుద్ధమునకు పనికివచ్చువారినితప్ప తక్కిన వృద్ధులను, బాలకులను, అబలలను అందరిని దూరగ్రామములకు పంపివేసినాడు. మూడేండ్లకు సరిపోవు ఆహారపదార్థములను జాగ్రత్తపెట్టించినాడు. నగరప్రాకారము దాటి బయటికి వెళ్ళవలసిన అవసరము లేకుండ గంగానదినుండి, యమునానదినుండి నగరములోనికి నీరు వచ్చు కొళ్లాయీలు పెట్టించినాడు. నగరరక్షణకు కావలసిన

ఏర్పాట్లన్నియు జరిగినవి. ఏ దెబ్బ యెందునో యని రాజకుటుంబమును కూడ మరొకచోటికి పంపుట మంచిదని అతనికి తోచినది. వెంటనే రాజమాతను, పట్టపుదేవిని ఉత్తరరాఢదేశమందలి డెక్కారీదుర్గము నకు తీసుకొనిపోవుటకు నిశ్చయపరచినాఁడు. సరిగా ప్రయాణసమ యమునకు వా రిరువురు ముట్టడికాలమున నగరము వదలిపెట్టిపోవు టకు సమ్మతింపలేదు. ఎంతచెప్పినను వారు వినకుండుటవలన ధర్మ పాలుఁ డాప్రయత్నమును మానుకొన్నాఁడు. ఏ దైనను చివరకు మండలాదుర్గరక్షణార్థమై రెండవసేనను కూర్చుకొనుట మంచిదని ఆతనికి తోచినది. వెంటనే సైనికులను కూడఁగొట్ట మొదలుపెట్టినాఁడు.

రెండవసేనాదళముకూడ కూడినది. ఆ సైనికు లందరు కలసి మొత్తము రెండువేలకన్న ఎక్కువమంది లేరు. ఆ సైనికులను వెంటఁ బెట్టుకొని ధర్మపాలుఁడు స్వయముగా సేనానాయకుఁడై మండలా దుర్గమునకు బయలుదేరినాఁడు.

ఆసమయముననే కల్యాణి మేడపైయంతస్థున నిలువఁబడి యు ద్ధమునకు పోవుచున్న ఆ సైన్యమును రెప్పవేయకుండ చూచుచున్నది. ఆ సైనికలాంఛనములను, ఆధ్వజములను చూచినకొలఁది ఆమెకు మన సులో ఆవేదన పుట్టినది. కావిచీకట్లవలె క్రమ్ముకొనుచున్న పెంధూళి తెరలు చెదరిపోవునట్లు ఒకపెద్దనిట్టూర్పు విడిచిన దామె.

ఆసమయముననే వెనుకనుండి అమలాదేవి వచ్చి ఆమెబుజము పై చేయి వేసినది. హఠాత్తుగా నిద్రమేల్కొన్నట్లు త్రుళ్ళిపడి వెను కకు తిరిగిచూచిన దామె. ఆమె కంగారు చూచి నివ్వెరపడి అమల నెమ్మదిగా 'మహాదేవి! ఆలోచించుచు నిలుచున్నలాభ మేమిటి? స్నానము చేయుటకు రండి!' అని అన్నది.

'అక్కగారూ! మీరు నన్ను మహాదేవి అని పిలువకండి.

ఆమాట విన్నప్పుడు నాకు తలకొట్టివేసిన ట్లగును.’

‘అయితే ఏమని పిలువమనెదరు ?’

‘ఏమి ? కల్యాణి అని పిలువండి.’

‘బాగున్నది వరుస ! ఎవ్వరైన విన్న నవ్విపోదురు.’

‘పేరుపెట్టి పిలువనే గూడదా ?’

‘మిమ్ము పేరుపెట్టి పిలిచినయెడల లోకము నన్ను పిచ్చిదాన ననుకొనును.’

‘ఎందుకు ?’

‘గౌడసామ్రాజ్యపట్టమహాదేవులు మీరు. బొడ్డుకోసి పేరు పెట్టినట్లు ‘కల్యాణి’ అని నేను మిమ్ము పిలువనా ? పిచ్చిపిచ్చిమాటలు చెప్పకండి నాకు.’

‘అక్కా ! మహాదేవి యని న న్నెవ్వరైనపిలిచినప్పుడు నా హృదయమున ఏదో అగ్నిద్రావకము పొంగిన ట్లగును. నాకోసమే నాయత్తవారింటి కింత ముప్పువచ్చినది. నాభర్త కిన్నిపాట్లు వచ్చినవి. రాజ్యమంతయు ఆలుగోలు బాలుగో లైపోయినది. నాప్రాణముల కుసూరుమని లక్షలకొలందిసైనికులు నాశనమైనారు. కడుపుశోకమున కన్నతల్లులు, కాపురములు గద్దలైపోయి పడుచులు, తలచెడి యిల్లాండ్రు, దిక్కుమొక్కులేక బిడ్డలు నామూలమున అలోలక్ష్మణా యని ఏడ్చుచున్నారు. ఈయుసురు నాకు తగులకుండ పోవునా ? ఇంటింట ప్రతిదినము ఎంద రనాథలు నన్ను తిట్టిపోయుచున్నారో ? అక్కా ! నాయత్తవారింటికి నేను శనిగొట్టుదేవతవలె దాపురించినాను. ఈయ నర్థముల కన్నిటికి ఈమహాదేవిపేరే గదా కారణ మని తోచినప్పు డెల్ల నాగుండెలు నిలువున తగులబడిపోవును.’

‘ఛీ ! ఏమిమాట లివి ! ఆపెమూర్ఖపుమాట లనకండి. ఛీ

రు. ఎవరైన విన్న నవ్విపోదురు. మీరీరాజ్యమునకు లక్ష్మీదేవివంటి వారు. లెండి స్నానమునకు! అప్పుడే బారెడుప్రొద్దెక్కినది. పూజ కాలస్యమైపోవును. మీయత్తగారు మీకోసము కనుపెట్టుకొన్నది. లెండి స్నానానికి.'

కల్యాణి మాటాడకుండ అమలవెంట మేడ దిగి వచ్చినది. వెంటనే దాసీలతో, కాసాలతో, ఆమె గంగాస్నానమునకు బయలు దేరినది. ఊరిలోనిసమస్తైదువలు చాలామంది ఆమెవెంట బయలుదేరి నారు. ఏఘట్టమున ధర్మపాలదేవుఁడు చక్రాయుధున కాశ్రియ మిచ్చి నాఁడో ఆఘట్టమునకే వారందరు స్నానముచేయుటకు నీటదిగినారు. అందరికన్న ముందుఁగా పట్టమహాదేవి స్నానమైనది. తడిబట్టలతోనే ఆమె గట్టుమీదికి వచ్చి నిలువఁబడినది. ఆగట్టుప్రక్కనే ఒకమామిడితో పున్నది. దానిలోనుండి ఒక నల్లనిగుడ్డిపిల్లవాఁ డామెదగ్గరికి వచ్చి 'అమ్మా! ఎక్కడున్నావమ్మా!' అని పిలిచినాఁడు.

ఆపిల్లవానిని చూచి కల్యాణీదేవి నివ్వెరపడి 'ఎవరు నాయనా నీవు?' అని అడిగినది.

'నేను కండ్లులేని కబోదిని.'

'ఏమి కావలెను నాయనా నీకు?'

'ఏమీ అక్కరలేదు. నీవుమాత్రము కావలెను. నిన్ను చూచుటకే నేను వచ్చినాను. నీ వెప్పుడు వెళ్లెదవమ్మా?'

'ఎక్కడికి నాయనా?'

'జరామరణదుఃఖములు లేనిచోటికి.'

'బాబూ! ఆచో టెక్కడ?'

'నాకు తెలియదు. అక్కడి కందరు వెళ్ళలే రని, నీవుమాత్రము వెళ్ళఁగలవని ఎవరో చెప్పినారు.'

'నీ వెవరు నాయనా ?'

'నేను గ్రుడ్డివాఁడను.'

'నీపే రేమిటి బాబూ ?'

'కొందరు గ్రుడ్డీ యని, కొందరు కబోదీ యని పిల్తురు. అంత కన్న నాకు మరొక పేరు లేదమ్మా!'

'నీ కెవరైన ఉన్నారా బిడ్డా ?'

'నీవంటి తల్లు లున్నారు. తండ్రు లున్నారు.'

మాట్లాడుకొనుచు మాట్లాడుకొనుచు వారుభయులు గంగా తీరమందలి మామిడితోటలోనికి వచ్చినారు. మహాదేవి వచ్చుట చూచి ఆతోటకాపరులు దూరముగా తప్పుకొన్నారు. ఒకపెద్దమామిడిబోదెచాటున నిలువఁబడి కల్యాణీదేవి 'శోకముగాని దుఃఖముగాని లేని ఆదేశ మెక్కడున్నది బాబూ?' అని ఆగ్రుడ్డిపిల్లవానినిఅడిగినది.

'ఆదేశ మేవైపున ఉన్నదో నే నెరుఁగను. కాని ఉన్నదని మాత్ర మాయన చెప్పినాఁడు.'

'ఆయన ఎవరు ? బాబూ ?'

'ఆయన ఒకరు, ఆయన ఎటువంటివాఁడో నాకుకూడ తెలియదు. ఆయనకు రూపరసగంధాదులు లేవు. కాని ఆయన ఉన్న మాటమాత్రము నిజము. ఎవఁ డంధులకు దారిచూపించుచున్నాఁడో కాలికి ముల్లుగూడ గ్రుచ్చుకొనకుండ ఎవఁడు కాపాడుచున్నాఁడో, సేవకునివలె ఆఁకటి కన్నము, దాహమునకు నీరు, దయచేసి ఎవఁడు ఆదుకొనుచున్నాఁడో, అతఁడే నేను చెప్పినవాఁడు. అతనిని నేను చూడలేదు. ముట్టుకొననైన ముట్టుకొనలేదు. ఎండుటాకుల గలగల వలె దూరమునుండి అతనిమాటమాత్రము నాకు వినవచ్చును. నేను విన్నానే కాని ఎప్పుడును చూడనుమాత్రము చూడలేదు.'

‘ఆయన నీతో ఏమి చెప్పినాఁడు బాబూ!’

‘నీవు గంగాస్నానమునకు వచ్చినావని’

‘ఆయన నిన్ను పంపినాఁడా?’

‘లేదు. నన్ను తీసుకొనివచ్చినాఁడు. స్నానముచేసి పైకి రాఁగానే నీతో ఈమాటలు చెప్పమన్నాఁడు’

‘ఏమని బాబూ?’

‘నీవు శీఘ్రముగా నీదేశమునకు వెళ్ళవలెను. అక్కడికి సింహాసనము వట్టిదై యున్నది. నీవు వెళ్ళి ఆసింహాసనముమీాద కూర్చుండవలెను. నిన్ను తీసుకొనివెళ్లుట కాయన వచ్చును. నీవు పోయినచో నీభర్తకు తీరనిమనోవ్యధ కలుగును. నీతండ్రినాటి వృద్ధభృత్యుఁడొకఁడున్నాఁడు. అతనికికూడ నీవుపోయినచో ఎక్కడలేని మనోవ్యధ కలుగును. కాని నీవుమాత్రము వీటికి బాధపడవద్దు. లోకకల్యాణముకోసము నీ వవతరించినావు. నీదేహత్యాగమువలన ప్రపంచోద్ధారణ కాఁగలదు. నీజన్మజన్మాంతరాల సుకృతము గౌడసామ్రాజ్యమునకు శ్రీరామరక్ష కాఁగలదు. దేశమున దుఃఖమన్నమాట యుండదు. కడుపులో చల్ల కదలకుండ ప్రజలు సుఖింతురు. నీ కేమియు భయము లేదు. నీకాలికి ముల్లుకూడ గ్రుచ్చుకొనదు. అమ్మా! ఈదేశము నీకు గాదు. ఈజగత్తే నీది కాదు. నీజగత్తు నీకోస మెదురు చూచుచున్నది. ఈలోకమున దుఃఖము, కష్టము తప్ప మరేమియు లేదు. త్వరగా నీవు నీరాజ్యమునకు వెళ్ళిపో తల్లీ!’

‘వెళ్ళెదను నాయనా! నేను వెళ్ళినయెడల నాయత్తవారి కుటుంబమునకు పట్టినశని తొలఁగిపోవునా? మరల గౌడరాజ్యమునకు శాంతి కలుగునా? ప్రజలకష్టములు తీరిపోవునా? ఇది నీ వతనిని అడుగు తండ్రీ!’

'అమ్మా! ఆమాటకూడ ఆయనే చెప్పినాఁడు. ఏరోజున నీ వాత్మార్పణ చేయుదువో ఆరోజుననే ఈప్రపంచమునకు శాంతి కలుగును. నీపుణ్యోదకధారచే ఈయగ్ని చల్లారిపోవును. అమ్మా! నీవు వెళ్ళిపో. నీతో నేనుగూడ వచ్చెదను. అదుగో! ఆయన పిల్చుచున్నాఁడు. నేను పోయెదను.'

ఎక్కుపెట్టి విడిచిన బాణమువలె ఆగ్రుడ్డిపిల్లవాఁడు పరుగెత్తిపోయి మాయమైనాఁడు. కల్యాణీదేవిమాత్రము నిలువున రావియాకువలె కంపించిపోవుచు ఆచెట్టుచాటున అట్లే నిలువఁబడిపోయినది.

ఆసమయమున విశ్వానందుఁడు పిచ్చివానివలె పరుగెత్తుకొని వచ్చి గట్టుమీఁద నిలువఁబడి నాలుగువంకల వ్యస్తభావముతో చూడసాగినాఁడు. దూరముగా ఒకకాసావాఁడు నిలువఁబడియున్నాఁడు. వానిని చూచి విశ్వానందుఁడు తడబాటుగొంతుతో 'ఇక్కడ గ్రుడ్డిపిల్లవాఁడెవఁడైన నీకు కనఁబడినాఁడా?' అని అడిగినాఁడు.

'ఎందుకు స్వామీ? ఎవరు కాన్పించలేదు'

'పట్టమహాదేవి ఎక్కడ ఉన్నది?'

'స్నానముచేసి ఇప్పుడే మామిడితోటలోనికి వెళ్ళినారు'

విశ్వానందుఁడామాట విని గబగబ కేకలు వేసి పరిచారకులను పిలిచినాఁడు. అతని సెలవుప్రకారము, దాసీలు, కాసాలు, నగరిలోని ముత్తైదువలు మొదలైనవారందరు కల్యాణిని వెదకుటకై పరుగెత్తినారు. అందరికన్న ముందుగా విశ్వానందుఁడు ఆమామిడితోపులోనికి వెళ్ళి తీయమామిడిబోదెచాటున నిలువఁబడిపోయియున్న కళ్యాణిని చూచినాఁడు. వేతసీలతవలె కంపించిపోవుచున్న ఆమెనుచూచి విశ్వానందుఁడు 'ఏమి జరిగినది తల్లీ!' అనిఅడిగినాఁడు.

కల్యాణి జవాబు చెప్పకుండ కన్నులు తుడుచుకొన్నది. అది చూచి అతనికి మరింత తొందర పుట్టి 'అమ్మా! దక్షిణాపథము నుండి తిరిగి వచ్చునప్పుడు నే నొక గ్రుడ్డిపిల్లవానిని వెంటఁ బెట్టుకొని వచ్చినాను. ఆకుఱ్ఱవాఁ డేమైన నీదగ్గరికి వచ్చినాఁడా?' అని అడిగినాఁడు.

'అవును తండ్రీ! వచ్చినాఁడు.'

'అయ్యో! క్రొంపమునిఁగినది. కల్యాణీ!'

'అయ్యో!'

'వాఁడు నీ కేమైన చెప్పినాఁడా తల్లీ!'

'శుభవార్త చెప్పినాఁడు. నాకాహ్వానము వచ్చినదఁట! నాయత్తవారి కులమునకు, నాభర్తకు, గౌడరాజ్యమునకు, గౌడప్రజలకు, శుభము కలుగుటకై నేను వెళ్ళిపోవలెను. నేను వెళ్ళిపోయినచో జగత్కల్యాణము జరుగునఁట! తండ్రీ! నేను మూఢురాలను. మోహాంధను. అక్కడికి వెళ్ళిపోవుటకు నాకు మీరే దారిచూపవలెను.'

ఆమాట విని ఆవృద్ధ సన్యాసి బాలకునివలె గొంతెత్తి ఏడ్వ మొదలుపెట్టినాఁడు. వెక్కివెక్కి యేడ్చుచు అతఁడు 'దారి యెక్కడికి తల్లీ! నీ కాహ్వాన మెక్కడనుండి వచ్చినదమ్మా! ఈమువ్వకాలమున నాకుకూడ తెలియని దేశము నీ కెందుకమ్మా! ఈరాజ్యము, ఈసింహాసనము, ఈమహాదైశ్వర్యసంపత్తి, ఈదైవసమానుఁడైన భర్త, వీటి నన్నిటిని వదలిపెట్టి ఎక్కడికి పోయెదవమ్మా!' అని అన్నాఁడు.

షష్టిపూర్తియైన అవృద్ధసన్యాసి రోదనము ఆగాలిలో కలసి పోయినది.

---

౨

## మండలాదుర్గయుద్ధము.

ఒకప్రక్క గంగానది. మఱొకప్రక్క గగనచుంబి యైనవింధ్య పర్వతము. ఆరెంటినడుమనుండి సంకీర్ణమార్గము. అంగమగధదేశములనుండి గౌడమునకు వచ్చుట కదియొక్కటే మార్గము. వింధ్యపృష్ఠమును దాటుట కామార్గము కొంచెము పశ్చిమముగా తిరుగ వలసివచ్చినది. అచ్చటనే గిరిశిఖరమున రాతితో దుర్భేద్యమైన మండలాదుర్గమును కట్టినారు. ఆదుర్గమునుండి ఒక్కరాయి వేసినయెడల గౌడదేశ మాక్రమించుటకు వచ్చుచున్నసైన్య మాయిరుకుదారిలో ఆగిపోవు నని జనులు చెప్పుదురు.

ఒకనాటి పగలు రెండుజాములవేళ యోధుఁ డొకఁడు గుఱ్ఱ మెక్కి ఆకొండమలుపునడుమనుండి దుర్గముక్రిందికి వచ్చినాఁడు. అక్కడనుండి దుర్గమువరకు కొండపైకి దారి ఉన్నది. ఆదారివెంట కొండనెక్కి దుర్గముదగ్గరికి వచ్చినాఁడు. తోరణమందున్నకావలావాండ్రు అతనిసంగతి కనుగొని ద్వారము తెరచినారు. అతఁడు దుర్గములో ప్రవేశించినాఁడు.

ఆసమయమున ఉద్దండపురమహాసామంతుఁడైన భీష్మదేవుఁడు దుర్గప్రాంగణమున కూర్చుండియున్నాఁడు. యోధుఁ డతనిదగ్గరికివచ్చి అభివాదనము చేసి 'మహారాజ! రాష్ట్రకూటసైన్యము నిన్న సాయంకాలము చంపానగరమును వశపరచుకొన్నది. ఈమండలాదుర్గము నాక్రమించుటకు వారప్పుడే బయలుదేరినారు.' అనిమనవి చేసినాఁడు.

'మంచిది. నగరములోనికి వచ్చునప్పుడు వారి నెవరైన అడ్డుకొన్నారా?'

'లేదు. తమసెలవుప్రకారము పౌరు లానగరపురోహితుని పట్టు కొని బంధించినారు. రాష్ట్రకూటులు నగరములోనికి వచ్చినతరువాత అతనిని విడుదల చేసినారు.'

'రాష్ట్రకూటసైన్యములకు నాయకుఁ డెవ్వరు?'

రాష్ట్రకూటరాజు గోవిందదేవుఁడు స్వయముగా సైన్యములను నడపుచున్నాఁడు. అతనివెంట రాష్ట్రకూటరాజకుమారుఁడు కక్కదే వుఁడుకూడ ఉన్నాఁడు.'

'మంచిది. నీ విఁక విశ్రాంతి తీసుకొనవచ్చును.'

క్షణకాలములో భీష్మదేవుని సెలవుప్రకారము దుర్గమును రక్షిం చుచున్న పదివేలసైన్యము ఆప్రాంగణమున కూడినది. వృద్ధమహానా యకుఁ డొకప్రక్క నిలువఁబడి గొంతెత్తి సైనికుల నుద్దేశించి 'బంధు వులారా! రేపు ప్రొద్దుటనే శత్రుసేనలు వచ్చి ఈదుర్గమును ఆక్రమిం చును. దుర్గములో ఈపదివేలసైనికులకు వారమురోజులవరకు సరిపోవు ఆహారసామగ్రి ఉన్నది. ఎంత అర్ధాన్నము తిని నిలచినను పదునైదు రోజులకంటె ఎక్కువకాల మీదుర్గమును కాపాడలేము. ఎవరెవరు తిరిగిపోవఁదలంచుకొన్నారో వారందరు ఇప్పుడే వెళ్లిపోవచ్చును. వెన్నుజూపక రాష్ట్రకూటులతో యుద్ధముచేయఁదలంచుకొన్నవారెల్ల దుర్గరక్షణకై నిలఁబడవలసినది. ఈయుద్ధమునుండి మరల తిరిగివత్తు మను ఆశ బొత్తుగా లేదు. ఈయుద్ధముతోనే గౌడసామ్రాజ్యపుభవి ష్యత్తు తేలఁగలదు. ఈకొండమలుపులో గౌడసామ్రాజ్యపుభాగ్య పరీక్ష జరుగును. ప్రాణముపై తీపిగలవారు, మరల భార్యాపుత్రుల మొగము చూచుట కాశించుచున్నవారు నిరభ్యంతరముగ వెళ్లిపోవ చ్చును. వారికోసము దుర్గద్వారము తెరచియున్నది. దుర్గరక్షణకై ప్రాణము లర్పించఁదలఁచుకొన్నవా రందరు బయలుదేరండి! బంధువు

లారా! రేపటియుద్ధమున గౌడేశ్వరునకు జయము కలుగవచ్చును. కాని మనముమాత్రము తిరిగిరాము.' అని చెప్పినాడు.

ఆమాటల కాపదివేలమందిలో ఒక్కడైనను మారాడలేదు. మగధసేనావారమునుండి ఒకడును, గౌడసేనావారమునుండి ఒకడును ముందుకు వచ్చి మహానాయకున కభివాదనముచేసి 'మహారాజ! ఈదుర్గరక్షణకై మీవెంట వచ్చినవారిలో ఒక్కడైన తిరిగిపోవుట కాశించుట లేదు. ప్రాణము లున్నంతవరకు ఈపదివేలమంది కూడ దుర్గమును వదలిపెట్టిపోరు.' అని చెప్పినారు.

సంధ్యాసమయమున వింధ్యపర్వతపు వెంగను వేలకొలది నగడులు కనబడినవి. అది చూచి రాష్ట్రకూటసైన్యము వచ్చిన దని గ్రహించి భీష్మదేవుడు యుద్ధసన్నాహము చేసినాడు. మరునాడు ప్రొద్దుపొడువకమునుపే రాష్ట్రకూటులు మండలాదుర్గమును ముట్టడించుటకు వచ్చినారు. ఆకొండమలుపులో ఒక్కమారుగా ఎక్కువసైన్యము కూడుటకు వీలులేదు. అందుచేత పగలురెండుజాములవరకు కూడ ఎంతప్రయత్నించినను రాష్ట్రకూటులు ముందడుగు పెట్టలేకపోయినారు. కొద్దిపాటిగౌడసైన్యమే మాటిమాటికి వారిని వెనుకకు కొట్టివేయుచున్నది. అప్పుడు రాష్ట్రకూటసేనానాయకు లందరు ఆగిరిసంకటమునకు నాలుగువైపుల నున్న పర్వతశిఖరములను వశపరచుకొనుటకు యత్నించినారు. వేలకొలది రాష్ట్రకూటసైనికులు వచ్చి ఆపర్వతమును చాలాచోట్ల ఒక్కమారుగా ముట్టడించినారు.

భీష్మదేవునిదగ్గర అయిదువేలకన్న ఎక్కువసైన్యము లేదు. అతడు ఆకొండచరియను, దుర్గమును రక్షించుటకు రెండువేలసైన్యమును ఉంచి తక్కినసైన్యమును పర్వతశిఖరములం దక్కడక్కడ కాపుంచినాడు. రాష్ట్రకూటులు వచ్చి ముట్టడించినతోడనే గౌడసైని

కులు పెద్దపెద్దబండరాళ్ళను దొర్లించసాగినారు. రాళ్ళదెబ్బకు వందల కొలఁది రాష్ట్రకూటసైనికులు పడిపోవుచున్నారు. అయినను ఇసుక పాతరవలె రాష్ట్రకూటసైన్యము తరుగుటలేదు. ఎదుటిసైన్యము వేల కొలఁది చచ్చిపోవుచున్నను గౌడసైనికులు నిలువఁబడలేకున్నారు. ఒక్క రాష్ట్రకూటసైనికుఁడు పడిపోయినచో మరల పదిమందిసైనికు లాస్థాన మాక్రమించుచున్నారు. ఒకగౌడసైనికుఁడుగాని, మగధసైని కుఁడుగాని చచ్చిపోయినచో ఆశవమును తీసివేయుటకుకూడ మను ష్యులు లేరు. ఆస్థితిలోఁగూడ గౌడసైనికులు వెనుకంజవేయక పోరా డినారు. ఎంతపోరాడినను పర్వతశిఖరములను నిలుపుకొనుట దుష్కర మైపోయినది. సంధ్యాసమయము కాకమునుపే రాష్ట్రకూటసైనికు లొక్కమారుగా వచ్చిపడి పడమటివైపున నున్న గిరిశిఖరములనుండి గౌడసేనను పారదోలినారు. గిరిశిఖరములు వశమైనంతనే సాహసించి కొండచరియను ఆక్రమించసాగిరినారు. కొండచరియను కాపాడుటకు యత్నించినచో సైన్యము లెక్కలేకుండ నాశనమైపోవు నని కనుపెట్టి భీష్మదేవుఁడు గౌడసైన్యమును యావత్తు దుర్గములోనికి రావలసినదని ఆజ్ఞాపించినాఁడు. చావఁగా మిగిలిన మగధసైనికులను గౌడమార్గము ను రక్షించుటకు నియమించినాఁడు.

సాయంకాల మైనది. అయినను యుద్ధ మాగిపోలేదు. లెక్క లేనన్నికాగడాలు వెలిగించినారు. గిరిసంకటమును లోఁబరచుకొన్న వెంటనే రాష్ట్రకూటసైనికు లొక్కమారుగా దుర్గమును, గౌడమార్గ మునుగూడ ముట్టడించినారు. ఈమారు ప్రవాహము తిరిగిపోయినది. ఆచీకటిచాటున కొద్దిపాటిగౌడసైనికులు దుర్గముక్రిందను, గిరిసంకట మందును రాష్ట్రకూటులను ఎన్నిమారులో ఓడించినారు. రాష్ట్రకూ టులకు ఊపిరి సలుప లేదు. వచ్చినవారు వచ్చినట్లే చచ్చిపోవుచు

న్నారు. అది చూచి గోవిందదేవుఁడు ఇఁక చీఁకటిలో దుర్గమును లోఁబరచుకొనుట అసాధ్యమని గ్రహించినాఁడు. అప్పటి కప్పుడే భీష్మదేవునిసైన్యములో చచ్చిపోయినవారు దెబ్బతినిపడిపోయినవారు సగమునకుపైగా ఉన్నారు. దాదాపు పాకవేయిమంది దుర్గములోను, దుర్గమువెనుక గిరిసంకటమందు పదునైదువందలమందియు మిగిలి యున్నారు.

అర్ధరాత్రము కావచ్చినది. ఇఁక దుర్గము లోఁబడుట అసంభవ మని తెలిసికొని గోవిందదేవుఁడు ఆరాత్రికి యుద్ధ మాపవలసినదని ప్రస్తావించఁదలపెట్టినాఁడు. సరిగా ఆసమయముననే దుర్గమువెనుక వైపున గంగాతీరమందున్న పర్వతశిఖరములపై వేలకొలఁదికాగడాలు కాన్పించినవి. అది చూచి రాష్ట్రకూటసైనికులు మహోత్సాహముతో సింహనాదములు చేసినారు. ఆజయకోలాహలమునకు వింధ్యపర్వతము యావత్తు కంపించిపోయినది. అది చూచి గౌడసైనికులు ప్రమాదము వచ్చునని గ్రహించినారు.

ఆమధ్యాహ్నమే గోవిందదేవుఁడు వింధ్యపర్వతమువెనుకనుండి మఱొకమార్గ మేదైన ఉన్నదేమో కనుగొనుటకు పదివేలసైన్యమును పంపినాఁడు. ఆసైనికులు వేరొకమార్గమున పర్వతశిఖరము దాటివచ్చి వెనుకవైపునుండి దుర్గముపై బడినారు. కాగడాలవెలుగున రాష్ట్రకూటసైన్య మీసంగతిని కనుపెట్టినది. దుర్గారోహమైనపర్వతశిఖరము దాటి మఱొకరాష్ట్రకూటసైన్యము వెనుకవైపునుండి దుర్గమును ఆక్రమించుటకు వచ్చినదని దుర్గములోనివారికికూడ తెలిసినది. వారికి సహాయము వచ్చువా రెవ్వరును లేరు. సమ్ముఖమున రాష్ట్రకూట సైన్యము, వెనుకవైపున రాష్ట్రకూటసైన్యము చూచినతోడనే గౌడ సైనికుల కాళ్లుచేతులు చల్లఁబడినవి. యుద్ధవ్యవసాయముననే తలనెరసి

పోయిన భీష్మదేవుఁడుకూడ ఈదెబ్బతో యుద్ధము పరిసమాప్త మగు ననియే భావించినాఁడు. ఒక్కమారు గౌడసైనికుల కేసి చూచిఅతఁడు కన్నీరు విడిచినాఁడు. తరువాత సైనికుల నుద్దేశించి ' బాంధవులారా! ఇప్పుడు మనస్థితి ఎట్లున్నదో నేను మీకు చెప్పనక్కఱలేదు. ఇఁక గిరిసంకటమును కాపాడుట మనతరముగాదు. మనము దుర్గములో ఉండిపోయినయెడల వారమురోజులవరకు రాష్ట్రకూటసైన్యము మనల నేమియు చేయఁజాలదు. కాని దుర్గమును ముట్టడించుట కిక్కడ కొద్ది పాటిసైన్యము నుంచి తక్కినసైన్యముతో మనము చూచుచుండఁగానే గౌడరాష్ట్రమును ఆక్రమించుటకు గోవిందదేవుఁడు నిరభ్యాంతరముగ బయలుదేరి పోగలఁడు.—'

అంతలో దుర్గము వెనుకనున్న రాష్ట్రకూటసైనికు లొక్కపెట్టున జయనాదమును చేసినారు. అది విని వృద్ధమహానాయకుఁడు తొం దరతొందరగా మరల ' ఇఁక సమయము లేదు. వెనుకనుండి శత్రు సైన్యము దుర్గముపైఁ బడుచున్నది. ఉన్నవారము మనము కొద్దిమం దిమి. అయినను ఈమండలాదుర్గమంతయు శత్రువనుమాట లేకుండఁ జేసిఁగాని మనము చావఁగూడదు. ' అని చెప్పినాఁడు.

మహానాయకునిసమ్ముఖమున ఒకసేనానాయకుఁడు నిలుచఁ బడి యున్నాఁడు. అతఁ డామాట విని ఒక్కమారు జయధ్వని చేసి నాఁడు. వెంటనే రెండువేలమందిసైనికులుకూడ దుర్గము కంపించిపో వునట్లు జయనాదము చేసినారు. భీష్మదేవుఁ డాసేనానాయకుని కేసి చూచి ' గురుదత్తా ! దుర్గమునకు నిప్పంటించుము. ' అని ఆజ్ఞాపించినాఁ డు. గురుదత్తునియాదేశానుసారము దుర్గమందున్నగృహముల కన్నిటికి నిప్పంటించినారు. చూచుచుండఁగానే మండలాదుర్గము అగ్నికుండ ముగా మారిపోయినది. ఖణఖణధ్వనులతో దుర్గమున నున్న ఒక్క-

ద్వారమును తెరచినారు. ఎనుబదేండ్లు నిండిన వృద్ధమహానాయకుఁడు కుడిచేతితో బరువైనచక్రధ్వజమును పట్టుకొని ఇరువదేండ్లయువకుని వలె దుర్గములోనుండి బయలుదేరి మెట్లమీదుగా దుముకుచు క్రిందికి దిగిరా మొదలుపెట్టినాఁడు. అది చూచి గిరిసంకటమం దున్న గౌడ సైనికులు రాష్ట్రకూటసైనికులు నిర్విణ్ణులైపోయినారు. గౌడసైనికు లం దరు మహోత్సాహముతో ఒక్కమారుగా జయనాదము చేసినారు. ఎదుటనున్న రాష్ట్రకూటసైనికులు భయపడి రెండడుగులు వెనుకకు వచ్చినారు. రాత్రి మహాంధకారమును చెదరఁగొట్టుచు మండలానుగ్రమం దలి అగ్నిజ్వాలలు మిన్నంటుచున్నవి. ఆవెలుతురులో సమస్త గౌడసై న్యము మెరుపువలె వచ్చి రాష్ట్రకూటసైన్యముపైఁ బడినది. ఆమహా ప్రవాహమున కాగలేక రాష్ట్రకూటులు వెనుకకు పోసాగినారు. గోవిం దదేవుఁడు స్వయముగా వచ్చి ముందునిలువఁబడినాఁడు. అయినను గౌడసైనికు లాగలేదు. రాష్ట్రకూటులు వారిముందు నిలువలేకపోయి నారు. ఎంతసింహవిక్రమముచూపినను లాభము లేకున్నది. వేలకొలఁది రాష్ట్రకూటసైనికు లొక్కమారుగా మూడువైపులనుండి ఆకొండపాటి గౌడమగధసైన్యమును ఆక్రమించినారు. అయినను వారిని నిలువరిం చుటకు శక్యముగాకపోయినది. మెల్లమెల్లగా గోవిందదేవుఁడు వెనుకకు రాసాగినాఁడు.

రెండువేలమంది సైనికులకు నాలుగువందలమందిమాత్రము మిగి లినారు. అప్పటికి గిరిసంకటము శత్రుశూన్యమైనది. రాత్రి మూడవ జాము గడచినది. దుర్గమందలిఅగ్నిజ్వాల క్రమక్రమముగా చల్లా పోవుచున్నది. ఆసమయమున వృద్ధమహానాయకుఁ డైనభీష్మదేవుఁడ ఆకొండలోయలో పశ్చిమముఖుఁడై క్రిందపడిపోయినాఁడు. ఆతని [illegible] నాఁడు. అతఁ డామహానాయకునితల పు

కొని నెమ్మదిగా కూర్చుండఁబెట్టినాఁడు. ఆమహానాయకునిశరీరముపై పదుమూడుచోట్ల పెద్దకత్తిదెబ్బ లున్నవి. ఆగాయములనుండి ఎడతెగకుండ రక్తము ప్రవహించుచున్నది. అయినను ఆమహానాయకుఁడు 'గురుదత్తా! చక్రధ్వజ మెత్తిపట్టుకో! అది కనఁబడకపోయినయెడల సైనికు లధైర్యపడుదురు. లే. నాస్థానము నీవు తీసుకో. ఒక్కసైనికుఁడు బ్రతికియున్నప్పటికికూడ యుద్ధము ముగియఁగూడ దని సైనికులతో చెప్పు.' అన్నాఁడు.

ఈమాటలు చెప్పి ఆమహానాయకుఁడు లేచి నిలువఁబడుటకు యత్నించినాఁడు. కాని వెంటనే తూలిపడిపోయినాఁడు. మిగిలినసైనికులు, సేనానులు వచ్చి సత్యవ్రతుఁడైనకౌరవభీష్మునికంటె ఆమగధనాయకుని మృతదేహమునకు నాలుగువైపుల చుట్టుకొని నిలఁబడినారు. ఆసమయముననే మహాధాటితో రాష్ట్రకూటసైన్యము మరల వచ్చి ఆలోయమొగను ఆక్రమించినది. మహానాయకునిశవమును వెనుకనుంచుకొని గౌడసైనికులు లోయను కాపాడుటకై ముందుకు వచ్చినారు. బరువైనచక్రధ్వజమును బుజముపై పెట్టుకొని గురుదత్తుఁడు నిలువఁబడినాఁడు. నాలుగువందలగౌడసైనికులును రేచుకుక్కలవలె వచ్చి రాష్ట్రకూటసైనికులపై దూకినారు. వారిధాటి కాగలేక రాష్ట్రకూటసైనికులు వెనుకకు పారిపోయినారు.

రాత్రి నాలుగవజాము వెళ్ళిపోవచ్చినది. తూర్పు తెల్లవారునప్పటికి ఇరువదిమందిగౌడమగధసైనికులు చక్రధ్వజముదగ్గరికి వచ్చి నిలువఁబడినారు. ఒంటిమీఁది గాయములనుండి రక్తము స్రవించుటచే వారు చాలాక్షీణించిపోయినారు. అప్పటికి దుర్గములోని అగ్నిజ్వాలలు చల్లారిపోయినవి. కాలగా మిగిలినవాటినుండి ఇంకను తెరలు తెరలుగా పొగవచ్చుచున్నది. పొగనూరి పోయినవిగ్రహములను పై

తెల్లనిఉషఃకాంతి ప్రకాశించినది. ఆకాశమందలి మబ్బుతునుకలు కొంచెం ఎఱ్ఱబడినవి. అయిదువేలసైన్యమునకు ఇరువదిమందిమాత్రము మిగిలినారు. వారందరు చక్రిధ్వజముచుట్టును నిలువఁబడినారు. అప్పు టికి గురుదత్తున కెన్నో గాయములు తగిలినవి. అతని చేతిలోనుండి చక్రిధ్వజము తూలిపడిపోవుచున్నది. ఆయిరువదిమంది సైనికులు ఒక చేతిలో చక్రిధ్వజమును రెండవచేతిలో ఖడ్గమును పట్టుకొని మరల యుద్ధమునకు సిద్ధమైనారు. ఇంతలో ఆమార్గపుమెట్లవరుసక్రిందికి ఘోషుఁడొకఁడు గుఱ్ఱమెక్కి వచ్చినాఁడు. అతని వెనుక చాలా సైన్య మున్నది. వారందరు జయనాదము చేయసాగినారు. అప్పటికి గౌడ సైనికులు పదునలుగురుమాత్రమే మిగిలియున్నారు. వారు చక్రధ్వజ మును రక్షించుటకై సన్నద్ధులైనారు. సైన్యము వచ్చుట చూచి క్షీణ స్వరముతో వారు గౌడేశ్వరునికి జయము పలికినారు. అది విని అశ్వారూఢుఁడై వచ్చినఆఘోషుఁడు ముందుకు వచ్చి 'ఉద్ధవా! అదుగో చక్రధ్వజము!' అని అన్నాఁడు.

ఆమాట విని అతని వెనుకనున్న సైన్యము జయనాదము చేసి నది. ఉద్ధవ ఘోషుఁడును, పరమభట్టారక గౌడేశ్వరుఁడును ముందుకు వచ్చినారు. చావఁగామిగిలినపదునలుగురుగౌడ సైనికులును తమచక్రి వర్తి కభివాదనము చేసినారు. గురుదత్తుఁడు తూలుచుతూలుచు చక్ర వర్తికడకు వచ్చి చక్రిధ్వజమును అతని చేత కప్పగించినాఁడు. గౌడ సామ్రాజ్యద్వారము శత్రువశము కాకుండ నిలచినది. కాని అయి దువేలసైన్యమునకు పదునలుగురుసైనికులుమాత్రమే మిగిలినారు.

---

# ౯

## తోరణ రక్షణము

ప్రస్తనీస ప్రశంసించుకొనుచు గౌడేశ్వరుఁడు చక్రధ్వజమును తీసుకొన్నాఁడు. గుఱ్ఱమునుండి దిగి చక్రధ్వజము చేతఁబట్టుకొని యే భీష్మదేవునిశవ మెక్కడ నున్నదని అడిగినాఁడు. దెబ్బతగిలి పడిపోయిన సైనికుఁ డొకఁడు దూరముగా నున్నశవస్థానమును చూపించినాఁడు. గౌడేశ్వరుఁ డక్కడికి వెళ్ళి వృద్ధమహానాయకునిశవము ప్రక్క కూర్చున్నాఁడు. అతనివెంట వచ్చినఅయిదువేలసైన్యము పర్వతము దాటి లోయమొగకు వచ్చి నిలువఁబడినది. గౌడేశ్వరుని ప్రక్కనే ఉద్ధవఘోషుఁడు నిలువఁబడియున్నాఁడు.

'మహారాజ! మరల శత్రుసేన వెంటనే వచ్చిపడఁగలదు. ఈలోపున మహానాయకునిశవమున కగ్నిసంస్కారము చేయవలసినదని ఆదేశించండి.' అని ఉద్ధవఘోషుఁ డన్నాఁడు.

వెంటనే గౌడేశ్వరునిముఖకళ మారిపోయినది. అతఁడు 'ఉద్ధవా! భీష్మదేవునిశవమున కగ్నిసంస్కారము చేయవలసినది నేను గాదు. నాతరువాత గౌడసింహాసన మెవఁ డెక్కెడునో వారి దాపని. నాకోసము గౌడసైనికులైదువేలమంది ప్రాణములకు తెగించి ఈలోయను కాపాడుటకు వచ్చినారు. వారిలో పదునాలుగురుమాత్రమే మిగిలినారు. ఈస్థితిలో మరల నేను గౌడనగరమునకు తిరిగిపోఁగలనని మీరనుకొనుచున్నారా? గౌడులకు రాష్ట్రకూటుల కున్నతగాదా నేఁటితో తీరిపోవలెను. ఇదే యుద్ధమునకు చివరరోజు.' అని అన్నాఁడు.

ఆమాట విని ఆవృద్ధునికన్నులు ఎఱ్ఱనై పోయినవి. అతఁడు ధర్మపాలునిముఖము కేసి చూచి ‘ మహారాజ ! అదియే సంతోషమైన మాట. ఇఁక ఆలస్య మెందుకు ? లెండి. ఈరోజుతో యుద్ధము పరిసమాప్త మైపోవలెను. ’ అని అన్నాఁడు.

వారుభయులు భీష్మదేవునిశవమును విడిచిపెట్టి లోయకెదురుగకు వచ్చి నిలువఁబడినారు. దూరమున చెట్లచాటున రాష్ట్రకూటశిబిర మున్నది. కాని ఆశిబిరములో యుద్ధసన్నాహము కాని ఉత్సాహము కాని ఉన్నట్లు తోచలేదు. ధర్మపాలదేవుఁ డిది చూచి చాలా విస్మయపడినాఁడు. ఇంతలో కొంచెముదూరమున ఇద్దరుమనుష్యులు కనఁబడినారు. కాళ్ళకు చెప్పులును, తలకు తలపాగాలును లేకుండ నిరాయుధులై వారు లోయవైపు వచ్చుచున్నారు. వారు దగ్గఱకు రాఁగానే తమకన్నులకు గంతలు కట్టుకొన్నారు. అది చూచి వారు దూత లని ధర్మపాలుఁడు గ్రహించినాఁడు. వెంటనే ఆగంతలు విప్పివేయవలసిన దని సెలవిచ్చినాఁడు. అప్పుడు వారు గౌడేశ్వరుని కేసి చూచి ‘ మేము మహారాష్ట్రబ్రాహ్మణులము. దక్షిణాధీశ్వరుని సెలవుమీఁద గౌడసేనానాయకునిదగ్గరికి వచ్చినాము. ఆసేనానాయకునిదగ్గరికి మమ్ము తీసుకొనిపోవలసినది. ’ అని చెప్పినారు. ఆమాట విని ఒకసైనికుఁడు ‘ బ్రాహ్మణులారా ! మహారాజాధిరాజగౌడేశ్వరధర్మపాలదేవులవారు మీయెదుట నిలఁబడియున్నారు. ఇదిగో వీరే. ’ అని అన్నాఁడు.

‘ రాజాధిరాజ గౌడేశ్వరునకు జయమగుగాక. ’

‘ మీ రేమిపనిమీఁద వచ్చినారు ?’ అని గౌడేశ్వరుఁడు వారి నడిగినాఁడు.

'నిన్నరాత్రి మండలాదుర్గమును రక్షించిన సేనానాయకుని కలసికొనవలెను.'

'ఎందుకు?'

'దక్షిణాపథేశ్వరుఁడు స్వయముగా ఆసేనానాయకుని కలసికొనఁగోరుచున్నాఁడు.'

'మగధాధీశ్వరుఁడైన మహానాయక భీష్మదేవుఁడే నిన్న మండలాదుర్గమును, కొండలోయను కాపాడినాఁడు. కాని బ్రాహ్మణోత్తములారా! దక్షిణాపథేశ్వరుఁ డిఁక ఆయనను కలసికొనలేఁడు. ఇప్పటికప్పుడే ఆయన బహుదూరము వెళ్లిపోయినాఁడు.'

గౌడేశ్వరుఁ డాబ్రాహ్మణులను తనవెంట తీసుకొనివెళ్ళి భీష్మదేవునిశవము చూపించినాఁడు. అప్పటికప్పుడే సైనికులు యుద్ధరంగమునుండి శూలములు, ఈటెలు, బల్లెములు ఏరితెచ్చి ఆభీష్మదేవునికి శరతల్పము నిర్మించినారు. ఆతల్పముప్రక్కనే చితికూడ పేర్చినారు. ఆబ్రాహ్మణు లాశవమును చూచి ముఖము వంచుకొన్నారు. వెంటనే గౌడేశ్వరునివద్ద సెలవుపుచ్చుకొని రాష్ట్రకూటశిబిరమునకు వెళ్లిపోయినారు.

రెండుగడియలతరువాత ఒకసైనికుఁడు వచ్చి గౌడేశ్వరునితో 'మరల ఆబ్రాహ్మణు లీవైపునకు వచ్చుచున్నారు.' అని కబురు చెప్పినాఁడు. వారిని తీసుకొనిరావలసిన దని అతఁడు సెలవిచ్చినాఁడు. కొంతసేపటికా బ్రాహ్మణు లక్కడికి వచ్చి గౌడేశ్వరున కాశీర్వాదము చేసినారు.

'ఏమిటి సంగతి?' అని గౌడేశ్వరుఁ డడిగినాఁడు.

'మహారాజ! జయమగుఁగాక! మహారాజాధిరాజ గోవిందదేవుఁడు గౌడేశ్వరుని దర్శనము కోరుచున్నాఁడు. సెలవైనచో ఇంట

రిగా నిరాయుధుఁడై అతఁడు గౌడేశ్వరునిసన్నిధికి వచ్చును.'

'ఎందుకోసము?' అని గౌడేశ్వరుఁడు విస్మితుఁడై అడిగినాఁడు.

' మహారాజ ! అది మాకు తెలియదు. '

' సరే. మంచిది. '

బ్రాహ్మణులు వెళ్ళిపోయినారు. రెండుగడియలతరువాత ఒక్క సైనికుఁడు వచ్చి ' రాష్ట్రకూటశిబిరమునుండి ఇరువురుమనుష్యు లీవైపునకు వచ్చుచున్నారు. ' అని కబురు చెప్పినాఁడు. ధర్మపాలుఁడప్పు డొకచెట్టుక్రింద పచ్చగడ్డిపై కూర్చుండియున్నాఁడు. సైనికుని మాట విని కొండలోయవైపు ముఖము త్రిప్పి చూచినాఁడు. ఒకపురుషుఁడు కొండలోయవైపు వచ్చుచున్నట్లు కనుపెట్టినాఁడు. ఆపురుషుఁడు తెల్లనిపట్టుబట్టలు కట్టుకొన్నాఁడు. పైన ఒక పట్టుత్తరీయము వేసుకొన్నాఁడు. ఇదివర కెప్పుడును చూడకున్నను ఆగాంభీర్యమును, ఆజానుబాహువిగ్రహమును, పచ్చనిశరీరచ్ఛాయను బట్టి ఆవచ్చుచున్నపురుషుఁడే గోవిందదేవుఁ డని ధర్మపాలుఁడు గ్రహించినాఁడు. వెంటనే అతనిని అభ్యర్థించుటకై పాదచారియై ఆలోయదాటి ఎదురుగా వెళ్లినాఁడు. గోవిందదేవుఁడు నెమ్మదిగా నడచి దగ్గరికి వచ్చినాఁడు. వెంటనే గౌడేశ్వరుఁడు ఖడ్గముతో అతని కభివాదనము చేసి తరువాత ఖడ్గమును దూరముగా ఉంచివేసినాఁడు. గోవిందదేవుఁడు దూరముననుండి తమరేనా గౌడేశ్వరులు ?' అని అడిగినాఁడు.

' అవును. నాపేరే ధర్మపాలుఁడు. '

వెంటనే ఆజానుబాహువైన గోవిందదేవుఁడు వచ్చి ధర్మపాలదేవుని కౌగలించుకొన్నాఁడు. ధర్మపాలదేవుఁడు విస్మితుఁడైపోయి అతనిముఖముకేసి రెప్పవేయక చూడసాగినాఁడు. అప్పుడు గోవిందదేవుఁడు కౌగిటిపట్టు వదలి ' గౌడేశ్వరా ! వృద్ధమహానాయకుని కలసి

కొనుభాగ్యము లేకపోయినది. అయినను ఆమహాపురుషుని పాదధూళి నైన దొరకునని ఇచటికి వచ్చినాను.' అని విచారముతో అన్నాఁడు.

గౌడేశ్వరుఁడు ధూళిమలినమైన నుదుటిచెమట తుడుచుకొనుచు 'మహారాజ! మీ రన్నమాట నాకు బోధపడలేదు.' అన్నాఁడు.

'నిన్నటిపగటియుద్ధము చూచియే నేను నివ్వెరపడినాను. రాత్రియుద్ధముతో నాకు మతిపోయినది. ప్రొద్దుటనే ఆవీరునిపదధూళి గ్రహించుటకై అనుమతి కోరినాను. కాని ఆమహావీరుఁడప్పుడే బహు దూరము పోయినాఁ డని విన్నాను. ధర్మపాలదేవ! నేను ప్రౌఢుఁడను. చిన్నప్పటినుండి యుద్ధవ్యవసాయముననే కాలముబుచ్చినాను. నాతండ్రిగారితోకూడ ఉత్తరాపథమందు, దక్షిణాపథమందు ఎన్నో యుద్ధయాత్రలు చేసినాను. కాని ఈయద్భుతవిక్రమము, ఈపూర్వ కౌశలము, ఈయసాధారణాత్మత్యాగము, ఎక్కడను చూడలేదు. న న్నామహామహునిశవముదగ్గరికి తీసుకొనివెళ్లుఁడు.

వారుభయులు మెల్లమెల్లగా భీష్మదేవునిశవముప్రక్కకు వెళ్లి నిలువఁబడినారు. గోవిందదేవుఁ డాశవమునకు నమస్కరించి ఆవృద్ధ మహానాయకుని పాదధూళిని శిరసాధరించినాఁడు. భీష్మదేవుని తలవైపున సైనికుఁ డొకఁడు దెబ్బతగిలి పడిపోయియున్నాఁడు. ఇది చూచి ఆసైనికుఁడు జయధ్వని చేసినాఁడు. అది విని వెంటవెంటనే అయిదు వేలగౌడసైనికు లొక్కమారు జయనాదము చేసినారు.

గోవిందదేవుఁడు లేచి నిలువఁబడి ధర్మపాలదేవునిచేయి పట్టుకొని 'గౌడేశ్వరా! నాతప్పు క్షమించవలెను. నారక్తపిపాస తగ్గిపోయినది. దగ్ధమైపోయిన ఈయార్యావర్తమునకు ఇప్పటికైన శాంతి కలుగుఁగాక.' అని అన్నాఁడు.

ఈమాట విని, దెబ్బతిని పడిపోయియున్న ఆసైనికుఁడు గభాలున లేచి వచ్చి గోవిందదేవుని కౌఁగలించుకొని 'రాష్ట్రకూటరా...!

నీవు వీరుఁడవు. వీరుల నెట్లు పూజింపవలెనో నేర్చుకొన్నావు. నేను నిన్నిప్పు డాశీర్వదించుచున్నాను. నీకు శుభమగుఁగాక.' అనిఅన్నాఁడు.

వెంటనే ధర్మపాలుఁ డాసైనికునిచేయి బట్టుకొని ' గురుదత్తా! ఉండు.' అని గోవిందదేవుని కేసి చూచి ' మీరన్నమాట నాకర్థము కాలేదు. మీరు తిరిగి శిబిరమునకు వెళ్లి యుద్ధమునకు సిద్ధపడుఁడు.' అని అన్నాఁడు.

ఆమాటకు గోవిందదేవుఁడు తలవంచుకొని మెల్లగా ' గౌడే శ్వరా ! యుద్ధ మప్పుడే ముగిసిపోయినది. మరల సిద్ధపడు టెందుకు?' అని అన్నాఁడు.

పిచ్చివానివలె కేకలేయుచు గౌడేశ్వరుఁడు ' లేదు. మహారా జ ! యుద్ధము ముగియలేదు. యుద్ధము జరిగితీరవలెను. నేను మరల తిరిగి గౌడనగరమునకు వెళ్లఁదలఁచుకొనలేదు. తాతతండ్రులనాటినుండి స్వామిభక్తులై నన్ను సేవించుచున్న అయిదువేలమంది సైనికు లీపోరు లో నాకోసము ప్రాణములర్పించినారు. నేనది మరచిపోలేను. మహా రాజ! ఈమండలదుర్గమే ధర్మపాలునిసమాధిక్షేత్రము. సాయంకాల మగునప్పటికి ఈక్షేత్రముననే పదివేలమందిగౌడసైనికులకుకూడ శాశ్వ ములు ఏర్పించవలసియున్నది. ఆలస్యము చేయుటకు వీలులేదు. మీరు త్వరగా శిబిరమునకు తిరిగిపొండు. వెంటనే యుద్ధ మారంభ మగుఁ గాక ! రేపు వాక్పాలదేవుఁడు గౌడేశ్వరుఁడు కాఁగలఁడు. మీ రప్పు డాతనికి రాష్ట్రకూటరాజకన్యనిచ్చి పెండ్లిచేయవచ్చును.'అనిఅన్నాడు.

గొణుగుగొణుగుతో గోవిందదేవుఁడు ' ధర్మపాల ! నీవు నాకు పుత్రునివంటివాఁడవు. నేను నీపాదములు స్పృశించినమొదల నీకశు భము కలుగును. నాకది ఇష్టము లేదు. నాతప్పు క్షమించు. యుద్ధము ముగిసినది. నే నోడిపోయినాను. ఈపోరులో భీష్మదేవుఁడు నిన్న రాత్రి ఏకైమంలో నన్ను ఓడఁగొట్టినాఁడ.' అని అన్నాఁడు.

ఈమాటలు విని గౌడేశ్వరునికాళ్లు తేలిపోయినవి. అతనికి [illegible]మనట్లు గ్రహించి గోవిందదేవుఁడు వెంటనే సందిట [illegible]నన్నా! నాకోసము నీవెన్నో సైచినావు. నేను బ్రతికియు [illegible]వరకు నీకాలికి ముల్లైనఁ గాడ గుచ్చుకొననీయను.' అనిఅన్నాఁడు.

ధర్మపాలుఁ డామాట వినీవినకుండనే మూర్ఛపడిపోయినాఁడు. రాష్ట్రకూటులు, మగధులు, గౌడులుకలసి పేర్చినచితిమీఁదనే భీష్మదేవునిశవమున కగ్నిసంస్కారము జరగినది. ఎన్నోయేండ్లు గడచినత రువాత వింధ్యపర్వతముమొదట పొలముదున్నుకొనుకొండజాతివారి కిప్పటికిని ఆభస్మావశేషము కానవచ్చుచుండును. భరతవర్షమున బౌద్ధధర్మ మున్నంతవరకు ఆచితాభస్మముపై నిర్మించినవిశాలచైత్య మునకు బౌద్ధు లర్చనచేయుచువచ్చినారు.

ఆరోజుసాయంకాల మొకసైనికుఁడు గుఱ్ఱమెక్కి గౌడేశ్వరుని దగ్గరికి వచ్చి 'మహారాజా! నేను అమృతానందుఁడను. నన్నిచ్చటికి విశ్వానందులవారు పంపినారు. 'గౌడరాజ్యక్షేమముకోసము మహా దేవి కల్యాణీదేవి లోకనాథేశ్వరుని సన్నిధిని ప్రాయోపవేశముచేసి దేహత్యాగము చేయుచున్నది. కావున మీరు శీఘ్రముగ బయలు దేరి రావలెను ' అని విశ్వానందులవారు మీతో మనవిచేయు మని నారు. ' అని చెప్పినాఁడు.

ఆమాట విని ఉద్ధవఘోషుఁడు చిన్నబిడ్డవలె ఏడ్పుమొదలు పెట్టినాఁడు. గౌడేశ్వరునితల తిరిగిపోయినది. ఆరాత్రియే అతఁడు ఏకాయెకిని గౌడనగరమునకు బయలుదేరినాఁడు. అతనివెంట గోవింద దేవుఁడు, ఉద్ధవఘోషుఁడును, అమృతానందుఁడు, రాష్ట్రకూటసేనా నాయకకక్కదేవుఁడు, కూడ బయలుదేరినారు. వారివెంట ఏబది మంది అంగరక్షకులుమాత్రి మున్నారు.

---

# ౧౦

## ఆత్మబలి.

గాడనగరప్రాంతమందున్న దేవాలయమున పూజాసామగ్రి సిద్ధపరచుకొని దాసిఒకతె పూజారికొర కెదురుచూచుచు కూర్చున్నది. అప్పటికిని నగరోపకంఠమందలి రాజమార్గమున మనుష్యులు తిరుగాడుటలేదు. కూర్చుండి కూర్చుండి ఆదాసి నగరమువైపు పొకమారు చూచినది. నగరమార్గమునబడి వచ్చుచున్న మనుష్యుఁ డొకఁ డామెకు కనఁబడినాఁడు. వెంటనే ఆమె లేచి నిలువఁబడినది.

నగరమునుండి వచ్చుచున్న మనుష్యుఁడు రాజమార్గమును విడిచిపెట్టి అడ్డుదారిని దేవాలయముదగ్గరికి వచ్చినాఁడు. ఆదాసి అతనిని చూచి ' స్వామీ! మీరుఇక్కడికే ? ' అని అడిగినది.

ఆవచ్చినవాఁడు పురుషోత్తమశర్మ. అతఁ డామెను చూచి ' ఎవరు ? మాధవి ? నీవేనా ? చాలాకాలమునుండి ఈమహాదేవుని పూజించుచువచ్చినాను. కాని ప్రయోజనము ఏమియు కోరలేదు. ఈవేళ మాత్రము ఒకప్రార్థన చేయవలెనని వచ్చినాను. ' అన్నాఁడు.

' ఏమిప్రార్థన స్వామీ ? '

' ఇం కేమున్నది ? ఈరోజునవైన మహారాజు తప్పక రావలెనని. ఈమహాదేవుఁ డనుగ్రహించినయెడల పాపము కల్యాణీదేవి చివరసారి తనభర్తను చూడఁగలదు. '

' అయితే స్వామీ! మహాదేవి బ్రతికియే యున్నదా ? '

' ఆఁ. కొనప్రాణముతో ఉన్నది. '

' అయితే నేను వెళ్ళి ఒకసారి ఆమెను చూచివచ్చెదను. మీరు

సావధానముగ మహాదేవుని ధ్యానించండి. పూజాసామగ్రి సిద్ధము చేసి పెట్టినాను. పూజారి రాఁగానే అర్చన కానియ్యవచ్చునని చెప్పండి.'

'మాధవీ! ఈవేళ నామనసు మనసులాగున లేదు. ఎందుచేతనో తహతహలాడిపోవుచున్నది. ఏమాట చెప్పుటకు తోఁచుటలేదు. నీ విప్పుడు ఱెక్కడికి?'

'చివరసారి మహాదేవి నొకమారు చూచి జన్మ తరింపఁజేసుకొనెదను. అటువంటిఇల్లాలిని కన్నులతో చూచినను చాలును. ఎన్నెన్నిపాపాలో చేసి ఈదాసీజన్మ మెత్తినాను. ఆమహాదేవిపాదధూళి సోకినయెడల నాపాపములు పటాపంచ లైపోవును. నాకు ముక్తివచ్చును.'

ప్రత్యుత్తరము వినకుండనే దాసి గబగబ అక్కడినుంచి వెళ్ళిపోయినది. పురుషోత్తమశర్మ గంగాస్నానము చేసి దేవాలయద్వారమున శయనించినాఁడు. ఒకఅరగడియసేపటికి వీథిలో గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినిపించినది. అశ్వారూఢుఁడైనపురుషుఁ డొకఁడు దేవాలయముముందరికి వచ్చి 'దేవాలయములో ఎవరున్నారు? అని కేక వేసినాఁడు.

ఆకేకతో పురుషోత్తమశర్మ తుల్లిపడి లేచి 'ఎవరు? అమృతానందా! మహారాజు తిరిగి వచ్చినాఁడా?' అని ఆత్రముతో అడిగినాఁడు.

'వచ్చినాఁడు! కాని నీ వెవరు?'

'నేను పురుషోత్తమశర్మను. జయ విశ్వనాథ!'

'ఏమిటి సంగతి?'

'త్వరగా లోకనాథాలయమునకు వెళ్లు. మహాదేవి ఇంతవరకు 'శోసప్రాణముతో' ఉన్నది.

ఆపురుషుఁడు మరి మాటాడకుండ గుఱ్ఱమును పరుగెత్తించి నాఁడు. అతఁడు వెళ్లిపోయినకొంచెముసేపటికి నిర్ధిలో మరల గుఱ్ఱ ములడెక్కలచప్పుడు వినవచ్చినది. వెంటనే పురుషోత్తమశర్మ లేచి గుడిలోని మహాదేవుని ఉద్దేశించి ‘ మహాదేవ ! నాతప్పు మన్నించ వలెను. నేనుకూడ మహాదేవిని చూచుటకు వెళ్లెదను. ఈరోజునకు మాత్రము నీపూజాసంగతి నీవే చూచుకో. ’ అని పైయుత్తరీయము వేసుకొని గుడికిబయలుదేరి వెళ్లినాఁడు.

మండలాదుర్గమునుండి రాత్రి బయలుదేరి తెల్లవారునప్పటికి ధర్మపాలదేవుఁడు గౌడనగరము ప్రవేశించినాఁడు. పరివారములేకుండ లెక్కనలుగురుమనుష్యులతో వచ్చిన గౌడేశ్వరుని చూచి నగరివాకిటి కాపలావాండ్రు ఆశ్చర్యపడినారు. వా రంతకుముందెప్పుడు గోవింద దేవుని చూడలేదు. అతఁడుకూడ వచ్చినాఁ డని అమృతానందుని వలన తెలిసి వారి కెక్కడలేని అశ్చర్యము కలిగినది. అప్పటి కప్పుడే నగరమం దంతట ఈవార్త వ్యాపించినది. ‘ రాష్ట్రకూటయుద్ధము ముగిసినది. దక్షిణాపథమున కేకచ్ఛత్రాధీశ్వరుఁ డైన గోవిందధారా వర్షుఁడు స్వయముగా గౌడేశ్వరునివెంట గౌడనగరమునకు వచ్చినాఁ డు. ’ అని జనులు గుమిగూడి చెప్పుకొనసాగినారు.

లోకనాథాలయమందు ఇసుకవేసిన రాలకుండ జనులు కిటకిట లాడిపోవుచున్నారు. మహామంత్రి గర్గదేవులవారు దేవాలయమంట పమున దర్భాసనము వేసుకొని కూర్చున్నాఁడు. అతనియెదుట అప్పు టికిని నేతిదీపము వెలుఁగుచున్నది. దూరముగా స్తంభములచాటున దాసీలు కాసాలు చాలమంది కూర్చుండియున్నారు. దేవాలయద్వార ములో కూర్చుండి విశ్వానందుఁడు మెల్లగా ‘ ప్రజ్ఞాపారమిత ’ అను గ్రంథమును చదువుచున్నాఁడు. దేవాలయమునకును రాజమాత పెద్ద

దేవి కల్యాణీదేవితలను తనతొడపై పెట్టుకొని కూర్చున్నది. ఆమె ప్రక్క మంజరీదేవి, అమలదేవి కూర్చున్నారు. దేవాలయములో ఆజ్య దీపము లింకను వెలుఁగుచునే ఉన్నవి. దేవాలయములో నున్నవా రందరును నీరవులు. ఒక్క పెద్దదేవిమాత్రము నమమనమను చేలచెరఁ గుతో కన్నులుతుడుచుకొనుచున్నది. కల్యాణి కొన్నాళ్లనుండి బొత్తుగా శుష్కించిపోయినది. మెరుగుబంగారువంటి ఆమెశరీరచ్ఛాయ పాలి పోయినది. క్షీణకంఠముతో ఆమె ‘ అమ్మా ! ఎవరైన వచ్చినారా? ’ అని అడిగినది.

పెద్దదేవి కన్నులు తుడుచుకొనుచు ‘ ఏమమ్మా ! ఎవ్వరును వచ్చినట్టులేదు. ’ అని అన్నది.

ఆసమయముననే ధర్మపాలుఁడు, గోవిందుఁడు, ఉద్ధవఘో షుఁడు, గుణదత్తుఁడు, అమృతానందుఁడు దేవాలయములోనికి వచ్చి నారు. కాలిచప్పుడు విని గర్గదేవులవారు లేచి నిలుచఁబడినారు. దూర మునుండియే వారిని చూచి విశ్వానందుఁడు చదువు చాలించి లేచి ‘ ధర్మపాలా ! వచ్చినావా నీవు ! ’ అని కేకవేసినాఁడు.

ఆమాట విని మంజరీదేవి, అమలాదేవి, దేవాలయములో ఒక మూలకు పోయి కూర్చున్నారు. ధర్మపాలదేవుఁడును, గోవిందదేవుఁ డును, విశ్వానందునివెంట గర్భగుడిలోనికి వచ్చినారు. ధర్మపాలుని చూడఁగానే రాజమాతకు దుఃఖము పొరలివచ్చినది. ఆమెకన్నులనుండి అవిరళాశ్రుధారలు ప్రవహించినవి. రుద్ధకంఠముతో ఆమె ‘ నాయనా! కల్యాణి మనలను విడిచిపెట్టి పోవుచున్నది. ’ అని ఏడ్చినది.

అమలస్వరముతో ధర్మపాలుఁడు ‘ కల్యాణీ ! కల్యాణీ ! ఏ మయినది ? ’ అని అడిగినాఁడు. అతనికంఠస్వరము విని కల్యాణీదేవి కన్నులు మిలమిల మెరసిపోయినవి. ధర్మపాలుఁడు వచ్చి కల్యాణి

ప్రక్క నేలమీద కూర్చున్నాఁడు. గోవిందదేవుఁడుకూడ అతనిప్రక్క నే కూర్చున్నాఁడు. వారివెనుక నిలుచుండి విశ్వానందుఁడు 'ధర్మ పాలా! కాలగతి తప్పించలేము. దేశమున వ్యాపించిన హాహాకార ములు కల్యాణికోమలహృదయమును చెదరఁగొట్టినవి. తనమూలము ననే గౌడసామ్రాజ్యమునకు, గౌడప్రజలకు, పాలవంశమునకు, నీకు సర్వనాశము వచ్చినదని అనుకొని కల్యాణి గుండెబ్రద్దలైనది. అందు కోసమే ఆమె మనలను విడిచిపెట్టిపోవుచున్నది.' అని అన్నాఁడు.

ధర్మపాలుఁడామాట విని కల్యాణి నూరడించుటకై 'కల్యాణీ! కల్యాణీ! శనిగొట్టురోజులు వెళ్ళిపోయినవి. ఇఁక యుద్ధమనుమాట లేదు. ఇదిగో చూడు. రాష్ట్రకూటరాజు జొంటరిగా నాతో కూడ గౌడ నగరమునకు వచ్చినాఁడు.' అని అన్నాఁడు.

'మిమ్ము కడసారిచూపు చూడకుండ నేను పోలేకపోయినాను. మీరు వచ్చినారు. నేనిఁక వెళ్ళిపోయెదను.' డగ్గుత్తికతో కల్యాణి అన్నది.

ధర్మపాలుఁడు కల్యాణి రెండుచేతులు పట్టుకొని మూతగొం తుకతో 'కల్యాణీ! ఎక్కడికి పోయెదవు కల్యాణీ!' అని అడిగినాఁడు.

'నాకు సమయము వచ్చినదని ఆయన చెప్పినాఁడు. ఆలోక మునుండి నాకు పిలుపువచ్చినది. నే నారాజ్యమునకు పోవుచున్నాను.'

'ఆమాట నీ కెవరు చెప్పినాఁడు కల్యాణీ?'

వెనుకనుండి విశ్వానందుఁడు 'ధర్మపాలా! దక్షిణాపథము నుండి తిరిగి వచ్చునప్పుడు దారిలో నా కొకగ్రుడ్డిబాలుఁడు దాపు రించినాఁడు. నేను శనిదేవతను తెచ్చినట్లు వానిని గౌడనగరమునకు తీసుకొనివచ్చినాను. వాఁడీకల్యాణితో 'నీకు నిర్వాణకాలము వచ్చి నది. జన్మజన్మాంతరాలనుండి నీ వానిర్వాణమార్గమును అనుసృరో

నుచున్నావు. ఈసారి నీకోసం మానిర్వాణద్వారము తెరచియుందును. నీయాత్మార్పణముతో గౌడరాజ్యమునకు, ప్రజలకు శని తొలఁగిపోవును.' అని చెప్పినాఁడు. ఆపిల్లవానిమాటలు నమ్మి కల్యాణి లోకనాథుని చరణసన్నిధిని ఆత్మార్పణము చేసినది.' అని అన్నాఁడు.

విశ్వానందుఁ డిఁక మాటాడలేకపోయినాఁడు. అతనిగొంతు మూసుకొనిపోయినది. కన్నులనుండి ఎడతెరపిలేకుండ బాష్పధారలు ప్రవహించినవి. కల్యాణదేవిగొంతు మరింత గొణుగుపోయినది. ఆమె ఎంతోప్రయత్నము చేసి తేల్చి తేల్చి 'నాకోసము—దిక్కు—మాలి—పోయిన—వారి—కై—ఆత్మా—ర్పణము—చేసుకొన్నాను—మీరు—వారికి—ఆశ్రయ—మియ్యండి.—అన్నది.

దేవాలయములో దీపములు మసకబారినవి. కల్యాణీదేవి జీవనదీపముకూడ నిర్వాణోన్ముఖ మైనది. ఆమెముఖము పాలిపోవుచుండుట చూచి ధర్మపాలుఁ డాత్రముతో 'వైద్యుఁడు! వైద్యుఁడు!' అని కేక వేసినాఁడు.

వెనుకనుండి విశ్వానందుఁ డతనిబుజముపై చేయివేసి 'వైద్యుని చేయి దాటిపోయినది. వత్సా! నీవు మండలాదుర్గమునకు బయలుదేరి వెళ్లినది మొదలుకొని కల్యాణి నీళ్లుకూడ పుక్కిలించలేదు.' అని చెప్పినాఁడు.

ఆమాట విని పిచ్చివానివలె ధర్మపాలుఁడు 'కల్యాణీ! కల్యాణీ!' అని పెద్దపెట్టున పిలిచినాఁడు. మూసుకొనిపోయిన కన్నులు మెల్లగా తెరచి 'నేను—వెళ్లి—పోవు—చున్నాను—మీరు—పిలువ—వద్దు—' అని అన్నది.

'కల్యాణీ! ఏమి తప్పు చేసినా నని నన్ను విడిచిపెట్టి పోవుచున్నావు? ఈసింహాసనము—ఈరాజ్యము, ఈదేశము,సమస్తముగంగలో

కలసిపోసి. కల్యాణి! నీవు నాదానవు. నారాయణసోముడు కోటకు దుర్గమును ముట్టడించిననాటినుండి నీవు నాదానవు. కల్యాణి! నీవు నాదానవు. నేను నిన్ను వెళ్లనీయను.

'మీ—తప్పు—లేదు నేను—మిమ్ము—కష్ట—పెట్టుట కు—వచ్చి—నాను—చివర మాట—మరల—మీరు—పెండ్లి—చేసు—కొనండి—'

గోవిందదేవుఁ డంతవరకు శిలాప్రతిమవలె నిశ్చేష్టుఁడై కూర్చున్నాఁడు. ఈమాటతో అతనికన్నులు గిఱ్ఱున నీరు తిరిగినవి. ఆకుల స్వరముతో 'అమ్మా! తప్పంతయు నాది. అందుకోసము నీవు ప్రాయశ్చిత్త మనుభవించు చుంటివి. ఘూర్జరయుద్ధమునకు తరువాత దుర్బలుఁడైపోయిన గౌడదేశమున నామూలముననే రక్తము ప్రవహించినది. దానికి నేనే కారకుఁడను. ఆతప్పు నాది. నీవు మరచిపో తల్లీ! నీరాజ్యము, నీసింహాసనము, నీస్వామి, వీటినన్నిటిని వదలిపెట్టి తొలిప్రాయమునందే నీ వెక్కడికి వెళ్ళెదవు తల్లీ!' అని బోరున కన్నీరు విడిచినాఁడు.

'తండ్రీ—నన్ను—మన్నించు—కర్మ—ఫలము—'

వెంటనే కల్యాణిముఖము వివర్ణమైపోయినది. [illegible] కష్టముతో ఆమె చివరసారి 'పెండ్లి—చేసుకో—' [illegible]

ధర్మపాలుఁడు కల్యాణిని సందిట పట్టుకొని [illegible] మొదలుపెట్టినాఁడు. ఆసమయమున గొంతెత్తి [illegible] ఘుఁడు దేవాలయములోనికి వచ్చి చుట్టుకొని [illegible] పడి 'అమ్మా! అమ్మా! కల్యాణీ! నను [illegible] ? నేను బ్రతుకఁగలనా? ఇందుకోసమేనా [illegible] డి? అయ్యో! వెఱ్ఱితల్లీ! నీవు గౌడపట్టమహాదేవివైనను [illegible] వస్త

ప్పటి కల్యాణివిగానే ఉన్నావు తల్లీ! నన్ను నీతో తీసుకొనిపోగా కల్యాణీ! నీవు లేని గోకర్ణదుర్గము నాకు శ్మశానము కాదా? కల్యాణీ! కల్యాణీ! మాటాడవేమి తల్లీ!' అని గోలకెత్తినాఁడు.

కల్యాణి మెల్లగా గుంటలుపడిపోయిన కన్నులను మరల ఒక మారు విప్పి 'ఆనంద—సుఖ—నీవు—ప్రభు—వెళ్ళి—' అని అన్నది.

ధర్మపాలుఁడు చిత్రప్రతిమవలె కూర్చుండిపోయినాఁడు. అతఁడీమాట విని 'కల్యాణీ! కల్యాణీ! నన్ను విడిచిపెట్టి పోవద్దు—అయ్యో! నన్ను విడిచి ఎక్కడికి వెళ్లఁగలవు నీవు? కల్యాణీ! అని రోదన మారంభించినాఁడు. విశ్వానందుఁడు ఉద్ధృతుఁడై లేవఁదీసి 'జగత్కల్యాణముకొరకు కల్యాణి ఆత్మార్పణము చేసినది. ఇఁక ఏడ్చి లాభము లేదు. లే. ఇది ఆనందసమయము. మన మేడ్పులు ఆమె కమంగళము. ఊరకో.' అని అన్నాఁడు.

కల్యాణిముఖమున కడసారిచిరునవ్వు తళుకుమని మెరసి ఆరిపోయినది. గుడిలోనిదీపము లారిపోయినవి. ఇంకేమున్నది? విశ్వానందుఁడు చెప్పుడు 'ధర్మపాలా! ఎవరిని పట్టుకొనియున్నావు? కల్యాణి వెళ్ళిపోయినది.' అని అన్నాఁడు.

---

# ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము

(1911 వ సంవత్సరములో స్థాపింపఁబడినది.)

## పిఠాపురము

నవలలు—నవరసభరితములగు నవలలు—పుణ్యచరిత్రములు.

100-250 పుటలకు మించకుండ—రెండుమాసములకొకసారిగా వెలువడును.

చందాదారుల సౌకర్యమునకై నవలల వెలలు చౌకచేసి పోస్టేజి మేమే భరించి పూర్వపునిబంధనలీక్రిందివిధముగా మార్చినాము.

—నిబంధనలు—

1. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా 0—4—0 చెల్లింపవలయును.

2. ఇందు రెండేసిమాసములకొకసారిగ వెలువడుచుండు నూటి రేపరుబైండుగల ప్రతిగ్రంథమును పోస్టేజి మనిఆర్డరుకమిషను మొదలగునవి మేమేభరించి రు1-0-0కిమాత్రమే చందాదారులకుఁ బంపుదుము.

3. చందాదారులగువారు వెనుకటిగ్రంథములన్నియుఁ గొనవలయునను నియమము లేదు. కాని వారు కోరినచో వెనుకటిపుస్తకములుకూడఁ జందాదారుల వెలలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

4. ఇందు ప్రకటింపఁబడు అనుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమము లేదు. కోరినవారికే పంపుచుందుము.

5. సంవత్సరముచందా అనఁగా ముందు ప్రకటింపఁబడు ఆఱుపుస్తకములకు రు 5—4—0 లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకములవఱకు ప్రతిపుస్తకమును అన్‌రిజస్టర్డుపార్సెలుగా పంపుచుందుము

## పురాణగ్రంథమాలిక, పిఠాపురము.

(తూర్పుగోదావరిజిల్లా.)

సంపాదకుఁడు:—నడకుదుటి వీరరాజుపంతులు

ఇందు రెండుమాసముల కొకసంపుటముగా సంపుటము 1 కి 200-250 పుటలవంతుల డెమ్మీసైజున పదునెనిమిదిపురాణములను, ఉపపురాణాదులను సంస్కృతమునుండి క్రమముగా వచనరూపమున నాంధ్రీకరించి సంవత్సరమున కాఱుసంపుటములుగాఁ బ్రకటించుచు నాంధ్రదేశమున మాయోపికకొలఁది భాషాసేవ నొనర్చుచుంటిమి.

1. ఇందుఁ జందాదారులగువారు రు 0-4-0 ప్రవేశరుసుము చెల్లింపవలయును. 2. చందాదారులకు పోస్టేజీ మేమేభరించి ఒక్కొక్క-సంపుట మొకరూపాయకుమాత్రమే పంపుచుందుము. మనీఆర్డరు కమిషన్‌తో రు 1-0-0 మాత్రమే యగుచుండును. ( చందాదారులు కానివారికి పోస్టేజీగాక రు 1-8-0 లు. )

ఇందు ప్రకటింపఁబడి వెలకు సిద్ధముగ నున్న గ్రంథములు

| | చందాదారులకు పోస్టేజీతో వెల. | ఇతరులకు పోస్టేజీకాక వెల. |
|---|---|---|
| 1. శివపురాణము ౧ సం. | 1-0-0 | 1-8-0 |
| 2. శివపురాణము ౨ సం. | 1-0-0 | 1-8-0 |
| 3. శివపురాణము ౩ సం. | 1-0-0 | 1-8-( |
| 4. శివపురాణము ౪ సం. | 1-0-0 | 1-8-( |
| 5. శివపురాణము ౫ సం. | 1-0-0 | 1-8-( |
| 6. బ్రహ్మపురాణము ౧ సం. | 1-0-0 | 1-8-( |
| 7. బ్రహ్మపురాణము ౨ సం. | 1-0-0 | 1-8 ( |
| 8. వామనపురాణము ౧ సం. | 1-0-0 | 1-8-0 |
| 9. వామనపురాణము ౨ సం. | 1-0-0 | 1-8-( |
| 10. వామనపురాణము ౩ సం. | 1-0-0 | 1-8-0 |
| 11. శివపురాణము ౬ సం. | 1-0-0 | 1-8-0 |
| 12. శివపురాణము ౭ సం. | 1-0-0 | 1-8-0 |

☞ వామనపురాణము సంపూర్ణగ్రంథము:—చందాదారులకు పోస్టేజీతో రు 2-8-0. ఇతరులకు పోస్టేజికాక రు 4-0-0 లు.

**సంపాదకుఁడు, పురాణగ్రంథమాలికాకార్యస్థానము, పిఠాపురము.**